# తోలుబొమ్మలు





రచన

"ఆంధ్రా వర్డ్సువర్తు"

శ్రీ కవికొండల వేంకటరావు, B. A., B. L.

ప్రకాశకులు

కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్

సంస్కృతాంధ్ర బుక్‌డిపో (స్థా. 1882) రాజమండ్రి.

# తోలుబొమ్మలు

రాత్రిరల్లా బొమ్మలాట చూచివచ్చి తెల్లవార్లూ నిదరలేక అవేపడగ్గా పడుకొ్కనివుంది ఇల్లాలు. ఇంటిలో వంటలక్క తప్పకలేచి పనిచేసుకుంటూవుంది. ఇంటియజమాని అప్పుడే కళ్లు నులుపుకుంటూ గుమ్మంలోకివచ్చి వీధికేసి తొంగిచూస్తూన్నాడు. బళ్ళున తెల్లారిపోయి ఎండబాగా గుడిగోపురంమీద ప్రకాశిస్తూవుంది— రాత్రిబొమ్మలాట ఆడిన వాళ్ళల్లో ఓ అడుదివచ్చి "ఒక పాత కోక అమ్మగార్ని అడుక్కోడానికివచ్చాం" అంది. "అమ్మగారింకా లేవలేదు. నిదరోతున్నారు" అన్నాడు యజమాని. "అమ్మగారైతే రాత్రి మా ఆటకు వచ్చారన్నమాటే. ధన్యులం, ధన్యులం. మళ్ళీవస్తాం" అంటూ వెళ్ళిపోయిందది.

ఆ మాటలో ఏమీఅర్థం కనబడలేదు యజమానికి. లోపలికివెళ్ళి కల్యకృత్యాలు దీర్చుకొని తనగదిలోనికివచ్చి తన యిల్లాలింకా మొద్దునిద్దర్నుంటే "లే! లే! తోలుబొమ్మలాటకే యిలా నిదరోతే, ఇంకానృత్యం అవీ నీవు దొరసానులల్లే చేయడమంటూవస్తే ఆలసిసొలసి కుంభకర్ణురాలివయి పొయ్యేటట్టున్నావు. లే! లే!" అని వీపుమీద ఒక్క మెత్తనిచఱుపు చఱిచాడు. ఇల్లాలు గుబుక్కునలేచి 'ఏమిటా మోటుహాస్యం!' అంది. 'ఏమీలేదు. నీవు బొమ్మలాటదానికి కోకిస్తానన్నావటగా? వచ్చిపోయింది' అన్నాడు యజమాని. 'నేను కోకిస్తాననలే. మీరు పంచిస్తానన్నారేమోగాని' అంది ఆబిడ. 'ఏమి మతిపోయిందాయేమి? అదిగో మళ్ళీవస్తానంటూ

# తోలుబొమ్మలు

రాత్రిరల్లా బొమ్మలాట చూచివచ్చి తెల్లవార్లూ నిదరలేక అదేపడగ్గా పడుకొన్నివుంది ఇల్లాలు. ఇంటిలో వంటలక్క తప్పకలేచి పనిచేసుకుంటూవుంది. ఇంటియజమాని అప్పుడే కళ్లు నులుపు కుంటూ గుమ్మంలోకివచ్చి వీధికేసి తొంగిచూస్తూన్నాడు. బళ్ళున తెల్లారిపోయి ఎండబాగా గుడిగోపురంమీద ప్రకాశిస్తూవుంది— రాత్రిబొమ్మలాట ఆడిన వాళ్ళల్లో ఓ ఆడుదివచ్చి "ఒక పాత కోక అమ్మగార్ని అడుక్కోడానికివచ్చాం" అంది. "అమ్మ గారింకా లేవలేదు. నిదరోతున్నారు" అన్నాడు యజమాని. "అమ్మగారైతే రాత్రి మా ఆటకు వచ్చారన్నమాటే. ధన్యులం, ధన్యులం. మళ్ళీవస్తాం" అంటూ వెళ్ళిపోయిందది.

ఆ మాటలో ఏమీఅర్థం కనబడలేదు యజమానికి. లోపలికివెళ్ళి కల్యకృత్యాలు దీర్చుకొని తనగదిలోనికివచ్చి తన యిల్లాలింకా మొద్దునిద్దర్నుంటే "లే! లే! తోలుబొమ్మలాటకే యిలా నిదరోతే, ఇంకానృత్యం అదీ నీవు దొరసానులల్లే చేయడమంటూవస్తే ఆలసిసొలసి కుంభకర్ణురాలివయి పొయ్యే టట్టున్నావు. లే! లే!" అని వీపుమీద ఒక్క మెత్తనిచఱపు చఱిచాడు. ఇల్లాలు గుబుక్కునలేచి 'ఏమిటా మోటుహాస్యం!' అంది. 'ఏమీలేదు. నీవు బొమ్మలాటదానికి కోకిస్తానన్నా వటగా? వచ్చిపోయింది' అన్నాడు యజమాని. 'నేను కోకిస్తాననలే. మీరు పంచిస్తానన్నారేమోగాని' అంది ఆబిడ. 'ఏమి మతిపోయిందాయేమి? అదిగో మళ్ళీవస్తానంటూ

పోయింది ' అన్నాడు యజమాని. ' వస్తే యిస్తారెండి ' అని ఓ విధమైన తెచ్చిపెట్టుకున్న రుసరుసమొగంతో నిదరమత్తు కొద్దీ చేతిగాజులు చెక్కిళ్ళనొత్తిన యొత్తుడునొవ్వులు నొవ్వుల్లా వుంచుకునే గదికిటికీ తెఱచుకొని వీధిలోకి పాఱచూచింది. చూచి ' అదేనా మీరనేమనిషి ? భిక్షురాలు—బొమ్మలాటకత్తె అంటారేమిటి ? ' అంది. ' అమ్మగారైతే రాత్రి ఆటకొచ్చారన్నమాటే. ధన్యులం, ధన్యులం అని అదిఅంది. నీవేమన్నా దాన్ని ఆనవాలు పట్టనట్టుగానే మాట్లాడుతున్నావు — అయితే ఈ తోలుబొమ్మల ఆటలో ఏదో ఒకానొక రహస్యం వుండి తీరాలి. తెలుసుకోవాలి ' అన్నాడు ఇంటాయన.

అప్పుడింకా ఆపయిని ఆయనకు ఆబిడకు ఈలా జటిగింది సంభాషణ :

ఇల్లాలు : నేను సాయంకాలం ఆరుగంటలకు ఆలాగు పేరంటానికి వెళ్ళినాను. ఆ యిసుకబయలున నాకేమి అగపించలేదు. ఒక గడపాతి యుండలేదు. ఒకమనిషి కనిపించలేదు.

యజమాని : సరిగా 6 ¼కు వాళ్లువచ్చి వెదుళ్లపాతి ఒక బురకాలాగు బరకం కప్పి ఎదరతట్టుకు తెరగుడ్డలు కట్టినారు. ఆ కట్టడం నీవు చూచి యుండలేదు.

ఇల్లా : ఎంతలో తయారయిపోయింది తెర ? అయితే దీపాలెప్పుడు వెలిగించారండీ ? బొమ్మలెప్పుడు గ్రుచ్చారూ ? ఆదేవాళ్లంతా ఆ బరకం క్రిందకు ఎప్పుడు ప్రవేశించినారూ ?

యజ : నీవు ఇంట్లో పనీగినీ ముగించుకుని వచ్చివేసేసరికి బొమ్మలనుగ్రుచ్చి ఆ తెరవెనక బొమ్మలనుగ్రుచ్చి ఆముదపు దీపాలను వ్రేలాడగట్టి అంతా సిద్ధంచేసినారు.

ఇల్లా : ఈ పగలల్లా భిక్షాటనకై తిరిగినవాళ్ళంతా ఆ బరకంచాటున వున్నారంటారూ నేను చూడ్డానికి వచ్చేటప్పటి కప్పుడే ?

యజ : మరేమి టనుకున్నావు ? మనం వాళ్ళను చీకట్లో చూడకుండా వాళ్ల దీపాలు వెలిగించకుండానే ఆ బరకంలో ప్రవే శించి యిప్పుడు దీపాలుపెట్టి బొమ్మల్ని ఆడిస్తారు.

ఇల్లా : నిజం ?

యజ : నిజం.

ఇల్లా : అయితే వాళ్ళకు ప్రేక్షకుల ప్రేక్ష్యం లేదన్న మాట.

యజ : వాళ్ళకు ప్రేక్షకులతో పనిలేదు. ఆ ఆడించే బొమ్మలతోనేపని. ఆ బొమ్మల మీదకు వెలుగు బాగా ప్రస రించేటట్టు దీపాలెగసందోస్తూ పాడుతూండడం బొమ్మలయొక్క కాళ్లు్రవేళ్ల అభినయింపిస్తూవుండడం వాళ్లపని.

ఇల్లా : మధ్యమధ్య బుఱ్ఱుమనేబూరా ఏమిటండీ ?

యజ : కిక్కిసికర్రబూరా.

ఇల్లా : హనుమంతుడు గిర్రునపల్టీలు కొట్టినప్పుడు చేసే చప్పుడు ?

యజ : రెండు చితికిపోయిన పీటచెక్కలు.

ఇల్లా : ఆఁ ! విఘ్నేశ్వరునిబొమ్మ ?

యజ : తోలుది.

ఇల్లా : సరస్వతి ?

యజ : అదీని.

ఇల్లా : రాముడు ? రావణుడు ?

యజ : అన్నీని. అందుకే తోలుబొమ్మలాటని పిలవడం.

ఇల్లా : అయితే ఆ ఆడించేవాళ్లంతా వీధులంట తిరిగే వాళ్లే అంటారా ? 'ఓయి రావణా' అని పిలవడం, 'పుత్ర= కొడుకులు, మిత్ర=స్నేహితులు, రథ=రథములు, భట= భటులు, బంధువర్గము' అని అర్థంచెప్పడం, 'బ్రహ్మాత్మభూ స్సురజ్యేష్ఠ పరమేష్ఠిపితామహః ఇత్యమరః' అని అనడం, చౌషష్టివిద్యలు ఏకరుపెట్టడం, ఇంతవిద్వత్తూవాళ్లదే నంటారా ?

యజ : అంతే అనుకున్నావూ ? పంపాసరోవరము, రథారూఢుండెక్కి, అనువుతుండు ఇలాంటివి కూడా వాళ్ళవేను.

ఇల్లా : నవ్వాకండీ ! తెలియక అడుగుతూవున్నాను. నా చెవుల్లోనుంచి యింకాపోలేదు ఆ దీర్ఘం తీసుకుంటూ వాళ్ళంతా కలిసి ఆతన్మయత్వంలో తాళం మద్దెల పూడోకాలంమీద వేస్తూ మైమఱచి——

యజ : మైమఱచి ?

ఇల్లా : మైమఱచి మనలను మఱపించినపుడు. మానవు డొకానొక తోలుబొమ్మ వెనుక దీపంవుంచి ఆ వెలుతురును దాని మీద పడేటట్టుచేస్తూ ఆ బొమ్మను చిన్నెలువన్నెలుగా ఆడిస్తూ ఆనందించేటప్పుడు, భగవంతుడు ఏవైపునా మనకుపైని, వెనుక, ముందు, సూర్యుడుమున్నగు జ్యోతిర్గోళాలను నిలిపి మనల నాడించడంలో ఎంతతన్మయుడై యుండాలంటారు ? ఆ భగ వంతుణ్ణి మనం ఆనవాలు పట్టలేమనడంలో, మన క్కనబడ డనడంలో, ఆశ్చర్యములేదు —— వీళ్ళగపించినారా మనకు ? చెప్పండి, వీళ్ళగపించినారా మనకు ? చెప్పండి——అదిల్లా తిరిగి వస్తూంది. మంచి కోకఒకటిద్దాం.

యజ : నీ యిష్టంవచ్చిందియ్యి.

ఇల్లాలు లోపలికివెళ్ళి ఒక కోకతీసికొని వచ్చి ఆబొమ్మ లాటదాని కిచ్చి 'రాత్రిఆడించిన బొమ్మలేమైనా నీ దగ్గ ఉన్నాయా? యిప్పుడు' అని అడిగింది. 'ఏమైనా ఏంటం డమ్మగారూ! పెద్దరాబణాసురుని బొమ్మేవుంది. ఇప్పుడేతెచ్చి చూపుతాను.' అని వెళ్ళినది. అది ఆ బొమ్మ తీసుకొనివచ్చే లోపుగా వంటలక్కవచ్చి 'అమ్మగారింకా ముఖం కడుక్కో లే'దంది. ఇల్లాలు 'ఉండవమ్మా! ఈ రోజున తోలుబొమ్మల యొక్క సంగతి పూర్తిగా తెలుసుకోవాలి' అని అంటూ పెఱటి లోనికి పోయి కల్యకృత్యములు దీర్చికొని తిరిగి వచ్చింది.

యజమాని ఆ లోపున ఆ తేబొయ్యేరావణాబమ్మబొమ్మ పగలెలావుంటుందో ఊహిస్తూ కూర్చున్నాడు. ఆ బొమ్మొ చ్చింది. ఇంటిల్లిపాదీ మూగిచూచినారు. నగిషీబొమ్మయొక్క అందచందం, కీలుకీలుఅతుకు అతిచిత్రంగా కనిపించింది. చేతులు మేకతోలు. మొండెం దుప్పితోలు. ఆ బొమ్మనలాగూర్చి తేజ స్సులో పెట్టేసరికి ఎక్కడలేనిరంగుల రాణింపూ! చెప్పశక్యం కాకపోయింది.

ఉండియుండి తోలుబొమ్మలాడించిన దానికేసిచూస్తూ ఇల్లాలు అడిగింది: 'నీవు రాత్రి ఆ బరకంలోవున్నావా?' అని. 'మీరు రాలేదండి మఱి' అంది ఆ ఆటకత్తె.

వాళ్ళిద్దఱియొక్క ఆ పరస్పర మహాసమస్యను అక్కడ వున్న యజమానికాదుగదా ఎవ్వరూకూడా తీర్చలేకపోయినారు.

ఆటకత్తె తనదారిని తానుతిరిగి రావణాబొమ్మెచ్చుకుని, ఇచ్చిన కోకుచ్చుకుని వెళ్ళిపోయింది. అది వెళ్ళిపోయిన వెంటనే

యజమాని ఇల్లాలుదిక్కై ‘ బ్రహ్మాండంగా రావణాబమ్మబొమ్మ దాన్ని పనిగట్టుకు పట్టుకురమ్మనమని, పట్టపగలు బొమ్మంతా పరిశీలించి తుదకాబొమ్మను గుఱించి ఒక్కముక్కా అడక్కుండా నీవు రాత్రి ఆ బరకంలో వున్నావా ? అని ఆ ఆటకత్తెను అడిగావేంటి. అదుండక మఱెవరుండి ఆడించేరు ఆ బొమ్మల్ని అంతసొంపుగా ’ అన్నాడు. ఇల్లాలు అంది. ‘ రావణాసురుని బొమ్మలో రాత్రిచూచిందానికన్న ఇప్పుడు పగలు చూడ్డంలో నాకేమి వింత తట్టలేదు. కాని ఈ భిక్షుకురాలు రాత్రి ఆబరకంలో వుండి ఆడించింది బొమ్మల్ని అంటే నాకింకను సందేహమే ’ అని— ‘ అందుకే నీవు ఆటచూడ్డానికి రాలేదని అదీ అనుకుంటూంది ’ అన్నాడు యజమాని. ‘ అవును కొన్ని సంగతులు మనం చూడగల్గినా, చూడకపోయినా మనం నమ్మాలి ’ అంది ఇల్లాలు.

“ సంశయాత్మా వినశ్యతి ” అన్నాడు యజమాని.

## ఒ. కె. దె న్.

నిత్యమూ నడుస్తూవున్నరస్తాయే,

నిత్యం చూ స్తూ న్న మెట్లే—

అయితేం ఆ నిమేష మప్పుడు అంత చైతన్య మెట్లా కలిగిందా ఆ తావుకు అని అనుకొంటూ నా ద్రుక్కుగ్ధాన్ని తలచి చూచాను. నవనీతంలాంటి యువతి. వేణుగోపాలమూర్తి వంటి యువకుడు, అమృతమధన మప్పుడు కష్టపడ్డవాళ్లకూడా స్వాధీనంకాక నాకు స్వాధీనపడ్డట్టు సాక్షాత్కరించి వూరుకున్నారు. అను కొన్నాను వాళ్ళ యిద్దఱిచేత హైరోడ్డుమీద నేదో ఆట ఆడించా లని. చూడ్డంలో అందమూ వుంది ఆనందమూ వుంది ఆ యిద్దఱి లోను. అందులోనూ వారు పరస్పరం కలుసుకోవడంలో వారి మధ్య అందీ అందని ముద్దూ వుంది, చిక్కీ చిక్కని మురిపెమూ వుంది. ఆ ప్రాంతాన్ని ఆలాంటి సన్నివేశంలో కనబడేవాండ్రు మెడికల్ కాలేజీ స్టూడెంట్సు తప్ప మఱెవ్వరూకారు అనేది రూఢి.

అది ఏ ముద్దుగుమ్మకైనా సరే అలా సునాయాసంగా దిగతగ్గ ఏటువాలు వాటంవున్న రోడ్డు. ఆ రోడ్డే ఏ యువక రత్నమైనా సరే బలే పట్టుదలతో మీదికి పోతగ్గ ఎదురెత్తు కలదికూడాను. ఇంకా ఫోటో తీసినట్టు, వెండి తెరమీద వేసినట్టు వర్ణించమంటారా? అప్పుడే వెయ్యి న్నొక్క పాఠకునికళ్ళూ ఆ దిక్కుకు చూస్తూవున్నట్టున్నాయి! అతిశయోక్తి యేమీ వ్రాయను. మాటలకు లోభించను. చూసేవుంటారు మీలో చాలామంది.

ఆ రోడ్డుకు సరసనే మరోరోడ్డు వుంది. ఈ రెండో రోడ్డు మట్టం మొదటి దానికన్న ఎత్తు. అంచేత దీనిమీదినుంచి దానిమీదికి చేరుకోవాలీ అంటే మేడమెట్లలా మెట్లువున్నాయి. ఈ మెట్లమ్మటే పైకెక్కితే పైరోడ్డునంటి మేడలూ మేన్షన్లూ వున్నాయి. మళ్ళా ఆ రోడ్డునే ఏటవాలుగా దిగితే క్రింది రోడ్డు మీదికే వస్తాం! మెట్లకూ మేన్షన్లకూ ఎట్ట యెదురుగా 'వే ఇన్' 'వే అవుట్' 'వే'లు రెండింటికీ మధ్య మెయిన్ వే. దేనివి?— కింగ్ జార్జి హస్పిటాల్, విశాఖపట్నానివి—!

చూచారా ఎక్కడ కొచ్చామో? మనవూరు—మనరోడ్డు— మన హాస్పటాలు—ఆ రోడ్డు పుచ్చుకుని ఓ వెంపుకు వెడితే మహాసముద్రం, మరోవెంపుకు వెడితే ఇంటీరియర్! ఇన్‌లాండ్! ఎక్కడకూ వెళ్ళదలచుకోకుండా అక్కడి కక్కడే ఏర్పాటుగా చూడాలీ అంటే అనతి దూరంలో ఓ మఱ్ఱిచెట్టు, మఱ్ఱి చెట్టుక్రింద వో పెట్టిబండీ కనబడకమానవు. మీరు ఎప్పుడైనా చూచారో లేదో నేను వానిని లక్షసారులు చూచాను. ఈకథ కవికి ఉపకరించవుగాని మరో కథకు గొప్ప బాక్ గ్రౌండ్ అని నా నమ్మకం!

"ప్రతాప్!" అంది యువతి. యువకరత్నం 'హాలో!' నీవు సాయంకాలం సంగీతప్పోటీలో ఒక అభ్యర్థివేనూ? కాని యువతి 'ష్యూర్లీ!' ప్రతాప్ 'ఐ ఏమ్ సో గ్లాడూ' అంటూ డెర్బీషూన్ మీదవున్నవాడల్లా రబ్బర్ షూన్ మీద? లంఘించినట్టు ఒక్క ఎగురు ఎగిరి ఆలా ఎడంకాలు ముందుకాన్చి కుడికాలు వెనక్కు ఎత్తుతూ—తిరుగుడు చక్రం వెనకాల పరుగెత్తే పిల్లడిలా పరుగెత్తుతూ పైని వివరించిన మెట్లమ్మటే మధ్య మెట్లు రెండేసిగా విడిచి అమాంతంగా ప్రక్కరోడ్డుమీద ఇంకా

అనోసుతోనే కొబడజొచ్చాడు. యువతి 'ప్రతాప్! ఇలా రావోయి! మాట!' అంది. ఆ మాటకు ప్రతాప్ కంపస్ ముల్లులా వెనక్కి తిరిగి, మెట్లమ్మట కాకుండా తిన్నగా దిగు తలతన్నే పరుగెత్తుకుంటూ రెండురోడ్ల అఖండప్పఅపులోగాని ఆగలేదు. అప్పటికప్పుడే యువతి ఆ ప్రాంతానికే తానున్న రోడ్డుయొక్క ఏటవాలునే దిగికొంటూ 'ప్రతాప్! ఆ మెట్లు అన్నీ ఎందుకట్టారో తెలుసునా? ఒకదాని మీదనుంచి ఒక దాని మీదుగా పైకిపోవాలని కాదూ? రెండేసి రెండేసిగా దాటెయ్యవచ్చా అలా?' అని అడిగింది. 'ఈ సూత్రం గనుక ఈ సాయంత్రం వీణ పోటీలో నీవు అనుసరిస్తివా 'సరిగమ పదనిస' 'సనిదప మగరిస' 'సరిగమ పదనిస' 'సనిదప మగరిస' అంటూ మళ్ళీ అలాగ్గానే మెట్లు రెండేసో—ఈ పర్యా యం మూడేసోకూడా వదలిపెట్టుకుంటూ మిన్ను ముట్టాడు.

యువతి ఆ యువక మహాశయునియొక్క మిన్నందటం గమనిస్తూ 'ఓ. కె. డెన్' అనుకుంది. సాయంత్రం ఆమె వీణె మెట్లెన్ని విడిచిపెట్టి 'ప్రయిజుకొట్టిందో' ఒక్క ప్రతాప్కే ఎఱుక!

# 766 శకుంతల

నెంబరు 1 శకుంతల
మనందఱకూ తెలిసిందే—

"అనాఘ్రాతం పుష్పం, కిసలయమలూనం కరరుహై
రనావిద్ధం రత్నం, మధునవ మనాస్వాదితరసం
అఖండం పుణ్యానాం ఫలమివచ తద్రూప మనఘం."

మఱి నెంబరు 766 శకుంతల ఎట్లావుంటుందీ అన్న విషయమే ఎవరికీ తెలియని విషయము. అదే యీ కథలో చెప్ప బోయే విశేషం. అయితే నెం 2, నెం 3, నెం 4—ఇలా నెం 765 వరకు గల వారినందర్నీ గురించి వ్రాయనక్కఱలేదా 766 కు రావడానికి అని సందేహించేరేమో! వారు సర్వసామాన్యంగా అందఱకూ తెలిసినవారే. అంచేత వర్ణించడం మానేసేను. వర్ణించడం మొదలుపెట్టినా పుటలు పెరగడమే కాని విస్ఫుటంగా మన మనస్సుల్లో నిలబడరు వారెవరున్నూ. ఎవరో అటుకుల ధాటివారి శకుంతలమ్మ అనే యిల్లాలొకావిడ వుండేది అని వ్రాసేను అనుకోండి. అంతమాత్రంచేత 'అనాఘ్రాతం' లా ఘాటుగా గుర్తించడానికి వల్లబడుతుందా? వల్లపడదు. నెం 2 మొదలు, నెం 765 వరకు వున్న శకుంతలమ్మల కెవరికిన్ని స్వయం వ్యక్తిత్వం లేదనేచెప్పొచ్చు. నిజంగా మళ్లీ వ్రేలు మణచి చెప్పొస్తే నెం 766 శకుంతలే శకుంతల.

ఇతరులు ఆమెయొక్క సూదిమొనలా నిగ్గూ వాడిదేఱి వున్నటువంటి నాసికాగ్రాన్ని ఉపలక్షిస్తూ వుంటే ఆమె తన

త్రొంగలి తెప్పల్లోను. ఇతరులు ఆమెయొక్క విశాలమైన నున్నని తేటైన నెన్నుదురు పరీక్షిస్తూ వుంటే ఆమె తన వుంగరాల ముంగురుల్లోను దాచేసి మూసేసి ప్రేమభావం వెల్లడించే విదుషీ మణి. పైపై కేమాత్రం తేలే మనిషికాదు. అలాగ్గానే కూర్చుంది రైలు బండిలో. అలాంటి అందమైన వాళ్లెప్పుడున్నూ మెయిలు బండే ఎక్కుతారని వేఱే నే వ్రాయనక్కఱలేదు. ఆ రయిలు బండి మెయిలుబండి. ఆమె ఎక్కి కూర్చున్న పెట్టి పెద్ద పెట్టి. పెద్ద పెట్టి అంటే తెలియదూ పాఠకులకు? ఇటూ అటూ పచారు చెయ్యొచ్చు అందులో—ఖాళీ వొక్క మినహాయింపు. పెట్టి ఖాళీగా వుండాలి! మఱి మెయిలు ట్రెయిన్‌లో పెట్టి ఖాళీగా వుండడం అంటే కలికాలంలో నరకలోకం ఖాళీగా వుండడం ఎట్లాంటి అసంభవమో అట్లాంటి అసంభవ పరిస్థితి.

ఆమె పాపం అక్కడికీ ఆడవాళ్ళ పెట్టిలోనే ఎక్కి కూర్చుంది. అయితే ఇరుక్కు అన్ని పెట్టెలూ సర్వసామాన్య ములే. అందులోనూ ఆడవాళ్ల పృధు జఘనులు—పృధు—పృధు—చోటు ఆబరించు కూర్చోవడంలో వాళ్లు ఫస్టు. ఈమె కూడా తక్కిన వాళ్ళ కేమాత్రం తీసిపోకుండా కూర్చుంది.

రైలు రాజమండ్రి పెద్ద స్టేషనులో ఆగి ఇంజిన్ మార్చు కుంటూవుంటే, గాలికోసమన్నట్టు ఈమె—మనావిడ—(కథలో పాత్రనైనా మనావిడ అని వ్రాయడం సాంఘికపు రూల్సుకు వ్యతిరేక మనుకుంటాను) కథలోని ఆవిడ లేక ఈ కథానాయకు రాలు ప్లాట్‌ఫారమ్ మీదకు దిగి ఇటూ అటూ చూచి ‘మాబండీ ఇంజెన్కు క్లోజుగానే వుంది. అంచేతనే ఇంత కోల్డస్టు నా జుత్తు మీద పడింది’ అంటూ గోళ్లతో సరిచేసుకుని బండికి తగులు

కుంటూవున్న కొత్త ఇంజన్‌యొక్క అందం, చందం, పేరు గీరు, విర్ విసిల్ అన్నీ విలాసంగా చూస్తూ మధ్యమధ్య ఎవరి కోసమో అన్నట్లు తిలకిస్తూ వుంది.

ఆమె మైండ్ మాడరన్ ఫాషన్ ఫాక్టరీలో మోల్డు అయి ఎమెండ్ అయిన మైండ్ అని పాఠకులప్పుడే గ్రహించి వుంటారు ఆమెవద్ద కోయురేషియన్ టిక్కట్టు కలక్టరు వస్తూ 'టిక్కట్ మాడమ్' అన్నాడు. 'టిక్కట్ మావాళ్లవద్ద వున్నది' అంది. 'మావాళ్లు. హు?' అన్నాడు అతడు. అంటూ 'బండిలోని ఆసామానంతా?' అని అడిగాడు. 'అదంతా బెడ్డింగు' అంది. 'ఇట్ మస్టు బి వెయిడ్' అన్నాడు. 'నన్నూ వెయ్యాల' అంది. 'యు స్పీక్ ఇన్ ఇంగ్లీష్' అంటూ వెళ్ళి పోయి టిక్కట్టు కలక్టర్ గార్డుతో ఏమేమో చెప్పి ప్లాటుఫారమ్ మీదనుండి నిష్క్రమించేడు. బండీకూడా కదలిపోయింది.

నిడదవోలు స్టేషన్‌వద్ద బండి ఆగినప్పుడు గార్డు ఆడ వాళ్ళ బండివద్దకు వచ్చి ఆమె కూర్చున్న దగ్గఱ కిటికీలోంచి తొంగిచూస్తూ 'మాడెమ్! మావాళ్లు ఎక్కడ?' అన్నాడు. 'నాకు తెలీదు' అంది. గార్డు వెళ్ళి స్టేషన్ మాష్టరుతో చెప్పాడు ఏమిటో. స్టేషన్ మాష్టర్ వచ్చి 'అమ్మా! మీవాళ్లు అనడానికి మావాళ్లు అన్నాడు గార్డుదొరగారు. మీవాళ్లు ఎక్కడ?' అన్నాడు. 'మావాళ్లు అనకాపల్లిలో వున్నారు' అంది. 'మావాళ్ల వద్ద టిక్కట్టు అంటే అనకాపల్లిలోవున్న మీవాళ్ళ వద్దనా? ఈ పప్పుడకదు.' అని కిటికీగుండా లోనికి తొంగిచూచి 'మీవద్ద సామాను చాలా వున్నట్టు వున్నదే? చూడండి ఇక్కడ టైమ్ చాలదు. తాడేపల్లిగూడెంలోనా ఆట్టేసేపు నిలవదు.

మీ పేరు ? ' అన్నాడు. ' నా పేరు శకుంతల ' అంది ధైర్యంగా. ' సరేను. థాంక్సు ' అని వెళ్ళిపోయినాడు స్టేషన్‌మాస్టరు. రైలుకు ఈల ఇచ్చాడు గార్డు. గారు ఈలకు ప్రతిగా ఇంజెన్ కూసింది. రెండుకూతలకు మేళవింపుగా స్టేషన్‌లో గంట మోగింది. మూడూ ఏకకాలమందే జరిగినాయి అన్నా రైటో ! రైటో ! మెయిల్ నడుస్తూంది.

మెయిల్‌ప్రక్క పొలాలమీదుగా తీగెలగుండా మెయిల్లో వాళ్ళకు తెలీకుండా తంతివార్త వెళ్ళిపోతూవుంది మెయిలుకంటె ముందు ఏలూరుకు " Stop Sakuntala at Ellore ! " ఏలూరులో శకుంతలను ఆపివేయవలసింది అని. మెయిలుబండిలో ప్రయాణం చేస్తూవున్న శకుంతలకు ఏం తెలుసును ఆ సంగతి ? ఆమె నిశ్చింతగా నిగనిగలాడే కవరు వున్న నవల వొకటి చదువు కుంటూ వుంది కళ్లద్దాలంట కుటిలాలకాల్లోకి చిటార్ చూపులు చూచుకుంటూ.

ఏలూరు స్టేషన్ వచ్చింది. రైలు నిల్చింది. మన కథా నాయకి కూర్చున్న పెట్టిని చుట్టేశారు క్రమ క్రమంగా చాలా మంది. ఒకరేమిటి ? మొదట గార్డు. తరువాత స్టేషన్‌మాస్టర్. వారిద్దరూ ' దిగండమ్మామీరు, దిగాలమ్మామీరు ' అని ఒకడు ఇంగ్లీషులో ఒకడు అరవంలో అనడం ' గెడ్డవున్ ' ' ఎరింగో ' ధ్వనులు మిన్నుముట్టడం వింటూ తెనుగు ప్రయాణీకులు ఒక్కొక్కరే చుట్టేసుకున్నారు వారిద్దర్నీ ! ఆ చుట్టేసుకున్న ఆ ప్రయాణీకుల్ని చూడాలి ఆ నిమేషం. రియల్ ప్రోబ్లెమ్ అర్థంకాక నిక్కర్ తొడిగినవాని రెండు తొడల జేబుల్లోని రెండు చేతులూ అలాగే వుండిపోయినాయి వొక ప్రయాణీకునకు, మతో

ప్రయాణీకునకు గూడకట్టు స్టెప్‌బై స్టెప్ సింప్లిఫై అయిపోతూ తనంతటవే ఆ నిర్ఘాంతపు చూపుల్లో నిక్కర్ అయిపోతూవుంది!

తుదకు ఇంజన్ విడిచిపెట్టి డ్రైవర్, కోల్మన్. ల్యూబ్రికేటింగ్ ఆయిల్ పోసేవాడు ముగ్గురూ త్రిమూర్తుల్లా దిగవలసి వచ్చిందికూడాను.

కథానాయికి అంటుంది వాళ్లతో 'మీలో ఎవ్వరికైనా ఇంగ్లీషు వచ్చునా? ఇంగ్లీషు అక్షరాలు కూడాబలుక్కు చదవడం వచ్చునా? మొహాన్ని వ్రాసుకొని నేను తగుదునమ్మా శకుంతలమ్మను అని తిరుగుతూవున్నదాన్ని విడిచిపెట్టి దీన్ని ఫట్టుకు దించబోవడం మీమీ మౌఢ్యాన్ని సూచిస్తూవుంది. మీ అజ్ఞానాంధకారాన్ని వెలిబుచ్చుతూంది.' అని ఏమేమో ఘట్టిగా లెక్చరు దంచేసింది. ఆమె రైలుబండీ తలుపుప్రక్క కడ్డీమీదకు ఓచేయిఆంచి, రెండోచేత మూసిన పుస్తకం, పుటలమధ్య వేలెట్టి, వూచుతూ.

స్టేషన్ మేష్టర్ వెంటనే గార్డుతో 'వాంగోఅప్పా! మరో శకుంతల వుందేమో ఎక్కణ్ణయినా పారుంగో అప్పా!' అన్నాడు. అలా అంటూనే గార్డూ స్టేషన్ మాస్టరూ అన్ని బండ్లల్లోవున్న ఆడవాళ్ళపేర్లు కనుక్కోసాగారు, మధ్యమధ్య ఈమెతో 'ఎవరమ్మా? మరెవర్నీ కాణమే?' అంటూ.

కొంతసేపటికి తన చదావులు చప్పుడయ్యేటట్టు బండీ పురికి అమ్మ త్తకాసిని 'గుడ్డివాళ్లు మీరందరు. మడ్డ్లు హేడ్ గాళ్లు! కనబడ్డంలే 766 శకుంతల. బోల్డ్ లెటర్సులో ఎంజీన్ మీద. Stop it if you have power not me. మీకు శక్తివుంటే దాన్ని ఆపుకోండి. నన్నుకాదు' అని చూపుడువ్రేలితో చూపించి

తర్జనితో జడిపించి తన బండిలోకి తిరిగి ఎగిరి ఎక్కి కూర్చుంది నవ్వుతూ !

స్టేషన్ మాష్టరు "It might be. కావచ్చు. She is an educated lady. You see ఆమె విదుషీమణి ! Don't meddle with her. ఆమె జోలికి మనము పోరాదు." అని గార్డుతో అన్నాడు. ఇంజెన్ డ్రైవర్ ఆ మాటలు వింటూ గార్డును లాగి "You can never stop my engine whatever its name be! నా ఇంజెన్ పేరేమైనాసరే దాన్ని ఆపడానికి వల్లకాదు" అని బిర్రుగా ఇంజన్ ప్రక్క నిలబడ్డాడు. 766 నెంబరు శకుంతల మెయిల్ ఇంజన్ వాని ప్రక్కన ఒకటవ నెంబరు శకుంతల్లా మెఱసిపోయింది !

అనాఘ్రాతం—వాసన చూడడానికి వీలులేని పొగ, అలూనం కరరుహైః—గోళ్ళకు స్వాధీనం కాని ఇనుము, అనావిద్ధం—రంధ్రం చెయ్యడానికి రాని రాక్షసిబొగ్గు, అనాస్వాదిత రసం—తాగడానికి అసహ్యమైన వేన్నీళ్లు, ఫలమివచ తద్రూపమన ఘం—భుజించడానికి వలనుకాని మహాపతివ్రతాగ్నిహోత్రకాదు ! మహాపవిత్రాగ్నిహోత్రం అఖండం ? పరిపక్వమైన అగ్నిహోత్రం !

# జమీందారు

అక్కడతగాడు కూర్చొని యున్నాడని ఎవ్వరికీ తెలియదు. సామానంతా పట్నం చేర్చవలసినదిగా తాఖీదిచ్చి, గుమాస్తాలకు వొప్పజెప్పి తానొక సర్వసామాన్యజనుడిలా, ప్రచ్ఛన్నంగా కాలువ ఆవలి గట్టుకు బల్లకట్టుమీద దాటి, ఒంటిగా ఎండవేళ ఆవలిగట్టున చెట్టునీడను వేరుమీద వీపుజేరమోసేలా విశ్రమించి యున్నాడు. చెట్టు ఎన్నో గాలివానల కుర్రూతలూగి, చెక్కుచెదరని ఎదుగుతో ముదిమితో పేరెన్నికగన్న చింతచెట్టు. ఒకవంక ఏటేటా అది, చిగురునుండి గింజదాకా కన్నెపిల్లల కింపు గొల్పుతూ నవనవోన్మేషంగా వున్నా, వృద్ధులసంస్మృతి కతీతమై, గట్టు కూడా దాన్నిబట్టే పోశారా అన్నంత ఆనవాలురూపం కలిగి వుంది. చెంతనే గోదావరినదిపాయనుండి విడివడే కాలువ. కాలువయొడ్డు, కాలం వానాకాలం కావడంచేత, గడ్డి పట్టి ఆకు పచ్చగా వున్నాయి. కాని ఒక గట్టుమీద ఎర్రని కంకరరోడ్డు వేయబడి రాదారీ కనబడుతూ, బళ్ళూ ప్రజలూ ఏ వేళా సందడిగా వెడుతూవున్నజాడ కనిపిస్తుంది. ఊరు కూడా దానికి చేరి అదిగో అన్నట్టగపిస్తుంది. రెండవ గట్టెక్కితే అన్నీ ఊడ్చిన పొలాలూ, పొలాలమధ్య గున్నమామిడిచెట్లు చెన్నంగి కొబ్బరిచెట్లు, కూరపాదులు, కొంగలు, కలుపుతీత స్త్రీల కోకల రంగులు ఎన్నెన్నో కానవచ్చి ఆ గట్టుకూ ఈ గట్టుకూ ఎంత మాత్రం పోలికే లేదన్నట్టుంటుంది.

పాతకు లప్పుడే, బల్లకట్టవసరం లేకుండా, నా మాటల వెంబడినే కాలువ దాటి చింతచెట్టున్న గట్టుకు వచ్చినట్టున్నారు. కాని అట కూరుచున్నాతని దృష్టి రాజమార్గముమీదనే వున్నది.

మోటబళ్ళమీద మొరకుమనుష్యుల మూపులమీద నాడా రోడ్డమ్మట అతగాని సామానెంత తరలింపబడింది చెప్పశక్యం కాదు. అతడు నిన్నటివరకు ఆ కొంప్రదకధిపతి. వేలకొద్ది ఎకరాలకు జమీందారు. అతనెంత చెబితే అంత, నిన్నటివరకూ ఆ చుట్టుపట్టంతకూ, నేడొక్క శాసనంతో అతని జమీ లాగివేయబడి అతని కిరవై లక్షల రూపాయలు నష్టపరిహారంక్రింద యీయబడి 'నీ యిష్టమువచ్చిన చోటికి నీ చరాస్తితో వెళ్ళిపోవచ్చు. మరి ఇందుగల సెంటు భూమి నీదికాదు. ఇక్కడుండడానికి నీకు ఇల్లు లేదు. వల్లకాదు.' అని సర్కారువాదు ముదలయిడి సాగనంపేరు.

జమీందారుడు ముప్పైయేండ్ల వయస్సువాడు. వయస్సునకు తగిన అనుభవము గలవాడు. ఊహాప్రపంచములో మునిగి తేల్తూ అనుకొనువాడు. 'ఇన్నాళ్ళూ ఆవలిగట్టున నివసించి భోగించినదానికీ ఈ నా డొక్క ముహూర్త మీవలిగట్టున విశ్రమించుదానికీ ఎంత తేడా కనిపిస్తూవుంది!' అని విస్తుపోసాగాడు. తానెక్కడ కూరుచున్నది మరచిపోయాడు. అతని నెత్తిమీద నొక్కొక్కప్పుడు నల్లని నీటిమబ్బు, ఒక్కొక్కప్పుడు నిశితమైన వేడియెండ విచ్చలవిడి మారిపోతూవున్నాయి. కనుచూపుమేరలో, చిన్న చిన్న గడ్డిపూలు వికసిస్తూ కొన్ని, ముకుళింపుగంటూ కొన్ని కానవచ్చాయి. ఏదో పక్షికూత దూరం నుంచి ఆకాశమార్గాన తన్ను పలుకరించేది. ఊడ్చినచేలు దుబ్బు

కట్టి ఎత్తు ఎదిగి, తమ మీదుగా చల్లనిగాలి నడిచి పోయేలా, వాదుగు నొయ్యారం గల వయ్యాయి. అన్నింటికన్న తాను కూరుచున్న చింతచెట్టు నీడ రెట్టింతలు చల్లగా, ముమ్మరంగా, శాంతిప్రదంగా, తోచి, క్రమక్రమంగా నీటిమీద పడి వ్యాప్త మౌతూ వుంది. ఆ నీడ అలా పెచ్చుపెరిగి, ఆవలిగట్టు నెండలో చేరుకుంటుందా అనేదే అతగాని ఆలోచన ఆఘడియప్పుడు! చెట్టునీడ నీటిమీద పొడుగు కావడమే కంటూన్నాడు గాని సూర్యుడు పడమటకు వాలి క్రమక్రమంగా దిగిపోతున్న దృష్టి అతనికి సుతరాం లేదు. నీడలాగునే ప్రాణం, ప్రతిష్ట, చైతన్యం, చేష్ట గమనిస్తూ వున్నాడు.' 'నీడ దేనివల్ల ఏర్పడుతూ వున్నది?' అనే అంశంమీద అతనికి ధ్యానమే లేదు.

అయితే ఒకటి వుంది. అలా నీళ్ళమీద నీడనే ఎదర యొడ్డుకంటా చూపుసారించి దృష్టి కేంద్రీకరించడంలో, రాదారీని తరలింపుగనే అతని చరాస్తియొక్క అసంఖ్యాకరూపాల నీటి నీడలు నిలుకడ లేకుండా, ఒకే దిక్కుకు తల్లక్రిందులుగా సాగి పోతూన్నట్టు అతడు కనగలిగాడు. మోటుబళ్ళ చక్రాల తిరు గుళ్ళయొక్క కంకర యొరపిడి చప్పుళ్లు, గుర్రాల సకిలింపులు, ఏనుగుల గంటలు ఎన్నెన్నో అతని వీనులకు సోకి వింతగొలుప జొచ్చాయి. వింతలో అదోవిధమైన విచారమున్ను కలుగచేశాయి. కాని ఒక్క ధ్వనీ అక్కడాగింది లేదు. ఒక్కరూపమూ తన కెదురు తిరిగి ప్రశ్నించింది కాదు. క్రమక్రమంగా అతని బుద్ధి కుశాగ్రమైనకొద్దీ, ఆంతరంగికాలోచన కొక క్రొత్తకోణం ఏర్ప డింది. చెవులకో నూతనస్వరం వినబడసాగింది. అది అతనికి అపూర్వమైనదిగా తట్టింది.

ఒక మేనా సవారీ మోసే బోయీల మ్రోత అది ! అంత రాళమంతా ఆవరిస్తూ, దిశాంతమందు అంతరించి పోయి నట్టొక్కొక్కప్పుడు, మన చెవులనే తాకి గూబల్లో నిలబడి మారు మ్రోగుతూ న్నట్టొక్కొక్కప్పుడు ఆ ధ్వని ఆ ప్రాంత మందు అతిస్వేచ్ఛగా అనుతూ వచ్చింది.

ముందుకొమ్ము ముగ్గురు బోయీలు, వెనుకకొమ్ము ముగ్గురు బోయీలు మోస్తూవున్నారు. వెనకా ఒకడు పరుగిడుతూ వున్నాడు.—‘ అఁఓ—ఓ—అఁ—అఆఏ—ఎఏఅ—’ అని ఇలా ఆ ధ్వని హెచ్చుగా తగ్గు స్థాయిలాగా వినవస్తూ ఊరి నుండి చుట్టుదారిని రోడ్డుమీద కెక్కి జమీందారు కూర్చునివున్న చోటికి సరాసరి ఎదరున్న రేవు గమ్యస్థానంగా చేరుకుంటూ వున్నట్టైంది. పురుషుని హృదయం క్రొంగ్రొత్త స్పందనం గాజొచ్చింది.

ఈ రోజున కూడా ఆమె ఈ రేవులో స్నానంచేసి పూజా ద్రవ్యాలతో తరలివెళ్ళి దేవతాదర్శనం దేవాలయములో గావిం చడమేనా ?—‘ వద్దు !—నీవు తిన్నగా సామాను వెనకాలే వెళ్ళిపోవలసినది. వద్దు ! మనకు ! మరిదేవుడులేడు ! దేవాలయ ములో లేదు ! ’ అని ఆజ్ఞాపించానే ! నా ఆజ్ఞను ఆమె ఉల్లం ఘిస్తూ ఇటు వస్తూవుందా ? ఇక్కడ స్నానముచేస్తూ వుందా ? లేక తిన్నగా వెళ్ళిపోతూవుందా ? ’ అని అధికార కోపోద్రిక్త నయ నాల్తో ఆ వినవచ్చు మేనామ్రోతదెసకు తన చెవు లొక్కొక్క ప్పుడు పనిచి తన మెడ నొక్కొక్కప్పుడు త్రిప్పి, తనశ్రద్ధ నంతను, మేనాలోనుండక తప్పదని యనుకొని తాను తలంచు కొను చిన్న, అంగనయొక్క రూపురేఖలయందు, లీనమొనర్చించు

కొనుచు ' ఆమె మరి జమీందారిణి కాదు. సామాన్య స్త్రీ ' అని తుదకేదో విధమైన కనికర మామెయెడ వహించినవాడై ఆ జమీందారుడు తిరుగ కాలువ నీటివైపు, దాని పారుదలవైపు, గనుగొనువాడు. కాలువ ఎప్పటిచొప్పునే అందగించుచు ప్రవహించుచుండెను.

ఆ మేనాలో వచ్చుచున్న దాన, సాక్షాత్తు, అతగాని సహచారిణియే ! ఆ క్రితం రోజువరకును జమీందారిణి. జమీందారిణీ హోదాలో నున్నప్పుడు ఆమె నిరంతరం సాయం సంధ్యారాగ సమయమునకు సవారీపై ఆ రేవునకు వచ్చి, ఎవ్వరు లేకుండ చేసి, తాను స్నానమాచరించి, మడుగువలువ ధరించి, పూల సజ్జతో దేవాలయమున కరిగి దేవుని సందర్శించి ఇంటికి మరలి, చనుట పరిపాటి.

దేవాలయము ఆమె భర్తయొక్క పూర్వీకులు కట్టించి, ధ్వజస్తంభమెత్తించిన ఏనాటి దేవాలయమైనను, ఈ పుణ్య దంపతుల యొక్క భక్తి తాత్పర్యముల మూలమున దైనందినం నూతనంగా శోభిల్లుచు ఊరికి నిండై కనుబండువై విరాజిల్లునది.

" అయితే జమీందారుడు, అతని జమీ సర్కారువారు తీసికొన్నారు గదా, దేవాలయము కూడా విడిచిపెట్టుతాడా ? నాటి నుండి దేవాలయము గతి యేమగును ? "—అనునది రావిచెట్టు క్రింది ప్రజలమధ్య సమస్యగ ఆ నిమిష మప్పు డుండెను. ' సాయంకాల మెప్పటివలె జమీందారిణి ఆమెయొక్క యెప్పటి హోదాతో దేవాలయమునకు రాగలదా ? రాలేదా ? ఆమె మేనా నెవ్వ రాటంకపరుపగలరు ? ' అని నాటి ప్రజ పెద్దకోలాహలముగ, కోలాహలమునందే రహస్యముగా, యోజింపదొడంగెను,

ఊరి వారెల్లరు సంధ్యా సమయమునకు దేవాలయమును చుట్టి యుండిరి. కాని ఆ మూకబుద్ధికి, జమీందారు జమీందారిణి ఏమి చేయదలచినది, ఎటుచన్నది, ఎవరేమగునది, అంకలేదు.

ఇక్కడ జమీందారుడు, తన్ను బోయీలమ్రోత నలు దెసలనుండి ఆవరించిన ట్టావరించిన కొలందిని, చిత్తభ్రాంతిని మునుగజొచ్చెను. అత నెప్పుడూ ఆ వరకు తన ప్రేయసి ఆ రేవులో స్నానము చేయుటగాని, మడిచీర ధరించి దేవాలయ మునకు జనుట గాని ప్రత్యక్షముగ జూచినదిలేదు. అందరూ విన్నట్టుగానే, తానూ వినుచు, మత విషయమున ఆమెత్రోవ నామెను పోనిచ్చుటే తదజ్ఞతకు కారణము. తాను సంఘ సంస్కారి ; మత సంస్కారి. అయితే ప్రజలకొరకు, భార్య కొరకు, హిందూ మతమును చెండనాడక, దేవాలయమును సాంప్రదాయానుసారంగా నడవ నిచ్చుచు, రథోత్సవాది మహా పర్వ సమయములందు తానుగూడ పాల్గొనుచు, వచ్చువాడు. నాడే ఆతని జీవితమునందు ప్రారంభము, ఆ జన పథ ప్రాంత మందు, ఊరు దాటి, బల్లకట్టుమీద రేవు దాటి రెండవ యొడ్డు సేరి, అందుగల చెట్టువేరు నాని కూరుచుండుట.

అతడు అంతరాళమందు బోయీల మ్రోత మారు మ్రోసిన కొద్దీ, తనకు చేరికగుకొద్దీ, తన్ను దా మరచిపోయి నట్టయి, రేవు దాటించు బల్లకట్టువానిని గాని, బల్లకట్టుమీద ఇటు నటు దాటుచున్నట్టి కూలియాండ్రను గాని కనిపెట్టలేదు. వారు మాత్ర మేదో వింతగా ఆ ప్రవాహతత్పరు నుండుండి చూచుచు, ఆ వచ్చు మేనాను తమ సొంతమైనట్లు కనుగొనుచు రిచ్చపో ధొడంగిరి: కాని ఎంతకూ అది ఆగు తెన్నుగాని, తీరుగాని,

ఎవ్వరికీ తోపలేదు. ఎవరంతట వారా చూపరులు బల్లకట్టు దిగి వారి వారి యిళ్ళకు జనిరి.

సాయం సంధ్యారాగము, నటరాజు ప్రళయతాండవమున రేగు ధూళిగా, పైకి పడమటిదెస లేచినదై, వింతగా విరివిగా, అరసింది తడవుగా, ఎర్రని తేజస్సును దిఙ్మండలమునుండి నలు దెసలా తేజరిల్లజేయుచు ఆ జమీందారునియొక్కయు, ఆ మేనాలో కూరుచున్న నారీమణియొక్కయు ఏక చేలాంచలమా అన్న ట్లొప్పారెను.

రాదారీ బాటగల గట్టుమీద, బల్లకట్టురేవు వంపునే, సవారీ నిలుపుచేయబడి, అందునుండి గేస్తురాలీవలకు మేలిముసుగుతో వచ్చుచు కనురెప్ప లెత్తకే నీటివంక చూచి, ఆవలి గట్టు దృష్టి సారించి, చెట్టునీడ నీళ్లల్లోపడ్డ జాడనే తన ప్రియుని నీడకూడ ఏకమగుచు కానవచ్చుట ఆనవాలు గొని, 'బల్లకట్టన్నా! ఆ తట్టెప్పుడూ ఈ వేళకు మగవారున్న జాడలేదు. ఎవరా కూర్చున్నది?' అని అడిగెను. బల్లకట్టన్న 'వారే! జమీం దారుగారే! లేచి వెళ్లమని చెప్పనా? తల్లీ!' అని వేచి యుండెను. జమీందారుడు తన మోము పైకెత్తక, రెప్ప లర వాల్చి, నీటివంకకే చూచుచు, ప్రేయసి యెట్లు నీటిలో దిగి నీరాట జెలంగునది, వీక్షింప వాంఛించెను.

ముగుద కొంచె మాలోచించి, బల్లకట్టాతనితో 'వద్దులే! కూర్చోనియి! అక్కణ్ణే కూర్చోనియి!' అని అంతఃపురపు తీవిని, ఘోషాను పోషిస్తూ, స్నానమునకై యొక్క మునుక తన నీటినీడనే తాను వేసినదాయెను. బల్లకట్టాతడు, అమె తిరుగ నీటినుండి లేచులోపల, బల్లకట్టు నొకవైపుగా గట్టుకుచేర్చి,

తా నొక చెట్టుచాటు కొదిగి డాగెను. బోయీలున్ను తమకు దాము రహదారినివున్న చెట్లవరుస వెనుక నొక్కొక్క చెట్టు వెనుక కొక్కొక్కనిగ చేరుకొని మరుగుపడి యుండిరి. ఇది నిత్యమూ వారు ప్రతిరోజూ చేయుచున్న పనే. కారణం, జమీం దారిణి స్నానమాచరించి తిరుగ గట్టెక్కి, పైకిచని, పొడిబట్టలు కట్టుకొని సవారీలో కూర్చుండి తలుపులు వేసేసుకొనువరకు, ఎవ్వరును చూడరాదు. వారు సవారీ మోయు బోయీలే కానిండు, రేవుదాటించు బల్లకట్టాతడే కానిండు ! మరిన్ని రాదారిని ఆ నిమేషమప్పుడు నడుచు జనముకూడా అటో అరమైలు ఇటో అరమైలు పొడవునా నడువకుండుట నియామకము. కావున సమస్తము నిర్జనంగాను, నిశ్శబ్దవంతంగామూ, ఆ దంపతుల కిరువురకు దోచి యొకరినీటి నీడల నొకరొకరు పెట్టుకొని యున్నట్టుండి పోయిరి ; కొంత తడవు చెరొక గట్టునా ఎదు రెదురుగా ! ఇతరము ఎరుగకుండిరి.

ఈ యేమరుపాటు సమయమప్పుడా రాదారినే ఏ నియా మకమూ నేరని ఒకానొక నిర్భాగ్యురాలు, యువతి, ఆ యసుర సంధ్యనే, ఇల్లులేక, వాకిలిలేక, ఏకడనూ రక్షలేక, భిక్షలేక ఏగుచు, ఊరకే ఉత్తదిగానున్న ఆ సవారీని చూచినదై, అందు లోనికి దూరి, ఇటూ అటూ తలుపులు లాగికొనుచు గాజుల చప్పుడు చేసెను.

అప్పటికి జమీందారిణి రెండవమారు తన స్నానమున గ్రుంకుకొనుచు నీటనణగి యుండెను. జమీందారుని ధ్యాన మంతయు జమీందారిణి నీటనుండి నిలువునా లేచు సొబగు లింకను గాంచుటయందే పంచియుంచెను. ఆ కారణముగా మరొక

స్త్రీ వ్యక్తి సవారీలో ఆసీనయై సవారీ తలుపులిటూ అటూ లాగి
కొని మూసివేసికొనుట ఎవ్వరును గాంచలేదు. కాని ఎప్పుడైతే
సవారీతలుపులు మూసికొన్న ధ్వని అయినదో, రివాజు చొప్పున
బోయీలు తమతమ దాగిన చెట్లచాటునుండి యివతలకు వచ్చిన
వారై, సవారీని బుజములనెత్తుకొని, ఎత్తుకొనుచునే—' ఆః
ఓః ఏః—' మొదలగు ఊతధ్వనులను వినిపించుచు వెడలి
పోయిరి. ' ఏమా ! ' అని జమీందారిణి నీటినుండి పైకి తలెత్తి
చూచుటలో ఆమె వెనుతట్టు శూన్యపథము తప్ప మరొండు
లేకపోయే.

ఎదరతట్టు భర్త ఆవలిగట్టునుండి ఆమె దృక్కులలోని
నెమకులాటను గుర్తించుచు ఆందోళనాతత్పరుడై, బల్లకట్టన్నను
పిలిచి తన్ను కూడా తన చెలియున్న రాదారీవైపునకు జేర్చు
మని కోరెను. రేవు దాటించు నాతడును, తాను దాగివున్న చెట్టు
చాటునుండి ఈవలకు వచ్చి జమీందారుని జమీందారిణి యున్న
యెడకు జేర్చి వా రిరువుర నొకచో కూర్చెను.

జమీందారిణి గట్టెక్కి, పొడిచీర దాల్చినదై, ' ఈమోస
మెట్లు జరిగినది ? ' అని కళ్ల నీళ్ల బెట్టుకొన జొచ్చెను.

" ఏ మోసము ? " అని భర్త అడిగెను.

" ఈ నా సవారీ మాయమగుట ! " అని జమీందారిణి
బదులాడెను.

" అన్నియూ మాయమైనట్లే అదియునూ మాయ
మయ్యెను. నీ వింకను సవారీమీద పోయి దేవుని దర్శింప నెంచి
తివా అది పిచ్చి యూహ. నేను, చూడు, ఎట్లునడచివచ్చి కాలువ
గట్టున కూర్చున్నానో ? " అనెను.

"మగవాండ్రే పని పడితే ఆ పనే చేయగలరు. సమస్తము విడువగలరు; నడువగలరు. ఆడువారమగు, మాకు దేవుడు, జీవుడు, సిరి, ఇన్ని కావలయును. నేడు మరి దేవుని సందర్శనమే లేదు కాబోలు నా బ్రతుకునకు" అని భార్య నుడివెను.

"ఎందుకుండదు?" అని భర్త అడిగెను.

"దేవుని సందర్శనమే నాకుండియున్న సవారీ యింత వింతగా మాయముగానేరదు" అని భార్య నిరాశ వెలిబుచ్చెను.

"ఇంకా మేనాలమీద మేలిమి మీద నీకు రోకు కలదన్న నాకు వింతగా నున్నది. దేవునిదర్శనము కాలిబాటనే మరి నీవు గావించుట ముఖ్యమని తలపోసి, యీ అనుభవము నీ జీవితమందు తద్యఃకల్పితమైంది. రా! నాతోకూడా రా! ఆ సవారీ కంటె ముందుగా నొక అడ్డదారిని మనము దేవాలయము చేరగలము." అని జమీందారుడు ముందడుగు వేసెను.

"ఈ నా తెరలోని వేషముతోనేనా?" అని భార్య ప్రశ్నించెను.

"ఆ వేషము నీ వుంచుకొన్నకంటె, తీసివేయుటలోనే నే డందముంది. సామాన్యవేషములో నిన్నెవ్వరును పోల్చలేరు."

అని ధైర్యము చెప్పి ఆమె ముంగురులతో దోబూచులాడునట్టి జరీబట్టల మేలిముసుగు తొలగించెను. తొలగించులో ఆ యబలరూపము అపురూప సౌందర్యముతో విరాజిల్లినదాయెను. ఆమె కళ్ళల్లో, దేవుడు, జీవుడు, సిరి, అన్నీ ఒక్కమారు ఆతనికి మెరపు మెరసినట్టు కనబడెను.

సవారీలో తిరుగ నాడు కూర్చున్న మనిషి జమీందారిణే యనుకొని బోయీలు చుట్టుదారిని దేవాలయము కడకుతీసుకొని వచ్చునంతలో అడ్డుదారిని జమీందారిణియు, జమీందారుడు దేవాలయద్వారమును జేరుకొనిరి.

అక్కడ గుమిగూడి చోద్యముగ జూచు ప్రజమధ్యనుండి కొందరు ఆకతాయిలు, కర్రలు, గొడ్డళ్లు పుచ్చుకొని ' ఈమె యింకను దేవుని జూచుటకు సవారిమీదనే వచ్చినదే ! ' అని సవారీ తలుపులు తెరచుకొనులో సవారీపై నొక దెబ్బమొత్తి, పైకెత్తి కీడుకంట గీటిరి. కాని, అది సాగకుండ అప్పటికి సరిగా కాలినడకను అందుకొని, దేవళద్వారముముందు మెట్లపై భార్యా సమేతుడై నిలుచుండి, జమీందారుడు పెద్దయెలుంగున ' జమీం దారిణి కాలినడకనే నాతో నేడు నడచివచ్చి యిచ్చటనే యున్నది. ఆమె సవారీలో లేదు ' అని వారికి నచ్చజెప్పి, భయానక కృత్యమేమీ జరుగకుండచేయుచు, వారితోపాటు తానును, తన ధర్మపత్నియు ఆ సవారీలోనుండి ఎవరు దిగుతారో అని పరికింపజొచ్చిరి.

ప్రజలలో ఆ వరకును జెలరేగిన కోలాహలముగాని, జమీందారీ దంపతుల కలవడిన హృదయ పరివర్తనముగాని ఎరుంగక, కేవలం పవారీ చీకటినుండి, అప్పటికప్పుడు వెలిగి యివలకు చూపబడిన దీపకళికలా, ఒకానొక స్త్రీ వ్యక్తి, అక్కడివా రెవరూ అంతక్రితం ఎరుగని నవ్వుమోముతో, విరా జిల్లు గోముతో, వెలికివచ్చి—ఏదో క్రొంగ్రొత్త అన్వేషణ, ఆవేదన, ఆకాంక్ష తన యెడద ముప్పిరిగొను చొప్పు, లోకము నకు చెప్పకేచెప్పు కళ్లొప్పజెప్పెను.

" ఎవరు నీవు ? " అని జమీందారుడు ఆ స్త్రీని ప్రశ్నించెను. అప్పు డామె యిట్లు బదులాడెను, ప్రజలున్ను సవారీలో నుండి దిగిన ఆమె సంపన్నురాలా, సామాన్యురాలా, సానియా, సంసారియా, అన్న వివక్షత విడిచి, ఆ క్రొత్తమనిషి ఎవరా అనే మీమాంసతో గుర్తింప తల్లక్రిందులు పడుచు, ఆమె చెప్పు చరిత్ర నాలకింప జొచ్చిరి. ఆమె ధరించిన దుస్తులనుకూడా తోడ్తో వింతగా దిలకింప జొచ్చిరి. ముందు దుస్తులు వర్ణించనా, గాథ వినిపింపనా ?

ఆమె వొక నీలం మొఖమల్‌షరాయి తొడిగింది. మొల నుండి పాదములదాకా, మెడనుండి తొడలదాకా అదేరంగు, అదే నునుపు అదే తేటూ గల చొక్కా తొడిగింది. మరిన్ని మెడను మొలివైచి బోరమీదకు నొదులొదులుగ జారేలా శిరోజాలమీద నడకనడిచేలా ఒకానొక తెల్లని పట్టువోణీ, అదే కండువాగా, మేలిముసుగుగా వేసికొంది. కాళ్లను సరిగచార్ల చెప్పులు తొడుక్కుంది, యావత్తు దిరీసుగుండా పచ్చని పాంచాలదేశపు వొంటి వన్నె, కన్నెవయసూ కాపరుస్తూ, నీలనీల మేఘంనుండి వెండి అంచు బయల్పరుస్తూ వెలికివచ్చే సూర్యునిదైన నీరెండమూదిరి చల్లదనం దృక్కుల విలువతోపాటు వెదచల్లుతూ దేవాలయపు మెట్లవద్ద చెప్పులువదలి 'ముందు దేవుని చూడనియ్యండి ! ముందు దేవుని చూడనియ్యండి ! నే నీ ప్రకారముగా దేవుని చూడగలనని యెక్కనాడునూ కల్లోనైనా తలపోయలేదు. ముందు దేవుని చూడనియ్యండి ! నా చరిత్రమాటకేం ? ' అంటూ గుడి లోనికి జొరబడింది. ప్రజలున్ను ఆమె అపరావతారం తాల్చిన ఆండాళ్లమ్మో, అలివేలుమంగ తాయారమ్మాళ్లో, బీబీనాంచారమ్మో

కంచి కామాక్షమ్మో అని భయభ్రాంతులై ప్రక్కప్రక్కల కొదిగి చేష్టలు దక్కి చూచుచుండిరి.

జమీందారుడు, జమీందారిణియు మిక్కిలి ఆమెయొక్క కథను వినవేచియున్నట్లు కిక్కిరు మనకుండ నొత్తిగిలి యుండిరి. ఆమెయు గర్భగుడిలోని దివ్యవిగ్రహమున కెదురుగా నిలుచుండి 'దేవా! నే నీ అద్భుతవిధముగ, నొక సవారీలో కూరుచుండి, నీ కడకువచ్చి నీ దర్శనము లభించి, తరించియుండి యుందునని ఎన్నడు అనుకోలేదు. రాదారి బాటనే ఖాళీసవారీ, సవారీలో కూరుచున్నంతనే బోయీలమ్రోత మ్రోతఆగి సవారీ దిగుటలో నీ దేవళద్వారము! అహో ఏమీ, నా అదృష్టము! ఇది, నేను కాందిశీకాంగననయి, ఆ సేతుహిమాచలం దిక్కులేక తిరుగాడుటలో దొరకిన పెన్నిధిగా తలంచుచున్నాను. దేవా! దేవా!' అని తనకనుపాపలలో క్రొన్నీడలమర, ఆనీడలనే వాల్గాడించులా జొటజొట మృదుకపోల ముకురాలమీదకు కన్నీళ్లు గార్పజొచ్చెను. 'కాలినడక నెంతదూరము నడచినను నన్ను గనుగొన్న వా రెల్లరు కాందిశీకాంగననసీ, కొరమాలినదానినసీ, మతము నెడినదాననసీ, తమ అభిమతమునకు అణగిమణగి యుండవలసినదాననసీ, ఈ నడించినవారలేగాని యీ విధమున వాసినెత్తి గారవించినవారు లేరు. ఇది నా జీవితమునందు అను కోని అనుభవము. ఈ నీ దర్శనము ఇతరుల కసంభవము. దేవాదిదేవా;' అని వినమ్రతతో, వివేకముతో, విశాలహృదయ ముతో, ఆ ఆడమనిషి సాష్టాంగ పడి లేచి, పరిసరమున తన్ను అరయుచున్నవారి నెరుగకోరెను. బేడిమూక ఏదో సందడి నుండెను. జమీంధారుడు ఆమెను పలుకరించుటకు తగుసాహసము

వహింపడాయెను. ఇక ఆతని భార్య—' నీవు నిజముగా కాందిశీకాంగనవే యగుదువేని మమ్ముల నందరను వంచించినావు. అందు ముఖ్యముగా నన్ను మోసగించినావు' అని ధీరస్వరముతో నుడివెను.

" నీ వెవరవు " అని క్రొత్తమత్తకాశిని ప్రశ్నించెను.

" నేనా ! నేనా " అని జమీందారిణిగా చెప్పుకొనుటకు గాని, మాజీ జమీందారిణిగా పేర్కొనుటకుగాని మనసొప్పక యా యిల్లాలు ' నేనా, నేనా ' అని నీళ్లు నమలి, " నామేనా అది ! అని మురిసిపోవు నన్ను నా మేనానుండి ఒక్కనిమేషంలో వేరుచేసి నేలపై నడిపించినావు. నీదీప్రజ్ఞ ! నా నాథు డెంతచెప్పి నను వినని నన్ను నీవు నేలపై నడిపించినావు. నీదీప్రజ్ఞ ! నాకు మిక్కిలి సంతోషముగా నున్నది. నీ నుండి ప్రజలపేక్షించునది లేదు. కాందిశీకాంగనవు. ఇల్లులేదు నీకు. వాకిలిలేదు నీకు, వసతి లేదు నీకు. వ్యాపారములేదు నీకు. కాందిశీకాంగనవు నీవు ! అదృష్టవంతురాలివి ! ' అని అభినందించెను.

కాందిశీకాంగన వెనుదిరిగి మేనావైపు చూడ నభిలషించెను. అంతలో ఆమె కన్నెదుట దివ్యవిగ్రహముయొక్క బంగారు తొడవులః మీదకు, కిరీటముమీదకు, పెద్దవెలుగు వ్యాపించి, నఖశిఖ పర్యంతం చతుర్బాహూదర వక్త్ర నేత్రద్వయము లదర వింత హెచ్చరిక గొలుప జొచ్చెను. ' ఏమా ? ' అని కాందిశీకాంగన వెన్నునే తిలకించులో, సవారీని ఛిన్నాభిన్నముగచేసి, ప్రజలు భోగిమంట నంటించునట్టు దేవుడి యెట్టయెదట అంటించి జ్వాలగా జేసినారు.

ఆ జ్వాలామాల ఎవరిమెడలోపడి, యింకనూ విషాదపు విడ్డూరము లేమి జరుగునోయని, జమీందారిణియు, జమీందారును, కాందిశీకాంగనను కాచుటలోను, కాందిశీకాంగన వారిని సంరక్షించుటలోను, నిమగ్నులై యుండిపోయిరి. కాని, దేవుని కృపవలన ప్రజలు వారి కెవరికిని ఏ హానియు జేయకుండ 'ఇక వారును మనలాగున నడువవలసినదే! ఇక వారును మనలాగున నడువవలసినదే!' అని అనుకొనుచు క్రమక్రమముగా పలచబడి, ఎవరిఇళ్ళకు వారు వెళ్ళిపోయిరి.

జమీందారును, జమీందారిణియు, కాందిశీకాంగనయు చుక్కవెలుగులో దేవళమును నిర్గమించి విశాలతర ప్రపంచంలో మంచు తడిబాటనే కాలినడకను జనుచు నిట్లనుకొనిరి. కాందిశీకాంగన :—' సవారియెక్కిననే యింటి ముంగిటనైన దింపగలదు. నా కింత ఆతిధ్యము దొరకునని యనుకొంటిని. కాని యిట్టి వైపరీత్యము జరుగునని తలపోయలేదు.' జమీందారిణి:— ' సవారీ దేవుని దర్శనార్థము నిర్మింపబడినదిగాని నీవంటి దాని కొఱకు గాదు.' జమీందారుడు :—' ఎవరెందు కనుకున్నా, ఆ సవారీ నేడు తగలబెట్టవలసినదే! దానిని గురించి మనమింక వాదులాడ బనిలేదు. మనము ముగ్గురము ఇట్లు కలిసి రాదారినే పోవుచో మఱల ప్రాణగొడ్డము లేవీ కలుగకుండవుగదా! అను నదే యోజించుకొనవలసినది.' కాందిశీకాంగన: ' అనగా మన ముగ్గురిలోను నేనే అధమాధమురాలిని, దురదృష్టవంతురాలిననీ మీ యూహ!' జమీందారుడు :—' కాదు. నీవు మిక్కిలి అందకత్తెవు. యౌవనవిలాసినివి. ఈమె బంగారునగలు ధరించిన గృహిణి. జారచోరుల కిది అనువైన నిశీధిని.' జమీందారిణి:—

'ఇవిగో నా మీదనున్న వస్తువులనెల్లను దొంగలు బలాత్కార ముగ గొనకమున్నే యీ నీట పారవేయుచున్నాను.' అని తొల్లింటి కాలువచేరికగా నీటిని దరిసెను. జమీందారుడు:—'నే బోధించితినని పారవేయవలదు. నీ అంతరాత్మకు తోస్తేనే త్యజింపుము. అసలు అవిన్నీ, మేనాయున్నూ మన యితర సామానులతోపాటు తరలింపబడియుండి యుండవలసినది. అప్పుడు మన మిద్దఱం మాత్రమే ఒకరి కొకళ్ళం తోడునీడలమై ఈ రాదారిని నడచియుందుము. ఇది రహదారీ! ఇందు దాపరికము గాని, దాపుడుధనముగాని లేవు. అది తెలిసి నడచుట ఈ పయినుండి మనవిధి.' అని హెచ్చరించెను. ఆ యిల్లాలు తన కప్రయత్నముగా కళ్ళమ్మట బొడము చెమరింపును చేతుల తుడిచివేసికొనుచు తన నగలనెల్లను నీళ్ళలోనికి విడిచిపుచ్చెను. కాందిశీకాంగన అది కనీ కననుండ 'నా యౌవనమింతలో నన్నట్లు విడుచునట్లు లేదు. నా మూలమున మీకు కీడు మూడ నేల? మీరు జనుడు.' అనెను. జమీందారుడూ, జమీందారిణీ రిక్తహస్తులై కాలినడకను పొడుగు రాదారీనిబడి వడివడి నడచి పోవుచుండ, కాందిశీకాంగన జమీందారిణియొక్క దిసమెడ గను గొనుచు, ఆ దంపతులయొక్క నిరాడంబర నిర్గమనమున కచ్చెరువు పడుచు, తానున్నచోట నున్నట్టే కొంతతడ వాగి పోయెను. ఆగిపోయి కాలువనీటిలో జమీందారిణి జారవిడిచిన వస్తువులకొఱకు వంగిచూచెను.

కాని, ప్రవాహము మిక్కిలి వడిగా నుండుటచే అందు చుక్కనీడ తన నీడ కలకలుపై ప్రకాశించుట తక్క మఱో విలువ లోహము ధగధగమనుట కాంచలేకపోయెను. అప్పుడామె

వింతగా చింతించినదాయెను. తనకు కనబడిన నూతనప్రకాశము చేత ఆమె తొల్లింటి మోహము అంతరించెను. అయినప్పటికీ ఆ కాందిశీకాంగన ఈ మోహప్రపంచములో తాను రాదారీని నడచుట క్షేమముగాదని, బల్లకట్టాతని లేపి సూర్యోదయము కాకుండా రేవు దాటి ఆవలితట్టు పెనుచింతక్రింద విశ్రమించి అదే తన కనుపైన విడిది గుడి కాదు, గృహము కాదు—అని గ్రహించెను. చింతచెట్టు నీటి నీడ ఒక వైపునకు, చింతచెట్టు ఎండనీడ మరొకవైపునకు! ఏ నీడ నాశ్రయించుటో ఆమెకు తెలియకుండెను.

తక్కెడ పుడకల్లా రెండునీడలూ ఉపచరింప, చెట్టును ముల్లుగా గొని ఆమె తన జీవితభారమును తూచుకొనుచున్నట్టు తెల్లవాఱి, లోకమునకు గనబడజొచ్చెను. పాపము శమించెను; ప్రాయము విజృంభించెను.

నాటికీ, నేటికీ ఆ చింతక్రింద విశ్రాంతి గొన్నవారిలో వీను మిగిలినవారు క్రితపు సాయంకాలపు మాజీ జమీందార్! నేటి యుదయపు కాందిశీకాంగన! వీ రిరువురే!

# నల్లని తారురోడ్డు

జనబాహుళ్యంకోసం గాను సేవ నెరపుతూ, స్వార్థమునకుగాని చిరునవ్వు నవ్వుతూవున్నారా అన్నట్టు ఒక్కొక్కసారి ముఖవికాసం వెలిబుచ్చుతూ—పొట్టగడవక అవసరంపడి ఎండలో చెమట్లు కక్కుతూవున్నారా అన్నట్టు ఒక్కొక్కసారి నడుం నిలుపుకుంటూ అయిదారుగురు కార్మికాంగనలు పట్నంలో మిట్టమధ్యాహ్నం ఆకాశంక్రింద నౌకవలసగా గూర్చుని, బ్రష్షులుపెట్టి పాత రోడ్డుదుమ్ము తుడుస్తూ వున్నారు. వారి మునుముందు 30, 40 గజాల్లో ఉడుకుయంత్రాలు తారూ, ఇసకా, కంకరా కలిపి అడుగడుక్కి సరఫరా అయ్యేటట్టు పని చేస్తూవున్నాయి. వారి వెనుతట్టు నల్లని మెత్తమెత్తని ఘట్టిఘట్టి కలగలపు పఱుపుమీద కోయిల కంఠస్థాయి సీలేశుకుంటూ రోలర్ యంత్రం దొర్లుతూ వుంది. అటునుంచి ఇటుగాని, ఇటునుంచి అటుగాని జనాన్ని నడవనివ్వడం లేదు. బళ్లను పోనివ్వడం లేదు. 'రాదారీ బంద్.'

బంద్ అని రోడ్డుకడ్డంగా వెదురుకర్రలు గట్టి ఎఱ్ఱద్దాల లాంతరు తగిలించలేదు. ఊరకే ఉత్తిపీపాలు అడ్డగోడలా నిలబెట్టారు జనం ' దారిలేదు ' అని వూహించుకొనేటట్టు. ఆ పీపాల కంటె ఎత్తుగానున్న పౌరులు పీపాలావలనుండి విడ్డూరంగా చూడొచ్చు, కొత్తపద్ధతిని పడుతూవున్న రస్తా ఏలా వేయబడుతూ వుందో.

*   *   *   *   *

పైడితల్లి ఆమె పేరు. 'పైడితల్లోదినే అని' సంబోధించేరు మొగాళ్లా ఆడవాళ్లూకూడా ఆమెను వాళ్ళవూళ్లో. వాళ్ళవూరు చక్కని పల్లెటూరు. ఆ పల్లెటూరుచుట్టూ చిక్కనితోటలు. ఆ తోటల్లో పగలు నడుస్తూవుంటే సూర్యుని కిరణాలు ఆకులంట నేలకు వాల్తూ నల్లని నీడజాడలూ అవీ గాలి కేకమై పైడితల్లినడక్కి చుఱుకిచ్చేవి. ఆ తోటల్లో రాత్రిళ్లు నడుస్తూంటే మిణుగురుపురువులు పైడితల్లికొప్పు చుట్టేశేవి— అదేదో ఆకులజొంపం అనుకొనేటట్టు, వేఱే బంగారపు తిరితిరి తగిలింతలు అనవసరం అన్నట్టు.

అటువంటి పల్లెటూరిలో పొలం బయల పాటడి, పది కాలాలపాటు తిన్నాగానీ తరగని భాగ్యం గడించింది ఆమె. మనిషి మాంచి జభరైనమనిషి. జభరైన మనిషిగదా అని మోటకాదు. తాటమనిషి ఎంత వాడిగా చూస్తుందో అంత వాడిగాను చూడగలదు. అంత వడిగాను నడవగలదు. నల్లని ఛాయ. నల్లని ఛాయ అని కఱిమొద్దుపద్దు కాదు. తీరూ, తీయమూ ఉన్న స్త్రీ. చారిత్రకపరిశోధకున కిక్కడోపాఠం కనిపిస్తుంది. నాగరీకత యొక్క సోపాలనం ఎలా వుంటుందో !

మొదట్లో రైక తొడుక్కోవాలని తెలియనే తెలియదు ఆమెకు. ఎండా కొండా అనకుండా, తన పంచభూతాత్మకమైన శరీరమంతా పంచభూతాలకూ అర్పణంగా తిరిగి పుల్లా, పుడకా ఏరి తెచ్చుకొనేది. ఆ రోజుల్లో ఆమెచేతులు పొడూగుతా అంతా కేవలం మసిపూసినవతే. క్రమంగా ఊడ్పులకు, నూర్పుళ్ళకు వెళ్ళడం ప్రారంభించి మఱి పావల్డబ్బులు రోజుకు గడించడం నేర్చినకొద్దీ రయికలు మోచేతిపొడుగువి తొడుక్కుంటూవచ్చేది.

ఆ అలవాటు రోజుల్లో చాటుబలిసి ఆమె జబ్బలు అదో లేలేత చామనఛాయలోకి మారినాయి.

అయితే, మోచేతుల్దాకా వుండే రయిక మఱికొంత కాలానికో తీర్థంలోచూచిన తాత్కాలికపు పట్నవాసపు ఫాషన్‌ను అనుసరింపబోలు—టీకాలమచ్చల ప్రాంతానికి ఎగలాక్కుపోయింది. ఆలా కొంతకాలం అలవాటుపడ్డంలో శరీరకాంతి టీకాలదిగువను, మోచేతి ఎగువను ప్రత్యేకత వహించింది. ఇలాగ్గా ఆదిలో అంతా మిక్కిలి నలుపుశరీరమైనా, ఆచ్ఛాదన అనాచ్ఛాదనానుగుణంగా క్రమశః అచ్చటచ్చట లలితశ్యామ మనోహరమై మూర్తీభవించింది.

* * * * *

ఊడుపులుపని వానాకాలంలోను, నూర్పుళ్లపని శీతాకాలంలోను అయిపోవడంతో ప్రతీ వేసంగీ వృధాగాపుచ్చడం ఏమీ బాగాలేదు ; ఓ వేసంగికైనా పట్నవాసం పోయి అక్కడేమైనా పని దొరకుతుందేమో తెలుసుకోవడం మంచిది అని తలపోసింది కొన్నాళ్ళ కోనాడు పైడితల్లి ప్రోఢ.

ఆమెకాళ్లకు కడియాలు, అందెలూ ఎప్పుడూ వున్నవే. మఱిన్నీ చెవులకు బావిలీలు, కుంటేళ్లు ఇలాంటివికూడా ఎప్పుడూ శృంగారంగా ధగధగలాడిపోయేవే. ఎటొచ్చీ నాడు కొత్తగా గావించుకొన్న అలంకార మిదీ. ఎఱ్ఱని సన్నని కోక కట్టుకు, ఆ కోక వెనక్కువిరిచి వొడ్డాణంలో గుచ్చుకుంది. కనపడవద్దూ మఱి చూచేవాళ్ళకు తన అందెలూ, కడియాలూ ! సరే మామోలు మల్లేనే తెల్లటి టిన్‌రేకుది గిడసరయిక తొడిగింది. మెళ్లో కంటె పెట్టుకుంది. మఱేవేవో నగలు ఉంచుకుంది. జుత్తు బాగా రెండు

గుప్పిళ్లతోనూ అదుముకు చక్కని దూముడిగా తీర్చింది. అద్దంలో చూచుకుంది. అలా చూచుకుంటూనే చెవులకు తెల్లరాళ్ల దుద్దు లెట్టుకుంది. బయల్దేరింది కాల్నడకను. నడుస్తూ ఆమె అలా ఓచేత్తో తల నిమురుకుంటూ దూముడి వొత్తుకుంటూ వుంటే దుద్దులరాళ్లు ముందువాళ్ళనూ, దుద్దులసీలలు వెనకవాళ్లనూ కూడా ఆకర్షించుకున్నాయి అనుకోండి. ' ఎక్కడకో ఏదో లాభసాటిచూపుమీద పోతూవున్నావు పైడితల్లీ ! చెప్పవుకదూ ? ' అని పలకరించనివారు లేరు, ఊరూ వాడా !

* * * * *

తిన్నగా వచ్చి బజార్లో తనపైన మెచ్చుకోల్నడక లాపి, అక్కడ తారురోడ్డు ఎలా వేస్తూ వున్నారో చూస్తూ నిలబడి పోయింది ఉత్తిపిపాల కావల.

కంట్రాక్టరు బొజ్జన్న కనిపెట్టాడు పైడితల్లి రూపురేఖలు. కేవలం పల్లెటూరివాలకంగానూ లేదు, పట్నవాసపువాటంగానూ లేదు. భాగ్యవంతురాలిలాగూ లేదు, పేదరాలిమోస్తరుగానూ లేదు. ' ఆ అమ్మి ఎవత్తెరా ? ' అన్నాడు పక్కకూలీతో. పైడితల్లి వింది. ' ఏం బాబా ! నన్నుగురించేనా మీవూసు ? ' అంది. కంట్రాక్టరు ' ఆఁ ' అన్నాడు. పైడితల్లి అక్కడ రోడ్డు దుమ్ము తుడుస్తూవున్న పాటకపుస్త్రీజనాన్ని చూపుతూ ' రోజు కూలి ఆళ్ల కేమిస్తారు బాబా ! ' అని అడిగింది. ' ఆరణాలు. రావాలని వుందా నీకూను ఈ పనిలోకి ? ' అన్నాడు కంట్రాక్టరు. ' ఎన్నాళ్లుంటుంది ? ' అని అడిగింది పైడితల్లి. ' నెలమీద పదేనురోజులుంటుంది ' అన్నాడు కంట్రాక్టరు. ' ఈ యేసంగి వెడుతుంది ' అంది పైడితల్లి. పైడితల్లికేసి కూలిజనం ఆడా,

మగా అక్కడున్నవాళ్ళందరూ తేరిపార చూస్తూ విన్నారు. కంట్రాక్టరు 'నిక్షేపంలా' అన్నాడు. పైడితల్లి మరి పంచాంగం గించాంగం చూపించుకోలే! వెంటనే ఆ పనిలో రోజుకూలీగా జేరిపోయింది.

పనిలో ప్రవేశించినప్పటినుంచి మొనకత్తై మెఱసిపోయింది. ముఖం వంచి బ్రష్‌పెట్టి రోడ్డు ధూళి తుడుస్తూవుంటే ఆమె తుడిచినంతమేరా వెనుచూపులో ఆ రోడ్డుమీద ఆమె ముఖం ఆమెకు ప్రతిబింబంగా అగపించాలి! ఏమి పనిమంతురాలు!

* * * * *

ఆలాగ్గా కొలరోజులు పైడితల్లి ఏ రోజు కారోజు మస్తరి పిలుపుకు జవాబిస్తూ, తన మానాన్ని పనిచేసుకు ఏ రోజు ఆరణాలు ఆ రోజునే చేతిలో పడేసుకు, కంట్రాక్టరుకు దణ్ణం పెట్టి వెళ్ళిపోతూవుండడం రివాజుగా జరిగిపోయింది. 31-వ రోజున పనిలోకి రాలేదు. 'ఏంచెప్మా' అంటే 'ఏంచెప్మా' అని కొంతసేపు అందరూ అక్కడివాళ్లు యోజించారు. 'రోజుకూలీ రాకపోతే విచారమెందుకు? కూలి దండగపడేది అదేను' అని సమాధానపడ్డారు.

మర్నాడు పైడితల్లిమాటే మఱచిపోయినారు లోకులు.

* * * * *

కంట్రాక్టరు అన్న నెలాపదిహేనురోజుల్లోనూ తార్రోడ్డు పూర్తి అయింది. ఆ రోజు 46-వ రోజు. ఉదయాన్నే రోడ్డంతా పరిశుభ్రంగా నీళ్లుపెట్టి కడిగించివేసినారు. అతి నల్లగా వుండి నూతనఖద్యోతుని లేతకిరణాలకు నిగనిగలాడుతూ వుంది. అటు

వంటి రోడ్డుమీద ఆనాడు ముందుగా ఎవరి మోటారుకారు వెడు తుందో అని జనులు గుంపులుగుంపులుగా ఇటూ అటూ నిలబడి చూస్తూవున్నారు.

అంతక్రితం సామంత్రమే కంట్రాక్టరు తన కారు మిక్కిలి పరిశుభ్రంగా కడిగించి, తుడిపించి, మెరుగెట్టించి గారేజీలో నిలిపించుకొని యున్నాడు. అతగానిది మొట్టమొదటి దిగా వెళ్ళడానికి అవకాశం వుంది. లేదా జిల్లా కలక్టరుగారు వూళ్లోకి వచ్చి మకాంచేసియున్నారు. ఆయన కారు మొట్టమొదట నడచిపోవడాని కవకాశం వుంది. లేదా నాటిమెయిల్లో మినిస్టర్ గారు దిగనై యున్నారు. వారికారు పొయ్యేదాకా ఏవొక్క పురుగునీ పాకనైనా పాకనీయరేమో ఆ రోడ్డుమీద.

ఈలాగ్గా వేయివిధాలుగా చెప్పుకుంటూ జనం నిర్ఘాంత పోయి కంటూవున్నారు. రోడ్డు ఆరుదలకు వచ్చేసింది ఓ నిమేషంలో.

నిమేషంలో మెఱుపల్లే డాక్టరుగారు ఓ కారుమీద ఈతట్టు నుంచి ఆ తట్టుకు ఆ రోడ్డుమీద సాగినట్టయింది. కారు సాగిసాగి కంట్రాక్టరు ఇంటివద్ద ఆగింది. కంట్రాక్టరుది. ఎక్కి తిరిగింది డాక్టరు!

డాక్టరు కారు ఆపి కంట్రాక్టరుతో వెంటనే ఇంగ్లీషు నన్నాడు. " I tested. The road is alright. The speed is alright. The cushion is alright " ఆమెను తీసుకువచ్చి యీ కారులో పండబెట్టండి. వెంటనే క్షయ ఆసుపత్రికి తీసుకుని వెళ్లి అక్కడ ఇన్పేషంటుగా చేర్పించాలి. లేకుంటే లాభం లేదు. ఇది ' గ్యాల పింగు థైసు ' లా తోస్తుంది " అన్నాడు.

కంట్రాక్టరు అతి ఆదుర్దాగా ' బతకదూ! మా పైడితల్లి బతకదూ!' అన్నాడు. డాక్టరు ' చావుబతుకుల్నిగురించి ఎవరూ చెప్పలేరు. ఆలస్యంమాత్రం పనికిరాదు ' అన్నాడు. ' నాకీజబ్బు ఎక్కడ దాపరించింది అంటారు డాక్టరుగారూ!' అని అడిగింది రోగి. డాక్టరు ' చూడమ్మా! నీ వీమధ్యను చేసినపని ఏంపనో చెబితే చెప్పగలను. ఇంతకూ క్షయకు అనేక కారణాలు వుంటాయి. అయినా ఇప్పుడుకాదు ఆ జ్ఞానం సంపాదించుకోవడం, రోగం రాకముందే జాగ్రత్తపడి వుండవలసింది ' అన్నాడు. కంట్రాక్టరు ' పదిహేనురోజులక్రితం ఓ నెలరోజులు రోడ్డు దుమ్ము బ్రష్‌పెట్టి తుడిచింది ఈ కూలీ నా కింద: అంతకు మినహా చేసినపని మఱిలేదు.' డాక్టరు ' ఇకనేం, అదే ఈవ్యాధికి కారణం. క్షయదేవతకు మనుష్యులందఱూ సమానమే. అది ఉద్భవించేదే రోడ్డుదుమ్ములో. అందులోనూ ముక్కు ఆ దుమ్ముమీద పెట్టి—ఎంతకాలంనుంచి అలా ఆ దుమ్ములో అణగారి వుండివున్నాయో బ్యాసిలీ!—ఆ దుమ్ముమీద మోము వంచి పీల్చిన తర్వాత క్షయ రాక మఱేం జబ్బు వస్తుంది? బీద వాళ్ళకు డబ్బు యిస్తూ వాళ్ళవల్ల పని చేయించుకుంటూ వున్నామూ అంటే వాళ్ల విషయమైకూడా తగిన జాగ్రత్తలన్నీ తీసుకోవద్ద టయ్యా కంట్రాక్టర్!' అన్నాడు డాక్టరు. రోగి ' నా అంతట నేనే ఈ పట్నవాసానికి వచ్చి, ఈ పనిలో కావాలని కోరి ఏరి చేరి ఈ రోగం తెచ్చుకున్నాను ' అంది. డాక్టరు ' మఱి జాగు వల్లకాదు. ఆమెను మీ కారులో పరుండబెట్టించండి కంట్రాక్టరు గారూ!' అన్నాడు.

అక్కడ మఱిజనం ఎవళ్ళూ లేకపోవడంచేత కంట్రాక్టరు తన చేతులమీదనే ఎత్తి ఆ రోగిని కారులో పరుండబెట్టి తాను

పక్కను కూర్చున్నాడు. డాక్టరు కారునడుపుతూ వున్నాడు, రెండోసారి ఆ రోడ్డుమీదనే.

*  *  *  *  *

రోగే పైడితల్లి, పైడితల్లే రోగి అని డాక్టరుగారి యొక్కయు, కంట్రాక్టరు యొక్కయు సంభాషణవల్ల వ్యక్తమైంది. కాని ఆ యుదయానికి ఆ అవస్థలో కంట్రాక్టరు ఇంటి వద్ద పైడితల్లి కనిపించడం అనేది ఎట్లా తటస్థించిందో ?

పాపం ! పైడితల్లికి క్షయ ! శరీరంయొక్క తూనిక సుతలాం లేదనుకోవలసిందే. అయినా సహజంగా తేజోవంతాలైన తన కళ్లు రెండూ వోచోట ఊతంగా పైకెత్తి చూచింది ; నల్లనిరోడ్డు నిగనిగలాడేరోడ్డు గాంచింది. ' ఇదేగా నే తుడిచిన రోడ్డు ' అంది.—' ఇదేగా నే బాగుచేసినరోడ్డు ' అంది.— ఆ మాటలంటూ తన కొనవూపిరి ఆ నడుస్తూన్న కారులోనే విడిచింది.

ఆమెయొక్క భౌతికనిష్క్రమణం కనలేక కంట్రాక్టరు కంట తడిపెట్టుకొని గద్గదిగ్గా ' డాక్టరుగారూ ! ' అన్నాడు. డాక్టరు కారు ఆపి వెనక్కిచూచి నాడి పరీక్షించి 'చనిపోయింది' అన్నాడు.

కంట్రాక్టరు ' ఇవిగో ఈమెవస్తువులు. డాక్టరుగారూ ! ఇవి మీ కిస్తూవున్నాను. నా దగ్గఅవుంచి నేను వాటిని మార్చి, ఆమె చెప్పినదంతా చేయడానికి తగినధైర్యంలేదు. నా వద్ద ఆ ధైర్యం లేదు. ఎన్నిమాట్లు యోజించినా అడ్డుపీపాల ఆవల నుండి ఆమె ఈ వస్తువులు పెట్టుకుని, బాగుచేస్తూవున్న రోడ్డు చూచిన ఆమె నేలంకచూపే నాకు జ్ఞాపకం వస్తూవుంది. ఆమె

అన్న తుదిపలుకులు నా మనస్సులో నిలవడంలేదు డాక్టరు గారూ ' అని అన్నాడు కంట్రాక్టరు మిక్కిలిగా ఏడుస్తూ.

డాక్టరు ఆ వస్తువులు చూస్తూ ' ఈమె పేదరాలు కాదు. అరెరే ! ఏమివ్యక్తి. ఇటువంటి భాగ్యశాలిని కూలిపని చేసి ఈలా మరణించిందంటే చాలా ఆశ్చర్యంగా వుంది. ఇది దైవికం ! దీనికై నీవు వగవబనిలేదు ' అంటూ కంట్రాక్టరును ఊరడించి ' ఏంచెప్పింది తుదిపలుకు ? ' అని అడిగాడు డాక్టరు.

' ఏమీ లేదు. నిన్నటితో రోడ్డుపని పూర్తి అవుతుంది అని ఆమెకు తెలుసును. అంచేత నాకు కబురుచేసింది నిన్నరేత్రి. తాను జబ్బుపడి పోయాను చివర పదేనురోజులూ అంది. రోడ్డు పూర్తి అయిందా అని అడిగింది. ఆయాసపడసాగింది. పూర్తి అయింది అన్నాను నేను. అనగానే ఆమె ' మఱి నేబతకను కాని వొకటివుంది. రోడ్డుదుమ్ము తుడిచిన ఆ స్త్రీలనూ పురుషులనూ ముస్తాబుగా దిద్దితీర్చి వాళ్ళనందర్నీ చక్కని మోటారుకా రెక్కించి వొక్కతడవైనా ఆ రోడ్డుమీద తిప్పాలిసింది అని నాకోరిక. అందుకుగాను మీరు కారు కొనలేకపోదురేమో నాయీ వస్తువులమ్మి ప్రత్యేకంగా వాళ్ళకోకారు కొని ఆలా నా సొమ్ము వినియోగించవలసింది ' అని చెప్పింది. నాకు మిక్కిలీ జాలి పుట్టింది. ఆమెను రాత్రికిరాత్రి నాయింటికి తీసుకువచ్చి, మీకు నేను ఉదయాన్నే వర్తమానించాను. ' అన్నాడు కంట్రాక్టరు.

అంటూ కంట్రాక్టరు ' మఱి బతకదూ నా పైడితల్లి ' అని అడిగాడు డాక్టర్ను. డాక్టరు మఱొకసారి, పైడితల్లి పలికిన పలుకులజాడనే యోచిస్తూ ఆ కట్టెయొక్క పెదవులు నిదానించి పరికించి ' మఱి బతకదు ' అన్నాడు.

ఆలా డాక్టరు నిరూపిస్తూవుంటే మృత్యు మార్గమునుబట్టి పోతూవున్న పైడితల్లియొక్క పొడుగు నీడగా కనబడింది నల్లనితారురోడ్డు.

# పచ్చితవుడు

## 1

వర్షం వొక్కొక్కప్పుడు మనుష్యుల్ని వొక్కొక్క పల్లెటూరిలో స్తంభాల్లా పాతేసి వూరుకుంటుంది. ఎక్కడకూ కదల్నివ్వదు. వీధరుగుల మీద కూర్చున్నవాళ్లు అల్లా కూర్చునిపోతారు. పెద్దపెద్ద వాన తాళ్లు గాలి ధూకుణ్ణే ఏటవాలై భూమిలోకి తీగమేకులల్లే దించుకు పోతూవుంటే నిర్ఘాంతంగా చూస్తూ, 'భగవంతునిమాయ! అంతా భగవంతునిమాయ! ఎంతట్లో కొట్టి కోలాహలం గావించేస్తూ వుంది' అని ఒండొరులతో వుగ్గడించుకుంటూ, మీదిమీదికి జల్లు కొడుతూవున్నకొద్దీ విడిప్రజ మతీదగ్గరసా, మతీదగ్గరసా ఏదో గోడపంచకు జేరుకుంటూవుంటారు.

గోడవతల ఇల్లే వుందో పెరడే వుందో, అంటే వుందో సొంటేవుందో, మాలలే నివసిస్తున్నారో మాదిగలే నివసిస్తున్నారో ఎవరి క్కావాలి? గోడమాత్రం తమమీద పడిపోకుండా వుంటేచాలు.

అలా ఆపద్బాంధవంగా కుదిరి, కూలబడకుండా వున్న పురాతనకుడ్యం వొకటి 'పెదసనగొట్టుపాలెం' అనే వూళ్లో ప్రసిద్ధికెక్కింది కద్దు దానినిడివి ఎనిమిది గజాలు. ఎత్తు రెండు గజాలు. మంద రెండు అడుగులు. లోపల ఇటికతోకూడిన మన్నో, కేవలం బంకమన్నో ఇప్పటికిన్నీ తెలిసికొన్నవారు లేరు. పైనిమాత్రం వోచోట వెల్ల బెల్లుబెల్లులుగా గిల్లివేయబడ్డ వెలుతులమీద పిడకలు తరవబడి వొలవబడ్డ చిన్నెలున్నాయి.

మతోచోట వెల్ల మాసిపోయి మిగిలిన జాడులంట ఏవేవో అక్షరాలు ' శ్రీరామ ! సీతారామ ! ' అని మసిబొగ్గుతో వ్రాసినవి కనిపిస్తున్నాయి. ఓమూల చవుడుదేర పేడమెత్తి అలికిన తీరు : ఇంకోమూల చాకలిపద్దు ' మామిడంచుల తలపాగాగుడ్డ ' సౌరు : ఓ ప్రాంతంలో ఎఱ్ఱపెన్సలుతో ఆకుపచ్చ పెన్సలుతో గీయబడి తోకాగీకావున్న ఆంజనేయవిగ్రహం : వేఱుప్రాంతంలో తామరతూడు ముట్టె నెట్టుకొన్న హంసబొమ్మ : ఓపక్క ప్లస్సు సంజ్ఞ, ఓ పక్క మైనస్ సంజ్ఞ ; ఓ వెంపు డామ్, ఓ వెంపు ప్రశ్నార్థకము—ఇలా రకరకాల గీతలతో, ఘాతలతో, అక్కరాల్తో, అంకెలతో నిల్చిపోయిందై, ఒకప్పు దేదోకుటుంబానికి, మఱొకప్పుడేదో బాటసార్లకు, ఇంకోఅప్పుడేదో ముష్టివాళ్లకు, వేఱప్పు డేదో సన్యాసులకు, ఎవరూలేనప్పుడల్లరి పిల్లకాయలకు, వానప్పుడు గొడ్లకు, వెన్నెలప్పుడు గోవాళ్ళకు ఆ గోడ ఆసరా యిచ్చి యుండాలి అని చూపఱకు తట్టకమానదు.

ఎండవేళన్నా ధైర్యంచేసి ఆ గోడవెనక యేముందో జిజ్ఞాసగానైనా భావించినవారు లేరు. ఇక దబాటుగా వానపడుతూ వుంటే చెప్పనవసరమేలేదు. దాన్ని తాకినవారే అరుదు. ఎప్పుడు ఎవడు పోసిన మదురో అది : మళ్లీ ఆ గోడమీద మదురోసిన వ్యక్తి కానరాడు.

ఒక తెల్లాఱగట్ల ఓ జుత్తున్న పెద్ద కోడిపుంజు ఎక్కడి నుంచి ఎగిరి ఆ గోడమీద నిలబడ్డాదో రెండుకాళ్ళా నిలబడి నిక్కి 'కొక్కొరోకో, కొక్కొరాకో !' అంటూ కూయసాగింది. ఊరంతా కొత్తగా వింటూ తెల్లాతే అంతలో విరగబడి ఆ కోడి పుంజును అతివింతగా—మహావింతగా చూడసాగారు.

ఆలా ప్రజలు విఱగబడి వీక్షిస్తూనేవున్నారు. వెట్టియాన్ వీరేశుగాడు తన పెద్దకర్ర కోడికి తగలకుండా కోడిని దిగమన్నట్టు గిరాటేశాడు. కోడి రెక్కలార్చుకుంటూ రివ్వున గోడ ఆవలెంపుకు వాలింది. వీరేశుగాడు 'అచ్చమ్మగారూ! కోడి మళ్ళా మీ దొడ్లోకే దిగింది. పట్టుకోండి' అని కేకేశాడు. అవలనుంచి కోళ్ళ అచ్చమ్మ 'నాయనా! దొరికింది. పట్టుకున్నాను' అంటూ పుంజును చంకపెట్టుకున్నదై తిప్పుకుంటూ కోడిపాళంగా గోడెక్కి వీధిలోకి దూకడానికి మాత్రం జంకింది.

చూచేజనం కొంతమంది దాంతో గోడలోతట్టు మెఱక అని తాము కొత్తగా గ్రహింప గలిగిన జ్ఞానంతో . సంతృప్తులై వెళ్ళిపోయినారు. కొంతమంది తాము విన్న పుంజు కొత్తపుంజు కాదు. అచ్చమ్మ కోడే అని ఆదాకా పడ్డ రిచ్చపాటు ఎక్కడిదక్కడ విడిచిపుచ్చి వెళ్ళిపోయినారు.

అచ్చమ్మ మాత్రం ఆ కోణ్ణి వీరేశుగాడి కందిస్తూ 'లమ్డీ! నన్ను వొగ్గేసి వెళ్ళిపోతున్నావు!' అంది. వీరేశుగాడు ఆ కోణ్ణి అంది పుచ్చుకుంటూ 'అచ్చమ్మగారూ! జాడీవిండా పచ్చితవుడు పోసి పంపించమన్నారు. పంపించారా?' అన్నాడు. 'ఆఁ! కరణంగా రింటికేనా?' అంటూ అచ్చమ్మ తిరోహిత స్వరూపిణీ ప్రమాణంగా గోడ ఆవలివెంపునకు దిగి చక్కాపోయింది.

గోడమీద మర్నాడు కొత్తకొత్తగా రికార్డయింది——

"అచ్చమ్మ కోడి పచ్చితవుడు ఝూడీ." అని పెద్ద అక్షరాల్లో, రైలుబద్దీల మధ్య వొరవడిలా!

మానవు లీ రోజుల్లో అటువంటి రికార్డు చదివి ఆనందం పొందగలరా ? పొందలేరు. వారికి గ్రామోఫోనురికార్డులు రేడియోరికార్డులు కావాలి ! గోడమీదవ్రాసిన లేఖరిది వట్టి ప్రయాస. ఎవడు చూణ్ను ? ఎవడు చదవను ? ఎవడు వినను ?

౨

కెన్‌సింగుటన్‌దొరది అసలుపుట్టుక ఇంగ్లాండుదేశంలో సౌథాంప్టన్ షైరులో మిక్కిలీ మాఋమూల. అయినప్పటికిన్నీ ఐ. సి. ఎస్. పరీక్షలో వుత్తీర్ణుడై హిందూదేశం వచ్చి యిక్కడ మొత్తంమీద—మదరాసు రాజధానియొక్క ఇరవై అయిదు జిల్లాల్లోను ఇరవై జిల్లాల్లో, జిల్లా వొకటింటికి ఏడాదిఏణ్ణర్థంగా కలకటేరుపనిచేసి రిటైరై, తిరిగి స్వదేశానికి 1937 వ సంవత్సరం జూలై నెలలో వోడెక్కి వెళ్ళిపోయినాడు. ఆయన భార్య మిసెస్ కెన్‌సింగ్టన్నుకు హిందూదేశం అంటే వెఱ్ఱిప్రేమ. అసలు ఆమెకు ప్రతీపురుడూ భారతవర్షంలో పోసుకోవాలనే అభిలాష. అయితేం, మగనియొక్క పట్టుదలకొద్దీ ఆమె తన పిల్లల్నందరినీ ఇంగ్లాండులోనే కనేసింది. కన్‌ఫైన్‌మెంటుకని ఆమెను ఆరునెల్ల ప్రెగ్నెన్సీ అప్పటినుంచీ ప్రయాణం గావిస్తూ, ఆఖరుకు ఎనిమిదోనెలనైనా బొంబయిలో వోడెక్కించి పంపించేశేవాడు. కాని 1937 లో దొరగారు ఫించన్‌పుచ్చుకు ఇంగ్లండు వెళ్ళిపోవడం వచ్చినప్పుడు అమ్మగారు గర్భం దాల్చివుండలేదు. రికామీగానే వున్నారు. దాంతో ఆమె మగనికి విస్పష్టంగా విన్నవించింది : ' మీరు ముందు వెళ్లండి. నేను వెనుకనుంచి నెమ్మదిగా వస్తాను. నాకు హిందూదేశం అంటే మిక్కిలి యిష్టం. ' ఐస్టే హియర్ ఫర్ సమ్‌టైమ్, యు ప్లీజ్ గో ఎ హెడ్, '

దొరగారు ముందు వెళ్ళిపోయినారు. మిసెస్ కెన్‌సింగ్టన్ అన్న ఆవిడ హిందూదేశంలో దిగడిపోయింది.

ఆమె కిప్పుడు పెనిమిట్ని గుఱించిన హైరాను మఱేమీ లేదు. వొక్క క్రిష్టమస్ పండక్కి—అప్పుపత్రాన్ని జ్ఞప్తికి తెచ్చేటట్టు, తన ప్రేమను నెమరుకు దెచ్చే బహుమానం వొకటి ఆయనకు పంపించడంతక్క. మదరాసు యూరోపియన్ క్లబ్బులో బసపెట్టి 1937 నవంబరు 15 వ తేదీనుంచీ యోజించ సాగింది 'ఏం పంపిస్తే బాగుంటుందీ?' అని. ఆమె కోపూట బహుసున్నితంగా తట్టింది. మిస్టర్ కెన్‌సింగ్టన్ ఉభయగోదావరీ మండలంలో కమానుమీదున్నప్పుడు 'పెదసనగొల్లుపాలెం' అనే కుగ్రామంలో మకాంచేసి అక్కడ కొంతకాలం వున్నట్టు, ఆ కాలంలో అక్కడి కుక్కుటాల నతగాడు గొప్ప డెలికెసీలగా భావించినట్టు తట్టింది. తనభర్త టూర్నుంచి తిరిగివచ్చిన తరువాత కూడా అనేక పర్యాయములు ఆ పెదసనగొల్లుపాలెం కరణానికి తన ఎడ్రెసు పంపుతూ అధమపక్షము వారాని కోతూరైనా వొక కోణ్ణి తెప్పించుకుంటూ వుండేవాడన్న సంగతి ఆ మగనాలియొక్క సంస్ఫురణ వాతావరణాన్ని అలుముకుపోయింది.

వెంటనే ఆ కరణాని కోజాబు వ్రాసింది. తన భర్త తెప్పించుకుంటూ వచ్చిన కోడియొక్క వివరం ఎఱుకపరుస్తూ, ఆ కోడికి వేసే మేతకూడా దాంతో జతపరుస్తూ, చక్కని నెమలి పుంజంత కోడిపుంజును జరుగురుగా పంపించవలసినదని వుత్తరం వ్రాసింది. వ్రాసి ఎక్స్‌ప్రెస్ డెలివరీ ఎట్టుబిళ్ల అవుత్త్రానికి అంటించి తపాలాపెట్టెలో పడేసింది.

పెడసనగొట్టుపాలెంకు తపాలాఫీసు లేదు. కాని ఎక్స్ప్రెస్ డెలివెరీ అంటింపు కాగితాన్నిబట్టి పోస్టల్ డిపార్టుమెంటు గారు ఓ వార్తాహరుని చేతికి తక్షణం ఆ వుత్తరం ఇచ్చి పెడసన గొట్టుపాలెం కరణంగారికి అందచేసినారు. 1937 నవంబరు 25 వ తేదీ సాయంకాలం 7 గంటలకు సరిగ్గా అందింది అది.

వెంటనే కరణంగారు తమవూళ్లో ఇంగ్లీషు వచ్చినవాళ్లు లేక, తనకురాక తికమకపడి, ఆ వుత్తరాన్ని పొరుగూరు మిడిల్ స్కూల్‌మాస్టరు వద్దకు తీసికొనివెళ్ళి వానిచే వినిపించికొని మిసెస్ కెన్సింగ్‌టన్' అని సంస్మరించుకుంటూ రేత్రి గంటలకు చేతిలో వుత్తరం పదిమడత లెట్టుకుంటూ చేరు కున్నాడు. వెంటనే కోళ్ళ అచ్చమ్మకు కబురంపాడు. 'నీ వూసు తెన్నాళ్లకు మళ్లీ దొరగారి తలంపుకు వచ్చిందేవ్.' అన్నాడు. ఏ దొరగారండో?' అంది అచ్చమ్మ. 'పేరు నోట్లో ఆడుతూవుందే. పైకి రావడం లేదే. మఱచిపోయేనే. ఉండు.' అని ఉత్తరం మడతలు వూరికే విప్పి విప్పి తన యింట్లో వున్న తుపానులాంతరు' దీపంముందు చూచేడు. కరణంగారికి జ్ఞాపకం రాలేదు పేరు. అచ్చమ్మ 'వుండండి! నేనా దొరగారి పేరు గోడమీద మా వెంపుని ఆయన బట్లరుగారిచేత రాయించు కున్నట్టున్నాను. వెనకోపాలి మనూళ్లో మకాంచేసిన దొరగారే నండీ!' అంది. ఆ పాళంగా అచ్చమ్మా, కరణంగారూ ఇద్దరూ ఆ లాంతరుచ్చుకు, సనాతన పురాతన పాత గోడయొక్క రెండోవెంపున వ్రాసివున్న దొరగారిపేరు–తెనుగక్షరాల నున్నది– గుర్తించారు–'కిన్సింగ్‌టన్ దొరగారు' అని గుర్తించి యివలకు వచ్చి 'దొరసానమ్మగారు మాంచి చక్కటి కోణ్ణి పంపమన్నారు'

అన్నాడు అని తన రొంటినుంచి తీసి రెండురూపాయలు అచ్చమ్మచేతిలో పెట్టాడు కరణంగారు.

క్కోళ్ల అచ్చమ్మ ఉబ్బి తబ్బిబ్బై పోయింది. వెంటనే కొంచె మిదయి 'కోడి కేంకూ దెడతారో ఆరు' అంది. కరణంగారు 'నీ వేం వేస్తావు ?' అని అడిగేడు. 'నేనా ? పచ్చితవుడు. నే దంపుకెళ్ళినచోటల్లా ఓ మానె డట్టుకొచ్చి వేస్తూవుంటాను' అంది అచ్చమ్మ. 'అదే కోడితో జతపరచి పంపించమన్నారు ఆవిడాను. చూడు ! నే నో జాడీ పంపిస్తాను. అందులో పోసి ఇవ్వు. తెల్లాఅగట్ల ఎవరికీ తెలీకుండా లకోటాచేసి పంపించాలి. కోణ్ణీ జాగ్రత్తపెట్టు. జాడీ నిండబెట్టు. మళ్లీ నిద్దరోయావు సుమా ! మఱచిపోయేవుసుమా !' అన్నాడు కరణంగారు. 'తెల్లారిపోతేనేమండీ ?' అంది అచ్చమ్మ. కరణంగారు 'పిచ్చి దానా ! కరణున్నై కోళ్ళనంపుతున్నానంటే యీవూళ్లో బ్రాహ్మణ్యం నన్ను బతకనిస్తారే ?' అన్నాడు. 'తక్కినబామ్మర్లు మీకంటె పెద్దపెద్ద కానిపనులే చేస్తూవున్నారు. మీరు కానడం లేదుకామోసు. అయినా ఆ నీలిటొంపు మనకెందుకునేండి. అలాగేలేండి' అని సెలవుపుచ్చుకుంది అచ్చమ్మ.

కరణంగారింటికొచ్చి, కోణ్ణి ప్యాక్‌చేయడం ఎట్లా, రైలెక్కించడం ఎట్లా, జాడీకి సీలేయడం ఎట్లా అనే ఇట్లాంటి ఆలోచనల్తోనే రేత్రి మూడోజాందాకా — మూడోజాందాకా యేంటి ? గోడెక్కినకోణ్ణి అచ్చమ్మ వీరేశుగాడి కందిచ్చి, ఆమె కూడా జాడీతోనూ, కోడితోనూ వీరేశుగాడి వెనకాలే వచ్చి తన యింట హాజరయ్యేదాకా—కాలం గడిపేడు.

అచ్చమ్మొచ్చాక, కోణ్ణి చూచాక ‘ అచ్చమ్మా ! నీకోడి యొక్క వివరం వ్రాయమన్నారే దొరసానమ్మగారు. ఏమని వ్రాసేది ’ అని అడిగేడు కరణం అచ్చమ్మొంక తిరిగి, అడు గుతూ వ్రాసేశాడు ఓ కాగితమ్ముక్కమీద ‘ అచ్చమ్మ కోడి నెం. 1. ’ అని. ‘ అచ్చమ్మా ! నీ పేరు కోడికూడా పెట్టేశాను. ’ అంటూ ఆ కాగితాని కోదారం కట్టి ఆ దారం ఆకోడి కాలికట్టాడు కరణం. కోణ్ణి, జాడీని పంపేశాడు.

అచ్చమ్మ అన్నాది : ‘ మీ రెంత రహస్యంగా రెండో కంటికి తెలియకుండా అంపాలనుకున్నారో అంత వెల్లడి అయి పోయింది కరణంగారూ ! నా పేరుకూడా బయటపెట్టేస్తున్నారు : పెట్టెయ్యండి ఏం చేస్తాను ? ముండాకోడి ముట్టుకోనిచ్చింది కాదండీ ! రేత్రి పట్టుకు గంపకిందదేసి గుట్టుగా మట్టుగా అట్టే పెట్టేద్దామంటే, సుక్కొడవకుండానే గోడెక్కికూకుంది. వీరేశు గాడు అవతల్నుంచి కర్రిసరకపోతే తుర్రోమని తోటలూ పేటలూ దూకుక్కుంటా పోయేదే ’ అని

## 3

బ్రాడ్‌కాస్టింగు గ్రిడ్‌కాస్టింగు యంత్రాలూ తంత్రాలూ వచ్చింతరువాత, స్ఫియర్ గియర్‌లాంటి పుస్తకాల్లో దూర మారపు బొమ్మలు కమ్మలు గుచ్చెత్తిపోసినట్టు కనిపిస్తూవున్న తరువాత కథలో లండన్‌నగరాన్ని గురించి వ్రాయడం కేవలం పాఠకులయొక్క విలవైన కాలాన్ని వృథా పుచ్చడం.—

“ క్రోయిడన్ ” మైదానమ్మీద కొక్కొరోకో అని అచ్చమ్మకోడి గంపలోంచి కూనేసరికి సీమదొరలూ, సీమదొర

సానులూ వాళ్ళనాంవులూ నవుకరులూ వేలకువేలుగా చుట్టేశారు. దాంతో కూడా పచ్చితవుడుజాడీ దిగుమతీ కావడంతోనే ఆ జాడీ మీద పేరు చూచేరు.

" Asham Kodi—అషమ్‌కోడి

Pashi Tavudu Jadi—పషితవుడ్ జాడి "

అవి కూడా బలుక్కుంటూ చాలామంది అక్కడివారు 'అషామ్' 'అంకుల్‌షామ్' కు చుట్టమా అని, 'పషి తవుడ్' పార్శీవాళ్లు వుపయోగించుకునే 'ముఖంజల్లుపౌడి' వా అని యిలా కించిద్వినూతనవినోదంగా విచారణ గావించారు. అంతకంటె ఎక్కువ కనిపెట్టడానికి ఎవరికిన్నీ వశంకాకపోయింది. ఎంచేతా అంటే ఎవరి పార్శెళ్లు వాళ్ళకు వెంటనే పంపివేయబడాలి. అందు లోను కోడి అన్నది 'లివింగుస్టాక్'—ప్రాణంతో వున్న పదార్థం. ఎయిర్‌రూటున పంపబడించి. సద్యోగర్భంలా వెంటనే డెలివరీ అయిపోవాలి.

ట్రఫాల్గర్ స్క్వేరులో ఓ పదంతస్తులమిద్దె మీద తగు మాత్రంగదిలో 'హార్తు' ముందు వెచ్చగా కూర్చుని కిసిమిసి పండగ నడుపుకుంటూవున్న కిన్‌సింగ్టన్ దొరగారి ముందుంచ బడ్డాయి కోళ్లగంపా, పచ్చితవుడు జాడీ. మఱీన్నీ మిసెస్సు కింసింగ్టన్ కేబిల్ ముఖతా కొట్టిన కిస్‌మిస్ సుఖాభినందన వాక్యాలుకూడా అప్పుడే దొరగారి కందినయి. చూచాడు. చదువు కొన్నాడు.

" ఓ ప్రేయసీ! నీకు నాయందు గల ప్రేమ అపారం అని ఈ పూట తెలుసుకొనుచున్నాను. నీవు పంపిన కాక్, కాక్

పుడ్ జాగ్రత్తగా చేరినయి. రిటర్ను న్యూయియర్ గ్రీటింగ్సు!" అని భార్యకు వెంటనే మిస్టర్ కిన్సింగ్టన్ కేబిల్ కొట్టి, కోణ్ణి తవుణ్ణి బట్లరుకి వొప్పజెప్పినాడు. మఱిన్ని లండనులో తానున్న మాటమఱచిపోయి, గోదావరి కలెక్టరుగా వుండి పెదసనగొట్టు పాలెంలో టూరింగు ఆఫీసరుగా విశ్రాంతిగొన్న సంగతి అంతా ముంజేతిఅద్దంలా కనిపిస్తూవుంటే మురిసిపోయినాడు. ' అషామ్! హౌ ఈజ్ అషామ్. అచ్చమ్. ఇట్ మస్ట్ బి కోళ్ల అచ్చమ్మ. ఐ షల్ సెండ్ హెర్ ఎ సావనిర్ అఫ్ సమ్ కైండ్.' అని తన టేబిల్‌మీద వున్న ఫిజికల్ కల్చర్ మాగజీన్—బొమ్మలతో వున్నదొకటి—తీసి ప్యాక్‌చేసి దానిమీద చిరునామా వ్రాసేడు.

Miss Kolla Achamma
Pedasangottupalem,
Godavari Dt M. P

(కోళ్ల అచ్చమ్మకు, పెదసనగొట్టుపాళెం,
గోదావరి జిల్లా, మద్రాసు ప్రెసిడెన్సీ.)

అని వ్రాసి వెంటనే దాన్ని ప్రెజెంటేషన్‌కాపీగా పంపించాడు. పోస్టు చేయడానికిముందు ఆ బుక్కుపాకెట్టు కో వాయువిమానపు టప్పాల నీలపుబిళ్ళ అంటించి, పోస్టుచేయడానికి తనమిద్దె దిగి కిందికి వచ్చాడు.

లండనులో ఆ క్రిస్టమస్ సాయంకాలం మహాప్రళయంగా వానకురిసి ట్రాఫిక్ ఆగిపోయింది. నెల్సన్‌స్టాచ్యూ నెల్సన్ స్టాచ్యూలా వాననీళ్లల్లో ప్రతిఫలిస్తూవుంది. అదేమిన్నీ గమనించకుండానే మిస్టర్ కిన్సింగ్టన్ ఓవర్‌కోటు ఈడ్చుకొంటూ వైళంవెళ్లి పోస్టుబాక్సులో ఆ మేగజీన్ పడేశాడు.

అచ్చమ్మ మిక్కిలీ రిచ్చపాటుతో ఆ బొమ్మల పుస్తక బహుమానం 1938 సంక్రాంతి పెద్దపండగనాడు అందుకుంది. తాను దంపుతూవుంటే వేసికొనే చీరా రయికాకాని వేషంలాంటి వేషం వేసికొనివున్న ఓ దిసపిక్కల, దిసతెక్కల బొమ్మను ఆ పుస్తకపు ముఖపత్రమ్మీద కనిపెట్టిందై అచ్చమ్మ తిన్నగా కరణంగారి దగ్గఱకు వెళ్ళింది. వెళ్ళి బొమ్మను కరణంగారికి చూపిస్తూ 'ఈ బొమ్మ అన్నిందాల నన్ను పోలివున్నట్టుందేం టండి సూడండి కరణంగారూ !' అంది. కరణం అచ్చమ్మ మెర యిస్తున్న కర్ణకనక మోకంట, అచ్చమ్మ దరియిస్తున్న బొమ్మో కంట, లక్షిస్తూ అన్నాడు : 'వొక్క నీ తెప్పలమీద పచ్చితవుడు తప్పిస్తే నీవు శతధా సర్వధా ఈ బొమ్మను పోలి వుంటావు అనుకో అచ్చమ్మా! నీకీర్తి దిగంతాలా మారుమోగిందే అనుకో!' అన్నాడు. ఎక్కణ్ణుంచి పొత్తం వచ్చిందో ఆవులిస్తే పేగులు లెక్కించే కరణానికి ఎఱుకపడకుండా వుంటుందా ?

అచ్చమ్మ మళ్ళీ మళ్ళీ ఆ బొమ్మకేసి చూస్తూ, 'ఆదొర గారికి నేనంటే ఎంత గాఁపకమో !' అని హెచ్చరిల్లి ఒక్క గుక్కలో కళ్ళనీళ్లు గుక్కుకుంది. 'మాయదారి ఆ కోడి యిక్కడవుండి వుంటే ఎన్ని పుంజుల్ని యేల పందాల్లో మనూర కొడిచివుండేదో కదా మహరాజా ! పెట్టిముండను కక్కుర్తిపడి, మీ రిచ్చిన ముండా రెండురూపాయల కాసపడి అమ్ముకున్నాను.' అని వెక్కుతో వాక్కుతో వెక్కుతో వాక్కుతో కూలబడి పోయింది.

కరణంగారు 'ఎందుకు అచ్చమ్మా ఏడుస్తావు ? ఇక్క డుంటే నీ కోడి చవిటిగోడెక్కి అఱవడమేకదే. నీకు అకళింపు

లేదుగాని, సీమదొర కుబేరకుక్షిలో నిక్షిప్తమై జీర్ణించే మహా భోగం ఏ జీవికి పట్టును? ఏడవకు. ఇంటికి పో ' అని ఆమెను సాగనంపేడు.

ఎంత సాగనంపినా అచ్చమ్మ తన కొంపలోకి పోలేక పోయింది. నిర్జీవప్రతిమల్లే ఇక్ష్వాకుల్నాటి తన పెరటిగోడ యొక్క వెలపలితట్టుకు తన చట్టలు తగిలేటట్టు జేర్లబడి పోయింది. తనయొక్క అమ్ముడువోయిన కోడికూత, ఆకాశ వాణీ స్మృతిమాత్రంగా వినిపిస్తూవుంటే, అచ్చమ్మ గుండె సెదిరి, గోడచవుడే పచ్చితవుడుగా విరజిమ్మేసింది.

## 1936లో జరిగింది

"ప్రేమ అన్నది కన్నులోన
పుట్టదు, వెన్నులోను పుట్టదు.
అది చిన్నతనంలోనే విజృంభించి వుంటుంది. దానికి కంటిచదు
రుతో కాని వెన్నుముదురుతోగాని ప్రమేయమేలేదు. ప్రేమ
ప్రతీవాళ్ళకూ, ఆడవాళ్ళకేమిటి మగవాళ్ళకేమిటి, అక్షరాభ్యాసం
కాలంనుంచీ అమరివుంటుంది ఏమనుకున్నారో!" అంది కుంద
కుట్మల గోవిందమ్మ, పరేంగితం ప్రసన్నాదిత్యారావుతో.
ప్రసన్నాదిత్యారావు, 'కాని ప్రేమ అన్యోన్యతః అన్నది
పెద్దయిన తరువాతనే అని నా వూహ.' 'కాకపోవచ్చునుకూడా
లేండి. నేనూ గోవిందమ్మా వున్నామా మా ప్రేమ చిన్నప్పుడెల్లా
వుండేదో ఇప్పుడూ అల్లాగే వున్నది. ఇకముందూ అట్లాంటిది
గానే అంత యిదిగానూ వుంటుంది.' అన్నాడు కుందకుట్మల
వికసనమల్లిక్.

ఆదిత్యారావు 'అయిదోయేటనుంచీ మీలోనూ మీ ఆవిడ
లోనూ వున్న ప్రేమ మీ యిద్దఱిలోనూ పరస్పర జన్యమైంది
అంటారా? మధ్యను పెళ్లి అప్పుడో మఱోఅప్పుడో సముద్భ
వించింది కాదంటారా?' అని అడిగాడు. గోవిందమ్మ వికసన
మల్లిక్కేసి, వికసనమల్లిక్ గోవిందమ్మకేసి ఓ మాటు చూచు
కొన్నవారై ఇద్దఱూకూడా పరేంగితం ప్రసన్నాదిత్యారావుతో
ఏదో జవాబు చెప్పబోయే ఇంతలో—గోవిందమ్మ మల్లిక్‌గార్ల
ఏకైక కొమార్తె అయిన కుందకుట్మల 'నైట్‌క్వీన్' వీధిలోంచి
హాల్లోకి అడుగుపెట్టింది!

ఆదిత్యారావు మిస్ నైట్‌క్వీన్ని చూస్తూనే, యువక శ్రీమదాంజనేయుల్లా అన్నట్టు తనఛాతీ పెంచుకున్నవాడై, 'హల్లో గుడ్ ఈవ్నింగ్' అన్నాడు. వీధిలోనుంచి ఇంట్లోకి వచ్చేటప్పుడు కలిగే వెలుతురు చీకటి తేడా పాళా చూపుచేతనో, నిజంగా గుర్తుపట్టలేకనో, నైట్‌క్వీన్ ఆదిత్యారావును, అతి లాతి వాని నను గ్రహించినట్టు, ఒక్క మెడవంపు భంగిమంతో 'గుడ్ ఈవ్నింగ్' అంటూ తిన్నగా తన చదువు - గదిలోకి వెళ్ళి పోయింది.

పిల్లచేతినిండా చేతెడు టెక్స్టుబుక్కులు, టెక్స్టు బుక్కుల కంటె ఎక్కువ డైమెన్షన్సుతో వున్న నోట్సు బుక్కులు, వీటన్నిటిమీద ధగద్ధగాయమానంగా వున్న కంపస్‌బాక్సు, బాక్సుమీద ఏదో చేతిపని పరంజాం ఆదీ వున్న పంచరంగుల చిన్నగూడబుట్ట! పునాదినుంచి మదురు పర్యంతం ఆ నిశ్రేణి పరికిస్తమా, అట్టడుగు ఏ పోకముడి మీదో బరువు ఆనుకుని వుండాలి. పై గూడబుట్టఅంచు రాపిడివల్ల మిస్ నైట్‌క్వీన్ యొక్క నున్నని చిలుకం కించిత్తైనా గీచుకుపోయివుండాలి. ఆ గీత! మెత్తమెత్తగా తోసెయ్య దలచేవారికది ప్రబంధ సంబంధమైన నఖక్షతంగా మటుమాయం గావచ్చు, వొత్తివొత్తి పరీక్షగా అడిగేవారికది డాక్టరు సర్టిఫికేటులో కనవచ్చే 1/40 పొడుగు, 1/80 వెడల్పు, 1/400 లోతు అయిన బ్రూయిస్ మానుపుండు కావచ్చు. కాని ఆమెను ఆదిత్యారావు కేవలం విలాసపుచూపుతోనే చూచినవాడు; ఏ విధమైన జాలిచూపుతో గాని, గేలిచూపుతోగాని, చూడక ఆమెను ఆలా ఆమె గదిలోనికి వెళ్ళనిచ్చి వికసనమల్లిక్‌తో 'మీకు తెలుసునో తెలియదో

మీ అమ్మాయీ నేనూ ఫస్టు స్టాండర్డులో క్లాసుమేట్సుం. ఎప్పు డనుకున్నారు ? 1916 లో, ఇప్పుడు మనం ' 1936లో వున్నాం! ఆమె మఱచిపోయివుంటుంది నన్ను !' అన్నాడు. గోవిందమ్మ 'మఱపు అన్నది మా అమ్మాయికి ఎప్పటికీ ఏ కోశమందునా లేదు. మఱపు అన్నదే వుంటే ఈలా ఏటేటా పరీక్షల్లో గట్టెక్కుతో ఫస్టుక్లాసులో ఫస్టు కావడం ఎట్లాజరిగివుంటుంది ?' అంది. ఆదిత్యారావు ' అయితే యిప్పుడేం చదువుతూవుందంటారు మీ నైట్ ' మల్లిక్ ' మా నైట్క్వీనా ?....ఎం. ఏ. ప్యాసయి ఆ పైని యిప్పుడదే సబ్జెక్టులో రిసెర్చి చేస్తూవుంది. ఆదిత్యారావు 'ఆలానే విన్నాను, గాని కన్నది లేదు.' గోవిందమ్మ ' వస్తుంది. కొంచెం ముఖం అదీ సబ్బెట్టి రుద్దుకొని ఈవ్నింగు డ్రెస్ వేసికొంటేనే తప్ప మా క్వీన్, విజిటర్లను రిసీవ్ చేయదు.' అంటూ ఏదో పనిమీద తాను పడమటింటిలోనికి వెళ్ళిపోయింది. వికసనమల్లిక్, మేడమీది టెలిఫోన్ గంట చప్పుడైతే ' ఇప్పుడే వస్తానండీ ! ఆదిత్యారావుగారూ ! ఈ ఇల్లస్ట్రేటెట్ మాగజీను అయిదునిమిషాలు చూస్తూ ఎంగేజ్ కాండి.' అని మెట్లవంపునే తిరోహతుడైనాడు.

ఆదిత్యారావు పిక్చర్ బుక్ విప్పకుండానే ఇటూ అటూ చూస్తూ గోడనువున్న ఆరేళ్ల ఆడపిల్ల ఛాయాపటం ఒకటి చొరవ చేసి మేకునుండి తీసి తనచేతిలో పెట్టుకొని తిలకిస్తూవున్నాడు.

హఠాత్తుగా, ఏదో మార్పు ఆకాశంమీదనో, చెట్లకొమ్మల గాలినో కలిగి, సాయం సంధ్యారాగ ప్రశస్త కాంతి హాలుకిటికీ లమ్మట హాల్లోకి పొర్లెత్తినట్టు తెర్లతెర్లగా, అలలలలుగా, కొల్లకొల్లలుగా ప్రసరించి, హాల్లోని కుర్చీల నీడల్ని,

మేఘాబల్లలసీడల్నీ, బీరువాలనీడల్ని మూలమూలల జాడల్ని తేలగొట్టి అదోవిధమైన తియ్యందనం రేకెత్తించింది. ఎంత హఠాత్తుగా కొత్తకాంతి ఆ హాల్లోకి మడుగుకట్టిందో అంత చటాల్న కొత్తముస్తాబుతో 'నైట్‌క్వీన్' తనగదిలోంచి హాల్లోకివచ్చి మాట్లాడకుండా మాట్లాడించింది ఆదిత్యారావును.

"ఏమోయి ఆదిత్యారావు! నీవు చాలా పొడుగైనావు! చాలా స్థూలంకూడా అయినట్టున్నావు! నిన్ను పోల్చనే లేక పోయాను సుమా ఇందాకా వెరీ సారీ, నా రూమ్‌లోకి వెళ్ళి అద్దంచూచుకుంటూ ఏదోసర్దుకునేదాకా అసలు నా బుఱ్ఱలోకి నీ పేరుగాని నీ వెనకటి రూపంగాని, నా యీ బుఱ్ఱలోకి దూరనే లేదు. You have thrcughly changed! ఇదంతా శుద్ధ కామాఫ్లూజ్ (Camaflouge) కాదు కదా?"

అని ఎదరకుర్చీలో వాలికూర్చుంది, నైట్‌క్వీన్. ఆదిత్యారావు—నెగటివ్‌చేత పోసిటివ్ లాగబడి 'చమక్' అన్నంత—గంజాగా—'ఈ ఫోటో లేకపోతే మతీ క్రొనేసి వుందువు! నీ ముందు నేనెంత నా మార్పెంత? దీని చట్రం, మౌంటూ ఊడదీసి ఈ బొమ్మనిప్పుడు నీ వొంటిమీద ఎక్కడ పెట్టి చూచినా, అక్కడికక్కడ ఆరువేలరెట్లు, విపరీతంగా నీవు పెరిగివుంటావు అని తప్పకుండా పరిశోధన వేనోళ్ళచాటి సరియైన ఫలితం ఇస్తుంది' అన్నాడు. ఆదిత్యారావు అన్నదానికి మిస్ విశేషంగా జబాబు చెప్పకుండా 'అయితే అయివుంటుంది. నీవూ పెరిగి వుంటావు! నేనూ పెరిగివుంటాను! కాని ప్లీస్! (Please) ఆ ఫోటో ఆమేకుకి తిరిగి తగిలించివెయ్యి. You know my father! ప్రతీవస్తువూ దాని స్థలంలో వున్నపాళంగా చూడవలసిందేగాని

స్థలంలోనుంచి తీయకూడదు దాన్ని తాకకూడదు. అది ఆయన మతం ! మా తండ్రిగారి కఠినవ్రతం అంది.

అంతలో గబగబా వికసనమల్లిక మేడదిగుతూ 'Sorry ! మిస్టర్ ఆదిత్యారావు ! వెరీసారీ !' అని తన మణికట్టుకేసి చూచుకొంటున్నాడు ; ఆదిత్యారావు తన రిస్టువాచీలోకి చూచుకుంటూ 'ఇప్పుడు 7 అయినదండీ ! టైమేనా మీరు చూస్తూ వున్నది ?' మల్లిక్ 'టైమే ! నా గడియారంలో 7 న్నర అయిందే !' నైట్‌క్వీన్ కిటికీగుండా పడమటికి చూస్తూ 'సూర్యాస్తమానం ఇప్పుడు సరిగ్గా 7-45 కు అనుకుంటాను' ఆదిత్యారావు 'ఎనిమిదిక్కూడాను. కొత్తటైములో మన మున్నది !'

గోవిందమ్మ లోపట్నుంచి గబగబా నాలుగుకప్పులు నాలుగుసాసర్లు, నాలుగుచంచాలు ఓ ట్రేలోపెట్టి, వంటలక్కచేత పట్టించుకువచ్చి హాల్లో టీ పోయ్ మీద పెట్టిస్తూ—'మేం బయటకు వెళ్ళడమనేది సూర్యాస్తమానంతో ఎంతమాత్రం సంబంధించిందికాదు. ఒక్కొక్కప్పుడు ముందూ వెడుతూ వుంటాం ! ఒక్కొక్కప్పుడు కూడాను వెడుతూవుంటాం ; ఒక్కొక్కప్పుడు వెనకా వెడుతూవుంటాం !' మల్లిక్ "We better have tea first" గోవిందమ్మ ఆదిత్యారావుతో 'ముందు టీ తీసుకోండి !' అంది. ఆదిత్యారావు 'మీ దంపతులిద్దఱూ వెడతారా ? ఇప్పుడెక్కడికో ?' మల్లిక్ "Why only దంపతులు? మేం ముగ్గురం ! నేను నా ప్రియా, గోవిందమ్మ ! నా దుహితర్ నైట్‌క్వీన్ ! ముగ్గురుం వెళ్ళవలసివుంది వెడుతున్నాం' అనీ తన ముందటి కప్పు తన పెదాలదాకా ఎత్తుకుంటూ-ఊదున

చల్లార్చుకుంటూ తక్కిన ముగ్గురివంక చూస్తూవున్నాడు. నైట్ క్వీన్‌కూడా అంత పర్యంతం వచ్చి, కప్పులోని చిరుకెరటాల మీదుగా ఆదిత్యారావును బులిపిస్తూ 'ఆదిత్యారావు! నీవు చెడ్డ రోజు ఏరుకున్నావోయి నన్ను చూడ్డానికి ఈరోజున రావడంలో' ఆదిత్యారావు తన వక్షం ఎత్తుకు కప్పెత్తుకున్నవాడై, ఆగి, "Why చెడ్డరోజు? మీరు వెళ్ళేది టాకీకైతే నేనూ, నాటిక్కట్టు కొనుక్కొని ఆ ఆటకే రాకూడదూ? మీరు ఏదైనా మీటింగుకైతే నేనూ ఆ శ్రోత బృందంలో వోమూల కూర్చోకూడదూ నా క్వీన్ దగ్గఱ? మీరు వెళ్ళేది కేవలం షికారుకే అయితే నీవూ నేనూ మహా సోల్జర్ మహా సోల్జరిణీలాగ ఎందుకు పెరేడ్ చేసుకుంటూ కలిసిపోరాదు? "Why చెడ్డరోజు?" అంటూ, టీ, తీసుకున్నాడు. అందఱూ టీ త్రాగారు పరస్పర మహోపకారంగా!

వికసనమల్లిక్ 'నీవు చెప్పిన దేనికీ వెళ్ళడంలేదు మేమిప్పుడు—ఇప్పుడే టెలిఫోనులో ఓ ఫ్రెండ్ వైఫ్ పోయిందని కబురువచ్చింది. మేం ముగ్గురం ఆ క్రిమేషన్‌కు వెళ్ళవలసివుంది. వెరీసారీ ఆదిత్యారావు' అన్నాడు.

ఆదిత్యారావు నైట్‌క్వీన్ కళ్ళల్లోకి ప్రగాఢంగా చూచేడు ఉత్త కప్ టేబిల్‌మీద పెడుతూ, నైట్‌క్వీన్ ఆదిత్యారావును లేపుతూ, తాను లేస్తూ 'సెలవు! మన చిన్ననాటి ప్రేమ మఱచి పోవద్దు' అంది. ఆదిత్యారావు 'ఏదీ నీ చేయి?' అని ఆమె చేతిని ముద్దుపెట్టుకుంటూ "Good bye (గుడ్‌బై)" అన్నాడు. For ever (ఫర్ ఎవెర్) అని పాఠకు లనుకున్నా కథ అబద్ధం కాదు.

## బైనాకులర్

మొన్న నొక కథలో వ్రాసినప్పుడు డిసెల్‌కార్ బహూ తొడతొక్కిడి బండి అవి చెడతిట్టి పారేశాను. గాని అన్నప్పుడూ అలా వుండదు. అందులోనూ అది స్టార్టు అయ్యేచోట కొవ్వూర్లో గనక అందఱికంటె ముందు మనం ఎక్కి కూర్చున్నామా మనదే బండి అంతా——మఱీన్నీ తెల్లాఅగట్ల శీతకట్టున అయితే నిశ్శబ్దత ప్రశాంతతకూడా ఆ ఒంటిపాటుకు బాగా తోడ్పాటు అవుతాయి. కాళ్లకంటా శాలువ ముసుగెట్టుకుని పడుక్కున్నాను, నలుగురు కూర్చోవలసినబల్ల నే నొక్కణ్ణే ఆక్రమించి.

మఱి రాజమండ్రిస్టేషను దాకా ఱెప్ప విప్పలేదు. కాలు కదపలేదు.

అక్కడ కొన్ని ట్రంకులు! కొంత బెడ్డింగు! కుసింత కోలాహలం! ఇద్దరు ముద్దుగుమ్మలు ఎక్కారు బండిలోకి. ముద్దుగుమ్మలనడానికి నాకు అప్పటికి దొరికిన ఆధారం వారి కంఠధ్వని వొక్కటే అనుకోండి!

రాజాలు, రత్నాలు వాళ్ళిద్దరి పేళ్లూను. ఈ సంగతి తరువాత ఎవరినో అడిగి తెలుసుకున్న విషయం. అందు నా ఊహా ప్రబోధం ఏమీలేదు.

రాజాలంటుంది రత్నాల్తో 'కమ్ హియర్! థిస్ ఈస్ ఎ నైస్ కార్నర్' రత్నాలు 'ఓ! ది హోల్ ఈస్ వేకెన్‌ట్' లేచి కూర్చున్నాను. 'ఏదో కాస్త విద్యాగంధంవున్న వీరకన్యల్లా ఉన్నారు వీరెవరా?' అని ఆశ్చర్యపోతూ. వారున్నూ అలా

అలా (టంకులులాక్కుని బెడ్డింగులు మోసికొని ఏలాగైతేం నా వైపునకే, నేను గూర్చున్న కానులోకే నా బల్ల కెదురుగా నున్న బల్లమీదకే చేరుకున్నారు. చేరుకుని ఎవరిచీర కుచ్చెళ్లు వారి కాలివేళ్లు పూర్తిగా మూసేలా సవరించుకుంటూ స్థిమిత పడ్డారు. నా శాలువ నేనూ ఏదో జవాబుగా సర్దుకున్నాను.

రాజాలంటుంది రత్నాల్తో 'నిజంగా నిన్నను ఆ సమయాన్ని గనుక మనదగ్గఱ బైనాకులర్ ఉండి ఉంటే—' రత్నాలు 'గట్టుమీది పువ్వులు మగపువ్వులో ఆడపువ్వులో చెప్పేసి ఉందును' రాజాలు "నా 'సబ్జెక్టు' 'బోటనీ' కాదో!" రత్నాలు "ఏమిటి బి. ఎ. లోనీ 'సబ్జెక్టు'?" రాజాలు 'ఇక్నోమిక్సు' రత్నాలు 'ఐ. సి.'

(గాడ్యుయేటెడ్డు కన్యలు అని కూడా నేను నిర్ధారించుకున్నాను. నా శాలువ పూర్తిగా తీసివేసి నాలుగుమడతలుపెట్టి 'హోల్డు ఆల్' మీద పడేసి నా నిజస్వరూపం లోకానికి వెల్లడి బఱిచాను. లోకంఅంటే అప్పటిమట్టుకు ఆ యిరువురూ నేనూ కూర్చున్న ఆ రెండు బెంచీల పట్టూను. ఆడా మగా వివక్షత తప్ప మఱి 'డిస్టిక్షన్లు' గాని 'డైమెన్షన్లు' గాని లేవు ఆ లోకంలో.

నా 'సూట్' నా 'టై' నా 'కర్చీఫ్' నా సీటు నా తేటు అంతా తేరిపారి ఓ పర్యాయం చూస్తూ ఆ యిద్దరుకూడా ఒకరి ముఖాలు వొకరు చూచుకుంటూ నాలుగుకళ్ల చూపుల్ని నాలుగు దిక్కులకూ చెదరించి ముఖాలు చిట్లించుకున్నట్లు అభినయించారు.

నేను నా జేబులోని 'బైనాకులరు' తీసి దానిగుండా అలా 'సౌత్‌వెస్టు'కు చూస్తున్నాను. దిఙ్మండల(ప్రాంతం. సూర్యోదయాత్పూర్వపు శోభలు 'వెరీ బ్యూటిఫుల్'గా వెలిసి పోతున్నాయి. గాలి చలిచలిగా వీస్తూవుంది. అయినా కలువకులేని

చలి నా కేమిటని రైలురోడ్డుపక్కనవున్న పడియలలోని పువ్వుల వంకకూడా 'బైనాకులర్' తీసివేసి మధ్యమధ్య చూస్తూ వచ్చాను, కిటికీరెక్క యింకా యింకా ఎత్తివేస్తూ, అక్కడక్కడ పల్లెటూళ్ళయొక్క నాటితొలియులిపువింటూ 'డిసెల్' ఎంత వడిగా పోతూవుంది ! అని మెచ్చాను వాళ్లువినేలాగు :

ఇరువురిలో ఒకామె ఎవరో—ఇప్పుడు నేను పేరు చెప్పలేను—" ఆ 'బైనాకులరు' ఒక పర్యాయం ఇలా దయచేసి యిప్పిస్తారా ?" అని అడిగింది. బైనాకులరుమాత్రమే ఇస్తే చాలదు అని నేను బాగా గ్రహించి, ఆమెకు బైనాకులరుతోపాటు నా సీటుకూడా ఇచ్చి మరోబల్లమీద కూర్చున్నాను.

బైనాకులరుగుండా ఆమె చూడ్డం సాగిస్తూ "రత్నాలు 'వండర్ ఫుల్ వ్యూ' ! వీటిగుండా ! 'రియల్లీ' ! ఇది నిన్నను మనవద్ద వుండివుండవలసింది. మనం మన 'ఎక్స్ కర్షన్' 'ఎక్సలెంటు'గా 'ఎంజోయ్' చేసివుందుము" అంది. ఎవరో అంటా అగ్రాఅని ? రాజాలు ! జ్ఞాపకం వచ్చింది ఇప్పుడు ఆమె పేరు !"

రత్నాలు 'ఈవెన్ దెన్ ది ఫెలో కుడ్ నాట్ బి సీన్. అప్పుడైనా అతగాడు మనకు అదృశ్యుడే. అక్కడవుంటేగా ఆ చుట్టుపట్లగాని ఆ గట్టుమీదగాని ఆ చెట్లచాటునగాని అసలుం టేగా ? వెతికివెతికి వేసారి వెళ్ళిపోయినాము జ్ఞాపకం వుందో లేదో నీకు. అతడు మనలైనా తప్పిపోయివుండాలి మనం అతన్నయినా తప్పిపోయి వుండాలి' అంది. రాజాలు 'ఎ గుడ్ కన్వర్సేషనలిస్టు ! ఎ జోలీ ఫెలో ! ఎ లవర్ ఆఫ్ నేచర్ సెంటు పెర్ సేంటు హ్యూమన్ హార్టు.'

"ఎవరతడు ? ఏమిటి గొడవ ?" అని అడిగితే ఎటి కెట్ కు లోపమేమో అని ప్రశ్న ఆలా ఉగ్గబట్టుకూర్చున్నాను.

రాజాలు వెంటనే నా 'బైనాకులరు' తన ఎడంతొడమీద ఆలా వుంచుకుని, జారిపడిపోకుండా తన కుడిచేయి దానిమీద ఆంచిందై రత్నాలుతో అంటుంది. 'మనం నిన్న పయనించిన ప్రవాహం రసప్రవాహం! మన నావ ప్రదక్షిణచేసిన లంకలు భూలోకస్వర్గాలు. పైని మేఘాలు ఏలా అవకతవక ఆకారాలు దాల్చివున్నా అందం అని అనిపిస్తాయో, యీ గోదావరి లంక లున్నూ ఆలాగే వంకరటింకరవైనా సౌందర్యం ప్రకటిస్తాయి. ఇంకో విశేషమేమిటంటే మేఘాలమధ్య చంద్రుడు. మేఘాల్ని తప్పించుకు తిరుగలేడు. మేఘాల్లో దూరిపోతూవుంటాడు. కాని మననావ అలాకాదు. లంకల్ని తప్పించుకుని వాటిని చుట్టేసు కుని దానిదే మహాస్వతంత్రం అన్నట్టు నడిచింది.'

ఆలా రాజాలు లెక్చర్ దంచుతూవుంటే రత్నాలు "ఏదీ 'బైనాకులరు' అన్నట్టు తన కుడిచేత్తో రాజాలుయొక్క కుడిచేయి తప్పిస్తూ అడక్కుండానే అందుకుంది." రాజాలు 'అక్కణ్ణుంచి కాదు చూడ్డం. ఇక్కణ్ణుంచి చూడాలి' అంది. అంటూ వాళ్లిరు వురూ అన్యోన్యం సీటులు మార్చుకున్నారు.

రత్నాలు బైనాకులరుతో తన కలవడిన వేవో చూస్తూ 'సూర్యోదయం అవుతూవుంది చూడు! ఎంత గ్రాండుగావుందో!' అంది. నేను కొంచెం ముందుకు వంగాను.

రాజాలు 'ఆయనకూడా చూస్తారులాగుంది ఇచ్చేసెయ్యి! ఆయందేగా అసలు ఆ బైనాకులరు' అంది.

"అక్కర్లేదు. మీ దగ్గర్నే ఉంచుకోవచ్చును' అన్నాను, ఎందుకో ప్లీస్ అయి.

నిలువునాలేచి రెండోవెంపు కిటికీలోంచి తొంగిచూచాను. ఆదాకా 'సౌవెస్టు'న కనబడ్డ సూర్యబింబం. 'సౌతీస్టు'న కనబడ సాగింది. రైలుగట్టుకు పెద్దవంపు ఉంది కామోసు!

వెనకనుంచి 'థాంక్ యూ సర్! హియర్ ప్లీజ్, యువర్ బైనాకులర్' అని బైనాకులరు బల్లమీదపెట్టి ఆ యిరువురు వాళ్ళ ట్రంకులు బల్లలక్రిందినుంచి లాక్కుంటూవున్నారు.

నేను నా బైనాకులరు తిరిగి తీసికొంటూ అలా దాని గుండా డిస్టెన్సు ఎడ్జెస్టు చేసుకుంటూ వాళ్ళ తలకట్లు తిలకించాను.

రాజాలు రత్నాలు ఇద్దరూకూడా ఎవరికి వీలుగావున్న పక్కనుంచి వారి పక్కచూపులు నాప్రక్కకు విసిరారు.

"యు కెన్ హేవ్ దిస్ ఇఫ్ యు లైక్" అని బైనాకులర్ వెంటనే ఇద్దరకూ అందియ్యబోయి ఇద్దరి మధ్యనూ జారవిడిచాను.

దాని అద్దాలేమయినాయో పగిలిపోయాయో యేమో అన్న సంగతి విచారించకుండానే ఇద్దఋా ఏకకంఠంగా 'వెరీసారీ' అన్నారు. నేను 'నోమేటర్స్ లిటిల్! ఐ యాం గోయింగు టు వార్' అన్నాను. 'ఆన్ టు ది పోర్టు ఎ బోర్డు ది షిప్!' అని కూడా ఏడ్ చేశాను.

"బైనాకులర్" పడిపోయింది పైకెత్తి వారిద్దరూ "ఇఫ్ టు వార్! అన్ టు ది పోర్టు! ఎ బోర్డు ది షిప్! మీదగ్గరే వుండాలి ఇది" అన్నారు. అలాకాదు మీదగ్గరే వుంచాలి. అన్నాను.

నేను వోడెక్కాను. వాళ్లు వొడ్డునుంచి బైనాకులరుతో నన్నూ నావోడనూ చూస్తూ "వొ. కె." అన్నారు.

నేనే ఆ "ఎ గుడ్ కన్సర్వేషనలిస్టు! ఎ జోలీఫెలో! ఎ లవర్ ఆఫ్ నేచర్! సెంటు పెర్సెంటు హ్యూమన్‌హార్టు" నైపోయినట్టు ఉప్పొంగిపోయినాను. ఉదధి ఉబ్బెత్తునా ఉప్పొంగిపోయినాను.

# హెయిఃర్ లెన్గ్తు ఎస్కేప్

కథకు పేరు పూర్తిగా ఇంగ్లీషు భాషలోనే వచ్చేసింది. అలా రావడానికి కారణముంది. కథానాయకుడైన రంగమల్లుడు కథాకాలమైన నాటియుదయం 'హండ్రెడ్ హెయిర్ బ్రెడ్తు ఎస్కేప్స్' అనే ఇంగ్లీషు పుస్తకం చదివి వుండడమే దానిక్కారణం 'హండ్రెడ్' అంటే నూరు. 'హెయిర్ బ్రెడ్తు ఎస్కేప్స్' అంటే తెనుగులో సూటిగా చెప్పవలసివస్తే 'చూపు వాసి తప్పిపోవడాలు' అని అర్థంతీయ వచ్చుననుకొంటాను. ఇంకా నిబ్బరంగా వక్కాణిస్తే 'ప్రాణగొడ్డాలు తప్పిపోయిన నూరుఘట్టాలు' అన్నా అనవచ్చు. ఎంత భాషాంతరీకరించినా 'హెయిర్'కు 'హెయిరే' సమానం. 'బ్రెడ్తు'కు 'బ్రెడ్తే' సరియైన కొలమానం. 'ఎస్కేప్' అంటే 'ఎస్కే'పే !

మనకథలో 'బ్రెడ్తు'కు బదులు "లెన్గ్తు" పడింది. ఎంచేతాఅంటే ఆమెయొక్క తలవెంట్రుకలు మిక్కిలీ నిడివి కాబట్టి. తలవెంట్రుకలంటే "హెయిర్" "హెయిర్" అంటే "ఆయిఃర్"కు సంబంధించింది. హెచ్, ఇ, ఐ, అర్ కాదు. హెచ్, ఎ, ఐ, ఆర్ — తలవెంట్రుక—లేక, గుజ్జుగా, ముమ్మరంగా, ముచ్చటగా ముట్టుకుంటే కాటుకమూటగా ముట్టుకోకపోతే చీకటిముల్లెగా పెరిగిన తలవెంట్రుకలు అని బహువచనంలోకికూడా తర్జుమా చేయవచ్చును. లేదా సమూహవాచకంలో "తలకట్టు" అన్నా అనొచ్చు.

రంగముల్లుడు, రామామణీ ట్రామ్ యెక్కారు. రామామణికి పదహారు పదిహేనేళ్లుంటాయి. ఏళ్ళకుమించిన చాకచక్యం కాపరిచేపిల్ల. అతి చురుగ్గా ఎక్కిపోయింది ట్రామ్. ఆమె ఎక్కి ఎక్కడంలో ఇరుకు ట్రామ్, ఇస్టేమీటర్ గేజ్ బ్రాడ్‌గాజ్ అయినట్టు, విశాలవంతమై దారిచ్చి ఆమెకు కావలసినంత చోటెట్టింది రంగమల్లుడు, అతడికి ఇరవై ఇరవై వొక్కవత్సరం వయస్సు వుంటుంది, ఆమె వెనకాల ట్రామెక్కి బండిలోపలనడచి పోగలిగాడుగాని బల్లమీద తనకోచోటు సంపాదించుకోలేక పోయినాడు. పై యినుపవుంగరాన్ని పట్టుకుని వూగిపోవలసినవాడయ్యాడు. అప్పుడప్పుడు తూలిపోవలసిన వాడుకూడా అయ్యాడు తూలిపోయినప్పుడల్లా బొత్తిగా తాను ముఖమెఱుగని స్త్రీలోకానికి "క్షమించండి అమ్మా" అన్నట్టు నసుక్కున్నాడు. ఒకటి రెండు మార్లు రామామణిమీదనే వొరిగి పడిపోతూ "నీవు కాబట్టి సరిపోయింది" అని పరస్పరం నవ్వుకున్నారు.

సాయంకాలం ఆరుగంటలప్పుడు మదరానులో ఏ ట్రాం క్రిక్కిరిసివుండదు? అందులో "ఇటునుంచి పోక" "అటునుంచి రాక" అనే వివక్షతలేదు. అవాయిగొట్టానికి రెండువేంపులా ధట్టింపుగలిగినట్టు ఉత్తరగుమ్మంనుంచీ ఎక్కడమే! దక్షిణగుమ్మం నుంచీ ఎక్కడమే! ఎక్కేవాళ్లు ఎక్కుతుండా దిగేవాళ్లు దిగుతూ వుండడమే. సినీమాగూడులుకడ "క్యూ" పద్ధతిని నిలబెట్టివేస్తేనో ఇంతమందినీ అని అనిపించింది వోపద్యాయం రంగమల్లునికి. అనిపించి తాడులాగి డ్రైవర్ చెవిలోకి గంటచప్పుడు గావించాడు. డ్రైవర్ ట్రామ్ఆపుతూ వెనక్కు తిరిగిచూచాడు.

రంగమల్లుడు ముందుకు సాగాడు. రంగమల్లునికంటె ముందంజగా రామామణి లేచి ముందు నడుస్తూంది.

వారు ట్రాము దిగవలసినటైమూ అయింది వీధి వచ్చింది అయితే దిగేవంకను ఎన్నెన్ని ఇనుపకమ్మీలు వున్నాయో అన్నీ ఇనుపకమ్మీలూ పట్టుకుని అంతమంది సోల్జర్లు నిలబడివున్నారు. రామామణినిచూస్తూ ఆ సోల్జర్లు అతి పొలైట్‌గా త్రోవయిచ్చారు గాని వారుమాత్రం ఇనుపకమ్మీల పట్టు వదల్లేదు.

రామామణి అదివఱకు సోల్జర్లనుగురించి వినడమే గాని చూచిందిలేదు అందులోనూ వాళ్ల సోల్జర్లయితే అంత పొలైటుగా వుంటారా అని వో పెద్దసమస్య. ఆ సందడిలో ఆమెదెందంలో కందళింపసాగిందో ఏమో ట్రామ్‌యొక్క "పాదమ్మోపుచెక్క" అదే "ఫుట్‌బోర్డు" దానిమాట మఱచిపోయింది. ఏకఅంజగా రోడ్డుమీదకు వురికింది.

ఇంకా ఆమె వురక్కుండానే ట్రామ్ బర్‌మంది. ట్రాము బర్‌మనడంలో రంగమల్లుడు "ఆమె రోడ్డుమీద బోర్లా పడి పోయినట్టు పడిపోవడంలో తలకట్టు ట్రాము చక్రాల్లో ఇరుక్కు-పోయినట్టు ఇరుక్కుపోవడంలో, చుట్టుకుపోయినట్టు చుట్టుకు పోవడంలో, విద్యుత్ ఆమె తలకెక్కినట్టు ఆమెతల కెక్కడంలో, తానామె తలకట్టు తెగబారెడు తలకట్టుగదించి పట్టుకున్నాడేమో - తనకు షాక్ కొట్టినట్టు ఇట్లా హెడ్‌రీల్ చేసుకున్నాడు.

అయితే ట్రామ్ సురక్షితంగా నిష్క్రమించింది. ఆమె కూడా సురక్షితంగా నిట్టనిలువునే నిలబడివుంది, ఆవిష్కరణం గన్న "స్టాచ్యూ" లా!

"At what a hair length escape my ceiling love!" అన్నాడు రంగమల్లుడు. "Thank God" అన్నాడు కూడాను.

రామామణి " Did you touch my hair " అంది. తనజుత్తు ముట్టుకున్నాడేమో రంగమల్లుడు అని ఆమె భయం. రంగమల్లుడు—" ముట్టుకోలేదు. పట్టుకున్నాను. ముందు పడిపోతావేమోనని పట్టుకున్నాను " అన్నాడు.

రామా : " పట్టుకుని వదిలేశావా ? "

రంగ : " లేదు అదే ఎస్కేప్ అయిపోయింది "

రామా : " అదే ఎస్కేపేమిటి ? "

రంగ : " అపాయం దానంతట అదే సర్దుకుపోయింది."

రామా : " నా జుత్తు చాలాపొడుగు. కనిపెట్టావో లేదో గాని "

రంగ : " వెరీ ! ఇటూ మన మలుపు. Yours is today a hair length escape " అన్నాడు. రామామణి మలుపు తిరిగినా ఆమెజుట్టు ట్రాముర్రోడ్డుకింకా కనిపిస్తూనేవుంది !

# కాంపులో షాంపూయింగు

కథ కల్పించి వ్రాదామనే కూర్చుం టాను. కాని, ఒక్కొక్కప్పుడు ఆ కల్పనకు పూర్వజన్మ వాసనగా నిజం కళ్ళకు కట్టినట్లు మును ముందు తాండవిస్తూ అదే కథగా తోస్తుంది. అటువంటి అనుభవం ఒకటి ఈ నాడు పాఠకులకు పరిచయం గావింపబోతూ వున్నాను- ఎవళ్ళుగాని, వారు తెల్లవారైనా నల్లవారైనా తమమీద బెట్టుకోబోకండి !

నే నెక్కిన రైలుపెట్టెలో పూర్వం ఎప్పుడూ తెల్లదొరలు గాని, తెల్లదొరసానులుగాని కనిపించేవారుకారు. అసలు వాళ్ళు ఈనాటి రెండవ తరగతి-అనగా వెనుకటి ఇంటర్ బండి ఎక్కే-వాళ్లేకారు. వాళ్లు ఆలా ఆ రోజుల్లో అసలైన మొదటి తరగతి బోగీలో ప్రయాణం చేస్తూవున్నా, "డిన్నర్ కారు"లో మెఱిసి పొయ్యే ఫోర్కులతో తింటూవున్నా, "మనకు వీళ్లు అందుబాటు లోకి ఎన్నటికీ రాబోరు ; మనం మనమే, వీళ్ళు వీళ్ళే-తూర్పు తూర్పే-పడమర పడమరే-" అని ఎవరో వ్రాసినట్టు అనుకునే వాణ్ణి. పూర్వం అంటే బి. సి. లో అని అనుకునేరు గనుక; కాదు—"Quit India" సంఘటనకు క్రితం అంటే మూడేళ్ళ వెనుకటివఱకూ అన్నమాట.

మరి ఈ దరిమిలాను దొరలంటే కబురూ లేదు, కాకర కాయా లేదు. వాళ్ళు కనిపించడమే మానేసేసారు. "భారత్"లో లేనేలేరేమో కూడాను వారు అనే సంశయంలో పడేటంత అరుదై పోయారు. ఏదైనా లేని సరుకును కాంక్షించ బుద్ధి, చక్కదన

మంతా వారితోనే పోయినట్టు, సౌరు అంతా వారితోనే సమసి పోయినట్టు, సిరి, సంపత్తు, చేవ, తేవ సమస్తం వారితోనే హరించిపోయినట్టు అనిపించింది ఒకనాడీమధ్య రైలు ఎక్కుతూంటే.

సెకెండ్ క్లాసు పెట్టెలో కూర్చొని అలా పైకి చూచాను. "అప్పర్ బెర్తు" మీద ఆ "సైన్ డౌన్" లో ఏణాక్షి ఒక దొరసాని కానవచ్చింది. ఇంద్రధనుసు రంగుల పట్టురుమాలొకటి తలకు టోపీలా పిన్నులుపెట్టి లోపల పుల్లలమీద నిలిపి చుట్ట బెట్టుకుంది. పొట్టిగౌను మీగాళ్ళదాకా మాత్రమే వచ్చేది తొడిగింది. డోరియాలది. బోడిస్ బోడిస్‌మీద జాకెట్టు ఏదాకా దిసగా వుంటే బాగుంటుందో ఆదాకా తొడుక్కున్నదై ఆ బాహుమూల హస్తాంగుళీ పర్యంతం నున్నందనమే చూపసాగింది. మడమలెత్తు జోళ్లు విడువనిదై మేజోళ్లు ఒంటినంటుకుపోయి రంగు రంగు ఒకటా అన్నట్టు గోచరింపచేస్తూవుంటే వదలినదై కను పాపల్లో నీలాకాశం, చెక్కిళ్ళమీద సంధ్యారాగం కాపవుస్తూ అపర అప్సరస గుళికలా గోచరించింది.

వెంటనే స్ఫురణకు వచ్చింది, పశ్చిమార్ధగోళం వెళ్లిన యువకు డొకడు " The lassie I loved here is wonderful " అని తన ప్రియురాలినిగురించి వ్రాసిన ముక్క. ఏదో రహస్యమని ఇంగ్లీషులో వ్రాశాడతగాడు. తెనుగున చెబితే ఏమీలేదు అందులో " నేను ఇక్కడ ప్రేమించిన పిల్ల అపురూపపు పిల్ల " అని దాని అర్థము. తాను ప్రేమించిన పిల్ల అపురూపంగా వుండకపోతే ఏలా వుంటుందనో అతగాని అభిప్రాయం! అత డెఱుగడేమో " తా వలచినది రంభ, తా మునిగినది గంగ " అన్న సామెత.

వారి గొడవ మన కెందుకుగాని ఇక్కడ ఏ ప్రేమా నాలో రేకెత్తించకుండానే ఈమె బహూ అందంగా, సుందరంగా గోచరించింది. ఈమె ఇలా వున్నప్పుడు ఈమెను ఎదురుకాళ్ళ దన్నేవాళ్లు ఎల్లా వుండివుండాలో అనే వూహ ఆ ఘడియప్పుడు పట్టపగ్గాల్లేకుండా ప్రసారం గాదొడగింది సర్వసాధారణంగా.

ఇదంతా ఇంద్రియ నిగ్రహ నిబద్ధమైన అతి వాస్తవికత! ఇక కల్పనలోకి పోదాం! అదీ ఒకరు "నిజంగా జరిగింది సుమండీ!" అని చెప్పిన యదార్థపు సంగతే కాని నా నోట తిరిగి పలకడంలో కలపన అయి ఈ దిగువ రూపంలో నిలిచి పోయింది :

"మనవాళ్ళకు, అంటే భారతీయులకు నీతి, జాతి నేర్పింది తెల్ల దొరలనుకొండి పంతులుగారూ! అసలు మనకంటె భయంకరస్వరూపులైన నీగ్రోలకు నీతి, జాతి నేర్పింది వీరే! కాని మనల్ని చూచి వాళ్ళే పాడయిపోయినారో, వాళ్ళనుచూచి మనమే పాడయిపోయినామో, ఇప్పుడు లోకం అంతా ఒక్క రకంగావుంది. మానహీనంగా, దీనంగా, న్యూనంగా, దిసదిస నగ్నంగా! "న్యూడ్ ప్రమాణంగా! వాళ్లూ మోకాళ్ళమీదకు లాగులే. మనవాళ్లూ మోకాళ్ళమీదకు లాగులే! వాళ్ళ ఆడవాళ్ళూ వొళ్ళంతా ఎదర చూపుకు వదిలేసేవాళ్ళే, మన ఆడవాళ్ళూ వొళ్ళంతా ఎదర చూపుకు వదిలేసేవారే! ఇదేం పాపమో! ఈ బహిరంగపుచ్చుట తమకు భంగపాటనీ తలపోయరు; మగాడిలో పౌరుషం అమ్మట్టునే జారిపోతుందనీ ఎంచరు— గమిలో గుమ్ వుండేదిగాని పంతులుగారూ గయాళిలో ఏముండ గలదండీ!

"కాని తెనుగువారి మగతనం. మర్యాదా అక్కడేవుంది. భారతీయు లందరిలోనూ మన తెనుగు జోదుల్లాంటి జోదుల్లేరన్న కొండి! నే చెప్పే దిప్పటి మాటకాదు ఎప్పటి మాటోను; ఎక్కడి మాటోను! బోయర్ యుద్ధంనాటి మాట; ఆఫ్రికా ఖండంలో సంగతి.

అంతంత పాములు ఆలా సర్పాలు ఎత్తిపెట్టుకొని చెట్లను వేలాడి పడగనెత్తి వంపులు, వంకరలు పోతూవుంటే, వాటి నీడను బోరలను పయటలు లేక, రయికలు లేక ఉంగరాలు తిరిగిన తమ జుత్తు నెగరేసుకుంటూ నీగ్రో పడుచులు, పిండని పాలిండ్లతో కనుబండువు గావిస్తూ వుండేవారట! వారిని చూస్తూ తెల్ల సోల్జర్లు, ఇంగ్లండునుంచి వచ్చినవాళ్ళు మోహపడిపోయి ముచ్చెమట్లు గార్చేసేవారట. అది తెలిసి ఇక్కడి ప్రభుత్వం వారు తెనుగు సిపాయీలను, తెలగాలను తిన్నగా తుపాకీల సమేతంగా పంపించేరట. పంపించి "చూడండి! మీరు చిత్త చాంచల్యం లేనివారు. మా వారి బుద్ధి నీగ్రో పడుచులుని చూచి మారిపోతూవుంది. మరీ జారిపడిపోతూవుంది. ఆ స్త్రీల నేలా పయటవేసికునేలా, రయిక తొడుక్కునేలా "చేస్తారో!" అని, "ఫైర్!" అని కమాండరు తెల్ల సేనాపతి పుత్తర్వు ఇచ్చాట్ట! వీళ్ళు అనగా తెనుగువారు ఆ యువతుల బోరలకు గుళ్లు బారెట్టి ఒకళ్ళిద్దర్ని పడగొట్టేరో వాళ్లు అర్థంచేసుకుని వెంటవెంటనే చేతులే చనుగప్పులుగా నప్పించుకొని క్రమంగా అవి తీసేసు కుని, ఆకులు నేసుకుని, తుదకు కోకలూ, కూర్పాసాలు దాల్ప సాగారుట! అటువంటి నిర్మోహమాటం, నిర్మోహం గలవాళ్ళు ఆనాటి మన తెనుగువీరులు.

"క్రమంగా కత్తి విడిచిపెట్టి కలంపట్టినవాళ్లు కొందరు, డాలువిడిచి పెట్టి డవాలు వేసుకొన్నవాళ్లు కొందరు అయిపోయారు ఆంధ్రులు. తుద కీనాడో ఆంధ్రుడంటే అరవవానికీ లోకువే! ఆడదానికీ లోకువే!"—

"అయితే వొకటుంది పంతులుగారూ! ఆంధ్రునికి కళయందున్న అభిమానం, కాంతియందున్న ఆమోదం మరెవరికీ లేదు. వాడు డఫేదారే కానియ్యండి. సిరస్తాదారుగానే పనిచేయనియ్యండి. అందువల్లనే మనవాళ్ళు అంటే తెల్లదొరలకు ప్రీతిమెండు. అందం అంటే పడిచచ్చిపోతారు మనవాళ్లు. రసాస్వాదనమంటే ఉవ్విళ్లూరి పోతారు వీళ్లు. ఇంతెందుకు చెబ్తూవున్నానంటే. మా తండ్రిగారి నోట నేను విన్నానుగనుక ఈ సంగతి—ఏ సంగతి అని అడగబోతారేమో—అదే మనవిచేస్తూ వున్నాను."

"మా తండ్రిగారికి కలెక్టరేటులో కాంపు క్లర్కు వుద్యోగం. మఱి కలెక్టరుగారు కాంపుకు వెళ్ళరా, కూడా వుండవలసినదే ఈయనా, డఫేదారు ఇద్దరూ కూడా. ఆ రోజుల్లో కలెక్టర్లంటే గవర్నర్లనుకూడా చెలాయించే వారుట. సీమదొరను తప్పించి మఱొకర్ని ఆ పోస్టుకు నియమించేవారు కారట! కలెక్టరుగారి భార్య ఎప్పుడన్నా కాంపునకు భర్తతో బయలు దేరటంకూడా ఉండేదట. దేశంకాని దేశం ఉద్యోగ హోదాలో చూడాలని ప్రతివారికీ వుంటుంది. చూడండి!—ఆ కలెక్టరుగారి భార్య అసమాన రూపసియట! మా నాయనగారే చెప్పారంటే ఆమె ఎంత అందకత్తెయో ఆలోచించండి పంతులుగారూ!— అయితే మా నాయనగారు ఎప్పుడూ ఆమెను గౌనులోనే చూచియున్నారట. గౌను లేనప్పుడు ఎంత సొగసుగా వుండేదో

ఊహించండి పంతులుగారూ ! అది కనుక్కోగలవారి అదృష్టము ఎంతటిదంటారు పంతులుగారూ !

ఒకానొక కమాను సందర్భంలో ఆమె "బాటసారుల బంగాళా" స్నానాల గదిలో స్నానంచేసి మెఱపులా మఱో గదిలోకి నడచి వెళ్లిందట.

దిస మొలమీద బొడ్డు అనే బొడ్డన బావి, దాని కెగువనే వళులనే ఎక్క నిచ్చెన, వళులమీదనే వక్షోజ యుగళి అనే మిఱ్ఱుమిఱ్ఱునే కొఱ్ఱులు నా బొలుచు చూచుకాగ్రాలు, తక్కిన భాగాల కీలుకీలునా చెక్క, టక్క టిక్క, తెల్లని మెడ, తిన్నని మూపు, నున్నని వీపు, అన్నువకౌను, బటువుం బటక్కలు, లటక్కన పట్టేసే డాన్సింగ్ నును పిక్కలు ఇన్నింటినీ కప్పి కాపాడే బంగారువన్నె శిరోజాలు, శిరోజాలి విసరున వీచే "ఉడ్ కొలోన్". షాంపూయింగు సువాసన, సువాసనమ్మతే ఎగిరి తన్ను తగిలేనా అనుపించు దేవతావస్త్రపు మేలిముసుగు ఆచ్ఛాదన—ఇవన్నీ దఫేదార్ను మైకంలో ముంచి పారేశాయట. ఒక్క త్రుటిలో వాడనుకొన్నాట్ట "ఆ పాళంగా ఆమెను కౌగలించుకొంటేనో" అని అనుకొన్న మఱుక్షణంలోనే వాడికి జ్వరంతగిలి శరీరం రగిలి, చలి మిగిలి, వణికి వళంతప్పి దొరగారిని సెలవడిగి వాడు తన యిల్లు చేరుకున్నాట్ట.

దొరసాని తన్నావేళ దఫేదారు చూచి మోహించి వున్నాడని తెలుసుకున్నదేగాని, వాడికి జ్వరం తగిలిందని సెలవుపెట్టి ఇంటికి చక్కా పోయాడని ఎఱుగదు.

"మఱి ఆ సెలవు సెలవు మెడికల్ లీవుగా పదిరోజులు పొడిగించినవాడు ఆ దఫేదారు. ఒకనాడు దఫేదారును గురించి

భర్తను కమానునుంచి తిరిగివచ్చాక అడగడంలో డఫేదారుకు జ్వరం తగిలిందని, కమాను వూరులోనే తగిలిందని విన్నది. ఎవరు ? దొరసానమ్మగారు.

"విన్న తక్షణం ఆ జ్వరం ఎందుచేత వానికి వచ్చినదో భర్తకు తెలియజెప్పింది, తెలియజెప్ప తాను స్వయంగా వెళ్ళి రోగిని చూచివస్తానంది. దొరలున్నారే వారు మనవాళ్ళకుమల్లే భార్యల్ని అనుమానించరు; ఆజ్ఞాపించరు. వారి ఔదార్యం ప్రజలపట్ల ఎట్లా వుండగలదో, దారపుత్రాదులపట్ల కూడా అంతే! తానుకూడా "రానా!" అని అనలేదు,—"సరే వెళ్ళిరా!" అన్నాడు అంతే! ఆమె తిన్నగా కాంపు క్లర్కును, అంటే మా నాన్నగారిని తీసుకని ఆ డఫేదారు ఇల్లు కనుక్కొని ఇంట్లో ఎవరున్నారని అడిగింది.

"ఒక ముసలి వృద్ధు ఎవరుతల్లీ! తమరు ?" అని అడుగుతూ ఒక చిన్న గుడిసెలోంచి యివతలకు వచ్చాడు. మా నాయనగారు ఆమె కనుసంజ్ఞకే అంతదూరాన్ని చెట్టుక్రింద నిలిచిపోయినాడు. వింటున్నారా! పంతులుగారూ ?

"నీవేనా యీ యింటిలోనుండేవాడవు ?" అని అడిగింది దొరసానమ్మ.

"నేనూ, నా కొడుకూను. వాని కింకా పెళ్ళికాలేదు. జ్వరంవచ్చి పడిపోయినాడు. అదుగో ఆ నులక కుక్కిమీద" అని చూపించాడు. ఆమె నా వృద్ధుడు ఎవరో మందివ్వడానికో, మతం బోధించడానికో, లేక రెండూ గావించడానికో వచ్చిన మిషన్ మిస్సమ్మ అని ఊహించేడు. ఆమె డఫేదారు మంచం దరిసి "డఫేదార్" అని పిలిచింది. అతడు కళ్ళుతెరచి చూచాడు, "తల్లీ నమస్కారము" అన్నాడు.

ఆమె "నీ జ్వరానికి కారణం నాకు తెలుసునులే—నీకు నన్ను కావులించుకోవాలనివుంటే కావులించుకో.— అయితే నీ జీతం?" అని అడిగింది. ముసలి వృద్ధుకు కొంత అర్థమై, కొంత అర్థంకాక "తల్లీ! నెల కేడురూపాయ లన్నాడు. ఆ రోజుల్లో ఏడురూపాయలంటే నేటి డెబ్బై రూపాయలన్న మాట." మఱి నా భర్తకు నెలకు రెండువేల రూపాయల జీతం. ఇతడికి ఏడురూపాయల జీతం. ఏడురూపాయలతో నాకు కావలసిన గౌనులు, షోకులు, షికారులు అన్నీ నెరవేర్చగలడా? ఇతడు నన్ను మోహించి యీ జ్వరం తగలించుకున్నాడు అంది.

డఫేదార్ "తల్లీ! బుద్ధి గడ్డితింది. "క్షమించండి!" అని అన్నాట్ట.

ఆమె క్షమించడానికి నీవు చేసిన తప్పేముంది కనుక: ఏది చేయి జ్వరం లేనట్టుందే? అని అభినయంతోపాటు అడిగిందట. "తల్లీ! ఇప్పుడే తగ్గిపోయింది" అన్నాట్ట డఫేదార్. కాంపు క్లర్కును పిలచి దొరసానమ్మ "వీనికి రేపు పెళ్ళి కావాలి" అని చెప్పిందట. కాంపు క్లర్కు "చిత్తం" అని మర్నాడు అతి వైభవంగా ఒక చక్కని చుక్కను ఆ డఫేదారుకు కట్టబెట్టినారట. నూతనదంపతుల్ని దొరసానమ్మగారూ, దొరగారూకూడా దీవించేరట.

"ఏంచేసినా ఆ దొరలే చేయాలి. ఆ దొరసానులే చేయాలి. అయితే ఇప్పుడు వాళ్ళలోను నీతి, జాతి వమ్మయిపోయింది పంతులుగారూ! మనవాళ్ళూ నిర్వీర్యులై పోయారు పంతులుగారూ!" అని పెదవి విరిచాడు కథకుడు.

# సెమిటరి అవతల - సిమెంట్ మేడ

—— గీ తి క ——

" కానీ లేదు - కడవ లేదు
గోనీ లేదు - గొంగళి లేదు
కాపరమెక్కడ - కాంతా అంటే
సెమిటరి అవతల సెమింట్ మేడ—
బోణీ లేదు - బోణం లేదు
దాణా లేదు - దవుడు లేదు
గాజు లెక్కడికి - బలిజీ అంటే
సెమిటరి అవతల సెమింట్ మేడ—
దొరువు లేదు - చెరువు లేదు
మోవు లేదు - పూవు లేదు
తూగేందుకు వోయి తోటీ అంటే
సెమిటరి అవతల సెమింట్ మేడ. "

అందరి గొంతుల్నుంచీ " సెమిటరి అవతల సెమింట్ మేడ " అనే జవాబుతప్ప మతోజవాబు లేనేలేదు. " సెమిటరి " అన్నది నేను ఎఱుగుదును. చాలా కాలంనుంచి దాని గోడలు, దాని గుమ్మాలు, దానిలోనుంచి పైకి తలచూపే " టూంబు " ల మీది " క్రాసు " లు నా కవగాహనే. చనిపోయిన " జాతిదొరల " శరీరాల్ని భూస్థాపనచేసిన స్థల మది. ఆ స్థలానికంతకూ ఇంగ్లీషులో " సెమిటరీ " అంటారు. పాతులకు " టూంబు " లంటారు. పాతులమీది మతచిహ్నాలకు "క్రాసు" లంటారు. ఆ "సెమిటరీ" అవతల ఏమున్నదీ నే నీవరలో విచారించింది లేదు. కాని సెమిటరీకూడా పట్నంలో వోభాగమే అని గుర్తిం

చాను. బ్రదికివున్న మెదుకుల రాయళ్ల విషయమై యెట్టి జాగ్రత్త తీసుకొని వారియెడల ఎట్టి సామరస్యభావం తాను వహిస్తూ వుంటుందో అంతకంటె వేయిరెట్లెక్కుడు సామరస్యము పురపాలసంఘ మా సిమిటరీవంక చూపిస్తూ వచ్చినట్టు నేను గతంలో తెలిసికొని యున్నాను. మఱి సెమిటరీ అవతల? గోడే వుందో గొందేవుందో ప్రాణేవుందో ప్రతిమేవుందో గుడిసే వుందో గృహమేవుందో ఎవరికెరుక? ఎరిగివున్నా ఎవరికి అటు వైపు దృష్టిపరుగు!

వరుసగా ఒక్క గ్రుక్క నొక్కనాటి ఉదయమందు పై విధంగా ముగ్గొంతుదేటి "సెమిటరి అవతల సిమెంటుమేడ" అన్న జవాబు ముఖరితం కావడంతోనే నాలో ఒకరకమైన ఆశ్చర్యం రెచ్చింది. "ఈ పట్నంలో—నేనింతకాలం తిరుగుతూ వచ్చిన ఈ పురవరంలో సెమిటరీకి అవతల "సెమెంట్ మేడా? ఎప్పుడు నిర్మింపబడింది? ఎవరిచేత నిర్మింపబడింది? ఎవరిది అది? ఈలా ఇప్పుడు జవాబు చెబుతూ వెళ్ళిన కాంతదేనా ఆ మేడ? ఆ కాంత తొడిగించుకోదలచిన గాజులేవా ఆ బలిజీ తన బక్కతేజీమీద వేసుకు వెడుతూ వున్నది? తోటీ ఆ మేడ తుడిచేవాడా? ఆ మేడ కడిగేవాడా? లేక దాని కధినాధుడేవాడా? చాలా ఆశ్చర్యంగా వుందే!" అని అనుకొంటూ ఆ ఉదయం ఆదాకా అసలు నేను ఆ పట్నంలో కనుగొన్న పంథానంతనూ సింహావలోకనంగా తిలకింపం బ్రారంభించాను.

"నిరాశా" పట్నంలోకి "ఆశా" మహారాజులుంగారు రావడం ఆ యుదయమే మహోముహూర్తానికన్న సువార్త జ్ఞప్తికి వచ్చింది. ఆశా మహారాజులుంగారు అవతరించేది "శాంతి దేవళం" లో నుంచి అన్నట్టు తెల్లనిరథం వంతెనమీద

కనబడిందికూడాను. మఱచిపోయాను. ఆ రథం ఆగే తావు ఎత్తు ప్రదేశంగాను, సమప్రదేశంగాను ఆ క్రితంసాయంకాలమే కావింపబడింది. మఱిన్నీ ఆ తావున ఓ ఎఱ్ఱనిగుడ్డ మహారాజులుం గారి నడకకోసరంగాను పఱచబడివుంది. ఆ ఎఱ్ఱనిగుడ్డ పఱవబడ్డ నడవ ఏలా వున్నదీ అంటే శాత్రవరుధిరంతో దోమల నెత్తురు కలిపి గచ్చుచేసినట్టుంది. నిద్రాభంగం గావడాని కేమాత్రం వీలులేదు. "జయం! ఆశామహారాజులుంగారికి జయం!" అన్న మహాధ్యానం అక్కణ్ణుంచే బయల్దేఱాలి లాగుంది. ఆలా అగుపించింది ఆ వాతావరణమంతా పరికిస్తే, తరువాతను మార్గమంతా ఊరేగింపుటుత్సవానికిగాను అతి నును పుగా అతివినూతనపు మరమ్మతు గలదిగా చేయబడినది. నగరములోని కుళ్లునీరు శరత్కాలంలో నదీతోయం తేటదేఱి నట్టు తేలుదేఱిందేమో అన్నంత తెలుపై మెఱసిపోయింది. పైపైని ముగ్గుచల్లి ఆరోగ్యశాఖవారు మంత్రించడంతోనే, ఆనీటి చాలునే కల్హార కలికాలు పొడిచినా యేమో అన్నంత సూటిగా పోలీసుల ఎఱ్ఱటోపీలు అడుగడుక్కీ కనబడ సాగినాయి.

దారి కెడ్డెం లేదు తెడ్డెంలేదు. ఎక్కడ చూచినా పూల దండలు పట్టుకు నిలబడ్డవారే. "దయచేయండి! స్వాగతం" అని వేకువజామునుంచీ వేచియున్నవారే. ఆశామహారాజులుం గారు రావడం తడవుగా కరతాళధ్వనులు గావించాలట; ఆబాల గోపాలం దారి కిటూ అటూ బారులుదీఱి—ఇళ్లు పచ్చని తోరణా లతో ప్రభలు చిమ్ముతూ వుండాలిట! పైపులంట పన్నీరు ప్రస రించాలట! ఇవీ అధికారు లిచ్చిన సలహాలు సంజ్ఞలు, కనుసన్నలూను.

"పోలి" అనే పుట్టుమాదిగది అందఱితోటిపాటూ తాను ఆ పట్టం పట్టు నంటిపెట్టుకు వీడకుండా వుండే మనిషేను— ఆ క్రితం సంజపొద్దుదాకా యెప్పటిమల్లేనే సంచరించింది. కాని పోలీసువారి హడావిడి చూచి, మోటారు బండ్లల్లోని కొత్తరకం మొఖమల్ బాలీసులు చూచి. ఏదో విడ్డూరం జరగనైయుంది ఎక్కడినోనని విస్తుచూపులు వెఱ్ఱిచూపులు వెదజల్లసాగింది. తన వృత్తి తాను మఱచిపోయింది. తన వేషం తాను ఏమరిల్లింది. తా నదివఱకు ఎరిగివుండిన్ని పలకరించని ఒకానొక శ్రేష్ఠిని చేరి "సెట్టిగారూ : ఏంటండి ? రేపు మనపట్నంలో ?" అని అడిగింది.

సెట్టి "ఏముంది ! ఏభైమంది ఏభైదబ్బు లేసుకుంటే రూపాయకు మూడణాలన్నర తక్కువ—నీదాకా రారులే ఆశా మహారాజులుంగారు. అయినా నీ యిల్లెక్కడ సొప్పు ! నీమీద కూడా ఓ డబ్బుడుద్దేమో వాటావేసి చూస్తాను" అన్నాడు.

పోలి "ఎప్పుడూ సెట్టిగారివూసు లిలాగ్గానే వుంటాయి. వాటాలు, కాటాలు, లాభాలు—రాజ్యాలు ; నా యిల్లెరగరా మీరు? ఎక్కడని అడుగుతారు ? సెమిటరి అవతల సిన్న తాటాకు గుడిసె." అంది.

"ఆసి ! నువ్వే ! సెప్పు లమ్ముకునే సిన్నాదానివా ? ఆలా సొప్పు ! యింటిచూరు సెమిటరీ గోడకు సరాసరి లైనులో వుందా ? ముందుకు తొంగిచూస్తూ వుందా ? చెప్పు !" అన్నాడు సెట్టి. పోలి "కుసింత తొంగేచూస్తుంది చూపువాసి" అంది. "ఇకనేం ! చూరంచునే రాజవీధికి కనబడే లా. "సెమెంటు మేడ" అని బల్లకట్టు. ఆకుచూరు అగపడనియ్యకు. మేడే

కనబడవియ్యి. ఆ వెనకాల కొత్తగాజులు వేసుకొని కులుకుతూ కూర్చో. సరిగ్గా రేపుపొద్దున్న పదిగంటలు కాకుండానే ఆశా మహారాజులుంగారు నిన్ను ఆనవాలు పట్టితీరతారు" అన్నాడు.
"నన్ను ఆనవాలు పట్టి నా ఆకలి తీరుస్తారా?" అంది పోలి.
"నీ ఆకలి! నా ఆకలి! అంత ప్రపంచంయొక్క అంత ఆకలి! తీర్చడానికే వారు రావడం! అందాకా నీవూ నేనూ బ్రదికి వుండాలి! అయినా సెమిటరి అవతల వున్నావు నీవు! నీ దాకా వస్తారోరారో! భద్రగజం హౌదామీదనుంచైనా చూడరూ? చూస్తారు!" అని హెచ్చరించాడు సెట్టి.

సెట్టిగారితో పైసంభాషణ అయిన కాణ్ణుంచీ పోలికి విపరీతంగా మతిపోయింది. మతిపోయిన కొద్దీ కొత్తనమ్మకం వొకటి ఆమె మనస్సులో బయలుదేరింది. "గుడిసె కనిపిస్తే రారుగాని, మేడకనిపిస్తే వస్తారు. తప్పకుండా వస్తారు" అంటూ కార్యరూపం ప్రజ్వరిల్లేలా రస్తాను కట్టబడ్డ తోరణాక్షరాల వంపు సొంపులు తిలకించసాగింది. అప్రయత్నంగా తనతోకూడా ఓ గాజుల బలిజీని గొంపోతూ రెండుచేతుల్ని నిండుగా కన్నుల పండువుగా గాజులు వేయించుకొని, సొంతచూరు కనిపించకుండా ఓ బల్ల అడ్డంపెట్టి బల్లమీద "సెమింట్ మేడ" గీసి తన చేతులు ఎక్కడ పెట్టేది ఎందాకా చూపెట్టేది యోజించసాగింది. తోటీ ఆమె వెనకాతలే వున్నాడు రస్తా తుడిచితుడిచి రెక్కలు ముక్కలై, ఎక్కడ విశ్రాంతి? ఎక్కడ విశ్రాంతి? అని అనుకొంటూ, పోలి పాడేపదమే పఠించుకొంటూ. ఏమి పదమది?

"సెమిటరి అవతల సిమెంట్ మేడ"

* * * * *

రక్షకభటులు సెమిటరీగోడ చివర వరకు ఆ క్రితం సాయంకాలమే ఆనపెట్టి కట్టుదిట్టం గావించియున్నారు. "కర తాళధ్వనులు గావించండి! చిరునవ్వు నవ్వండి! సింగారాలు చూపించండి!" అని. కాని పోలిని ప్రోత్సహించవలసిన జరుగురు కానలేకపోయినారు. ఆమెయొక్క చూరుఅంచు ఏదాకా వ్యాపించిందీ గమనించలేకపోయినారు. అంచేతే సమయానకు తానేం చేయాలో తెలియలేదు పోలికి. ఆలా "సెమెంటుమేడ"గా గీసికొనివున్న తన బోర్డుబల్లమీద గాజులచేతులు ఆన్చుకొని గమనించసాగింది.

ఏనాటి చనిపోయినవారి శరీరాలున్నూ జీవకళదాల్చి పైకి తెక్కల్తోలేచి గోడలుదూకి కేరింతాలు కొడుతూవున్నట్టు కనిపించింది, తొలుదొల్త ఆశామహారాజులుంగారి రాక ఆమె తలుచుకోవడంలో, మలిచూపులో తన శరీరం అస్థిపంజరం అయిపోవడం వినిపించింది. గాజులు ఎముకల గూడున మోగిపోతూ ధ్వనించాయి.

తోటీ తనచేతిలోని చీపురు జారవిడిచి "చేతులతో తప్పెట తట్టు! ఆశామహారాజులు వారేలాగున్నారు! చేతులతో తప్పెటతట్టు!" అని తన చేతులతో తప్పెట తట్టుకుంటూ పోలి ఏంచేస్తూవుందో అని ఆ వంకకు చూచాడు. పోలిముఖం పెద్ద లొడుగు కపాలంగా కనిపించింది. ఆ కపాలఫాలంమీద "సెమిటరి అవతల సిమెంట్ మేడ" అని వ్రాసివుంది.

తోటీకి తోచలేదు ఆ అక్షరాలు తక్షణం తుడిచివెయ్యాలో కడిగివెయ్యాలో, రక్షకభటులకు తరుణోపాయం తట్టలేదు, ఆ బోర్డుబల్ల తగలెయ్యాలో పగలెయ్యాలో సలహా చెప్పిన సెట్టిగారికే పాలుపోలేదు. పోలి? మఱి ఏలా సంస్కరించాలో—

## పరువు సెడి కరువున పడింది

ఆమె వోర్ఠి పశుప్రియ, పక్షిప్రియ-
మనిషిని తన దరిమానానికి రానివ్వ
దని అనుకోవలసిందే—ఆమెకు నలుగాళ్ళంటే అంత అభిమానం.
ఒక్క నలుగాళ్ళన్న మాటేం? మనిషిని తప్పించగా మిగిలే
ఇతరం అంతా ఆమె బాబాకరానికి ఆకరం అనే మనం ప్రతి
పాదించుకోవచ్చు. ఆమెను చూస్తుమా నిఖార్సైన స్త్రీ రత్నం;
అప్రయత్నంగా ఆమె దేహయష్టిలోని రూప తాండవం
పైకుండుండి యుబుకుతూంటే పరిసర ప్రపంచం జిగాల్మనక
తప్పదు. మఱి పలికిందా అంటే కిన్నెర. పాడితే ఎవరో?

బాటనే నడచిపోతూవుంటే ఆమె హెచ్చు ఆర్థిక స్వాతంత్ర్యం
గల యువతిలా కనిపిస్తుంది. మాంచి అభిరుచి కలదానిలా
తోచేస్తుంది. మొల్లో తాళావు గుత్తి దోపుకొని ఓచేత్తో డబ్బుల
గోతాం ఊపుకొంటూ ఉబుసాడే కాడ చటక్కున ఆ ఊపే ఊపే
గోతాం రెండో అరచేతిలో ఘల్లుమనేటట్టు మోపుకొంటూ రంయి
రంయి గుడిసెకు చేరుకుంటూంటే ఆమె వొయ్యారం చెప్ప
శక్యంగాదు. చీర ఏలా మొలతిరిగి, మెడసురిగి, సిగనొరగి
ముమ్మెలికలుపడీ, ముయ్యేరు మేలిముసుగ్గా సంజపొద్దుకు
తయారు అవుతుందో ఎవ్వరికీ ఆ వొడుపు అలవడింది లేదు
ఆ పేటలో——

కుడిప్రక్క తన చెవిని జుంకా మూతతో దోబూచు
లాడిస్తూ, ఎడంప్రక్క ఎదర చెవికి వదిలేసినట్టు పైటజార్చి
గుండె యులివు మాత్రంగా కాలమూర్తిని కదలించే నెఱజాణ.

కార్తీక నక్షత్రాలకు శివుడి గుడికి వెళ్ళేటప్పుడైనా పెంపుడు కుక్కపిల్ల ఆమెకూడా వుండాలి. కూడు తినేటప్పుడు పిల్లి తనతో పాటు కంచుగిన్నె అంచు నాకుతూ వుండాలి. పెండాన్ని పంజరంలో చిలక, ఎడపిల్లలా తొక్కుపలుకులాడు తూండాలి, ఇలారం మీద గినికోళ్లు రెండు పురిట్లో కవలల్లే అరుస్తూవుండాలి. వసారారాట నోమర్కట కిశోరం.........! ఇలాగ్గా ఆమె అస్త పెద్ద జంతుప్రదర్శన భవనంలా కనిపిస్తుంది.

ఇంతెందుకు ? ఆమెయింట ఆ నరపాణంను చుట్టి మఱి నరపాణం లేదు. ఉన్నదంతా జంతుకోటి ! ఆ జంతుకోటిన్నీ అసంఖ్యాకం ! అంత పెద్ద ఝుంజాటం వుండిన్నీ యింకా చాల్దన్నట్లెందుకో యాతన పడుతుంది ఆపె. కాపడ్డ వాళ్ళతో "పెద్ద పుల్ని పెంచితే ఏలావుండెనో, ఎలుగ్గొడ్డును చేరదీస్తే ఏం చేస్తుందో ? సివంగు లంటారు వాటితో మనం స్నేహంగావుంటే అవి మనల్ని ద్రోహం చేయవు గదా !" అని అడివి జంతువుల మీదిక్కూడా, తన మనస్సు పోనిచ్చుకుంటూ—ఉన్నది పట్నవాసం అయినా అడవిని గురించి యోజిస్తూవుంటుంది ప్రతినిత్యమూనూ.

ఇరుగు పొరుగు వాళ్ళందఱూ మనుష్యులు. మనుష్యులే కాకుండా వాళ్ళకు మనుష్యులంటే ఎక్కడలేని మక్కువ ఎక్కడలేని తగులాటమూను. వాళ్ళకు జంతువంటే కిట్టదు. అంచేత వాళ్ళంతా, పైని పేరొక్కబడ్డ మనుష్యాంగనామణిని యిష్టంగానే చూచేవారు. కాని ఆమెపెంచే జంతువుల్ని రాయి పుచ్చుకునో కఱ్ఱపుచ్చుకునో కొడుతూ వచ్చేవారు. కొందఱు కొట్టడందాకా అసహ్యించుకోకపోయినా తిడుతూనైనా వుండేవారు. మొత్తం

మీద ఇరుగు పొరుగు వాళ్ళందఱికీ, ఆమె మనుష్యులయందుకాక జంతువులయందు విశేషప్రేమ చూపిస్తుందని........చెప్పొద్దూ- విశేష మాత్సర్యం వహించారు. అడివి జంతువుల మాట ఆమె ఎత్తినప్పుడల్లా "పోయి, అడివిలోనే వుండరాదా? మా మధ్యను వుండి అడివో అడివో అని ఏడువక పోతేనని కజ్జాకు కాలు దువ్వేవారు కూడాను వొక్కొక్కప్పుడు. ఆమె ఆ పాళంగా జుత్తు విరబోసికొని ఎదిరి వాళ్ళతో ప్రతికక్ష వహించక తప్పేది కాదు. ఆ సమయాన్ని ఆమె కుక్కలు వాళ్ళమీదకు బొంయి బొంయిమని పడి పిక్కలెక్కలాగబోయేవి. ఆమె కోతి వాళ్ళను చూడగానే కొఱకొఱ లాడేది. ఆమె చెప్పన్న జంతువులు శివ మెత్తి నట్టూగిపోయేవి. వెంటనే ముల్లోకాల నోళ్ళు కట్టడి ఆమెకి లొంగి పోవలసిందే. మఱి అటువంటప్పుడు ఆమె స్వాధీనంలో కనుక శరభశార్దూలాలు, కరిమకరాలు, తేళ్ళు నాగుబాములూ ఉన్నట్టయితే మనంఅంతా ఏమైపోయి ఉందుమో కదా యీ పాటికి—ఆలోచించుకోండి పాఠకులు!

ఒకానొక రోజున చక్కటి సాయంతనం సాంధ్యరాగం భోగయోగ్యంగా పొడము కొచ్చింది పైకి పడమటి దెస. కత పడుచు తనయింటి పంచ నొంటిగా కూర్చుని ఆకాశాన్ని అలముకు పొయ్యే చిత్రాతి చిత్ర సంకీర్ణపాటల వర్ణాన్ని తిలకిస్తూ వుంది, పెద్దపులి చారల్ని చూస్తూవున్న మాదిరిగా. ఆ పొద్దు పెద్దపులి నోరు కూడా ఆకాశాన్ని తెరవబడి వున్నా దన్నా స్వభావపు టుత్తే. ఏమా అంటే ఒక నల్లనిమేఘం దట్టంగా పైకిలేచి దవడలు విప్పి కోరలేర్పడి నాలుకచాచినట్లు పాయవడి గీతలడి మఱి చెదరి పోకుండా నిల్చి వూరుకుంది.

" పెద్దపులి పెద్దపులి ఆకాశాన్ని పెద్దపులి ! " అని వెఱ్ఱిగా కేకేసింది అమ్మత్తకాసిని.

ఆ కేకకు ఎవళ్లూ ఇతరులు ఆమెను చేరుకోలేదుగాని, వీరనాగన్న అనే ఒకానొక వేసాలరాయడు, మనుష్యజాతిలో పురుషుడు " ఏమిటి నీకేం మతిపోతూవుందా ఏమిటి? కొఱ్ఱమ్మా ? " అన్నాడు. ఆతగాడు పేరెట్టి పిలచేదాకా ఆమె పేరు లోకానికి ఆకలింపే లేదు. కొఱ్ఱమ్మ వెంటనే ఊరుకోక వేలెట్టి ఆకాశంకేసి చూపిస్తూ " సూడు ! సూడు ! ఏలా వుందో ఆకాశాన్ని దాన్నేమి టంటావు ? " అని అడిగింది. అప్పటి కప్పుడే రంగుమాఱి ఆకాశం కారునలుపు ముసుగులో పడింది. " అదే దేవుని విలాసం.

సంధ్యా వీధుల శార్దూలాలు
వెన్నెల బయళ్ళ వెల్లాంబోతులు
ఇరుల తొఱ్ఱట్లను ఎలుగుం గొడ్లు ! "

అన్నాడు జవాబుగా. అనగానే కొఱ్ఱమ్మ కొప్పుసవరించుకొంటూ అడవిలోనే కాకుండా పులి మెకాలు ఆకాశాన్ని కూడా వాల్లాడి పోతూ వుంటాయా ? " అని అడిగింది. వీరనాగన్న "ఓసివెఱ్ఱి కొఱ్ఱమ్మా ! ఓసి వెఱ్ఱికొఱ్ఱమ్మ ! " అని అనుకొంటూ కొఱ్ఱమ్మకు మరి బదులాడకుండా తన మానాన్ని ఏదో యోజన గావించు కుంటూ వెళ్ళిపోయినాడు.

ఆలా వెళ్ళిపోయినాగాని వీరనాగన్న పాడినపాట కొఱ్ఱమ్మకు నల్లమందులా పట్టించింది. సారాలా కైపెక్కించింది.

సంధ్యా వీధుల శార్దూలాలు
వెన్నెల బయళ్ళ వెల్లాంబోతులు
ఇరుల తొఱ్ఱట్లను ఎలుగుం గొడ్లు

అంటూ పాడుకుంటూ ఆకాశంకేసి చూసేది.

అలా చూస్తూ వచ్చిన కొట్టమ్మను నోసాయంకాలం మఱికొన్నాళ్లకు వీరనాగన్న ఏం చేశాడూ అంటే—తానా పొద్దు మొహరం పెద్దపులి వేషం వేసుకొని, డప్పు లేకుండా తప్పెట లేకుండా, గొలుసు లేకుండా గొడవ లేకుండా, వెనకాతలే వెళ్ళి కొట్టమ్మను అమాంతంగా పిరుదులపై నూర్ధ్వం కావులించు కున్నాడు. కొట్టమ్మ వెంటనే సరిదిరిగి తోసిపుచ్చి, ఫెడీల్ని ఒక్క చపేట యిచ్చుకుంది వీరనాగన్నను. వీరనాగన్న "మని షిని, మనిషిని, నేను మనిషిని, పెద్దపులిని కాను కొట్టమ్మా! నీవు పెద్దపులి పెద్దపులి అని కలవరిస్తున్నావు కదా అని ఆవేషం వేసుకువచ్చాను" అన్నాడు. కొట్టమ్మ "మనిషి అంటే?"— వీరనాగన్న అప్రయత్నంగా అన్నాడు, పెద్దపులివేషం వేసిన వానికి అంతకంటె మనిషి అంటే అర్థం మాత్రం ఎట్లాకాగలదు? "మనిషి అంటే అదీవో జంతువే!" అని.

ఎప్పుడైతే వీరనాగన్న నోటమ్మట "మనిషి అంటే అదీ వోజంతువే" నన్న నిర్వచనం వినబడ్డాదో అదో భ్రాంతిగా క్రొరమ్మ వానిముఖంకేసి చూచింది. వీరనాగన్న చెంపతుడుచు కొంటూ "జంతువుని కొట్టినట్టు కొట్టేసినావు! కొరమ్మా!" అన్నాడు. కొరమ్మ వాని వంక రెండోసారి తేరిపారి చూచింది. ఎందుకో నిర్విణ్ణురాలైంది. తన మొల్లోనుంచి వో రూపాయతీసి వానికిచ్చింది. వీరనాగన్న మిక్కిలి సంతోషిస్తూ వెళ్ళిపోయినాడు.

"మనిషి! పెద్దపులి వేషంవేస్తాడు? మనిషి అంబోతులా అంకె వేస్తాడు? మనిషి! ఎలుగ్గొడ్డులా పట్టుకు అక్కేస్తాడు? మనిషీ వాసన వేస్తాడు? మనిషీ మైకం గొల్పుతాడు!" అని లోలో తన ఊహా ప్రపంచంలో తన మనిషిని చిత్రించుకుంటూ

కొర్రమ్మ తనయొక్క యిరుకు కుటీరంలోకి తలకు చూరు తగలకుండా వొంగొంగి ప్రవేసించింది.

కొర్రమ్మ కుటీరంలో నాటిరాత్రి, ఓ రెండోజామున ఉపద్రవంగా చీకటి కమ్మివుంది, కొర్రమ్మ తన దీపం ఎంత హెచ్చించినా ఆ చీకట్ని. అందులోనూ వొకానొక మూల నక్కి యున్న దాన్ని సంహరించ లేకుండా వుంది. గుడిసె వెలుపల గొప్పగా వెన్నెల కాస్తూవుంది. గుడిసెలో గుహ తమస్సు, చిమ్మచీకటి, ఆ మూలను మఱీ అంత అనుకోని అంధకార మేమా అని అల్లాటపడ దొడగింది.

ఆ అల్లాటలో నిజంగా మఱి ఆలోచన తోచక కొర్రమ్మ తన కొంపకి తెలతెల వారుజామునే నిప్పంటించుకొంది. ఆ నిప్పు మంట చూరుకెక్కి చూరు వెదుళ్ళను పెటిల్లు పెటిల్లు మని పేలించేదాకా చుట్టుపట్ల వాళ్ళెవళ్ళూ మేల్కోలేదు. మేలుకొన్న తరువాతను కూడా వాళ్లదేదో దిజ్మండలం మీది నెల తక్కువ సూర్యోదయంగా చూచి విస్తుపోయినారే గాని ఆరిపెయ్యడానికి ప్రయత్నించిన వారు గారు. కొర్రమ్మ దృష్టి యీపత్తూ తనను లొంగని గుయ్యారం మీదనే వుంది. ఆలా ఆవంత చూస్తూనే వుంది. ఆలా ఆమె చూస్తూ వుండగానే అసలు తెల్లాఅడం జరిగింది. జగత్తు కంతకూ తెలివి వచ్చింది, చూచింది కొర్రమ్మ బూడిదలో నెలుక్కోసాగింది. ఏం కనిపించిందామెకు ? ఎలు గ్గొడ్డుచర్మం మండి పోయిందొకటిన్నీ ఆ చర్మం క్రింద నుసి అయిపోయిన వీరనాగన్న బొంది వొకటిన్నీ ఆ రెండూ కొర్రమ్మ ముందు నాడు వెలిసిన కొత్త వస్తువులుగా కనిపించాయి.

తన్నిమేషం కొర్రమ్మ ఆ వీరనాగన్నయొక్క అంత్య ప్రమేయం ఇలా తలపోయసాగింది, " నేను వీరనాగన్నను అని చెప్పి దివ్యజ్యోతిగా నాకు సాయపడి నా మనస్సు దోచుకు పోవడానికి రాక, పెద్ద ఎలుగ్గొడ్డు వేషం వేసుకుర్రావడం ఎందుకు ? కటిక చీకట్లో నా గుడిసెలో దొంగచాటుగా తాను ప్రవేశించి ? ధనమాసించి కాకపోతేను ? నన్ను చంపడానికి తానుచావడానికి కాకపోతేను ? లోక మిప్పుడేమంటుంది నన్ను ? జంతువును చంపాను అంటుందా ? జంతువు క్రింది మనిషిని చంపానంటుందా ? మనిషిని చంపాను అంటుందా ? మనిషి మీది జంతువును చంపానంటుందా ? దేన్ని ప్రేమించాను అంటుంది ? మనిషినా ? మృగాన్నా ?

సంధ్యా వీధుల శార్దూలాలు !
వెన్నెల బయళ్ళ వెల్లాంబోతులు :
ఇరులతొరట్లనుయెలుగుం గొడ్లు !"

అని తలపోసికొంటూ........పరువుసెడి కరువున బడింది.



## ఇ తి క ల

పుస్తకాల్లో శ్లోకానికీ వ్యాఖ్యానాలకూ
సరిహద్దు నల్లనిగీత సూచించినట్టు,
పల్లెటూరి జీవనాన్ని పట్నవాసపు జీవనాన్ని సర్వసాధారణంగా కేటాయించి కాపరచేది స్థానికపరిపాలనవారి యెల్లబల్ల. ఇక్కడకు "మ్యునిసిపల్ లిమిట్" అనుకుంటూ ఒక అడుగుపాటి రోడ్డు ప్రక్కకు చూడ్డంలో కాంతారావుకు ఏకాంతశర్మకు ఇద్దఱకూ కూడా ఎవో పువ్వులు లక్షోపలక్షలుగా పూసివున్న ఒక ఎకరం బంగన బయలు సాక్షాత్కరించింది. కాంతారావు ఏకాంతశర్మ ఇద్దఱూ షికారుగా బయలుదేఱిన నవనాగరీకులు, పరోపకార పరాయణులు, ప్రకృతి పరిశీలనా మహాశయులు, సంఘ సంస్కార ప్రియులూను.

పువ్వులెలా పూసివున్నాయి అంటే, పరుపుకు టాకాలు వేసే సమయంలో పైకి లాగేటప్పటి దారాల పొడుగుల్లా కాడలు లేచి ప్రతీకాడ చివర్నా మఱీ పసుపచ్చకానట్టి మఱీ తెలుపులేనట్టి లేలేత వెన్నెతో, మఱీ చిన్నకాని మఱీ పెద్దాకాని పరిమాణాన్ని ఆకారాన్ని పొడగడుతూ వున్నాయి. పువ్వులకాడల దిగుదల్ని నక్షత్రచామంతి ఆకులా ఆకువుంది. ఆ ఆకునుబట్టీ ఇంకా తిల కిస్తే అదో నేల బారుతీగ. తీగకూ తీగకూ మధ్య మామోలు గరిక—ఎవరో రైతు తన దూడలకొఱకుగాను పెరగనిస్తూ కాపాడుకుంటూవున్న గులకరా ప్రదేశం! ఏదీ మెయ్యడం లేదు. ఎవరూ త్రొక్కి పారేసిన జాడాలేదు. కాంతారావు ఏకాంతశర్మ ఆ ప్రదేశంలోని కడుగిడ్డానికి కొంకిజంకి ఆలా గట్టుమీదనే

ఆసీనులై "ఆహాహా! ఏమి సొగసుగా నున్నాయి పువ్వులు!" అని అనుకోసాగారు.

అంతలో ఏమూలనుంచి వచ్చిందో ఓ మదవతి మాలెత, చేతిలో వడపలెట్టుకువచ్చి, వచ్చీ రావడంలో పరపరాకోయడం ప్రారంభించింది. కించిత్తూ సంకోచంలేకుండా గడ్డినీ కాడనూ కలిపికోయడం ప్రారంభించింది.

కాంతారావు "ఎవరివనే ఆలా కోసి వేస్తూవున్నావు ఆ పువ్వుల ?" అన్నాడు. మాలెత వంకచూస్తూ. "పువ్వు లేంటుండి ఇవి? కాడ! ఇదంతా గడ్డి. నాదేనుండి." అంది ధైర్యంగా. ఏకాంతశర్మ "నీ తలకాయి." అన్నాడు. "తల కాయ అవితే కొడవలితో సరుక్కుంటూ పోతారా? తలమీదకే నుండి—తలమీదకూ కాదండి—గేదలకండి." అంది మాలెత, కాంతారావు "దాంతో పరాసికాలేంటి మనకు" అంటూనే దాని అసంస్కృతపు శిరోజాలనుగంటూ జాలిగొన్నాడు. ఏకాంతశర్మ దాని పామరత్వానికి విస్తుపోయాడు.

ఆమె క్షణికంలో పది పంద్రెండు సందెళ్ళ గడ్డీకాడా కోసికొని మోపుగా జూనుకుని నెత్తిమీదను మోసికొంటూ పట్నం వెంపుకు బయలుదేఱింది.—"మఱి చీకటి పడిపోయేన్ని" —అనుకుంటూ లేచినట్టుగా కాంతారావు ఏకాంతశర్మ తాము కూర్చున్నచోటినుంచి లేచినవారై ఆమె వెనకాతలే పట్నం వెంపుకే వెడుతూవున్నారు.

వాళ్ళదృష్టి ఆ మాలెత నెత్తిమీదవున్న మోపుమీదనూ మోపులోని పూలమీదనే ఉంది.—ఆ పువ్వుపేరు తెలిసికొందా మని వాళ్ళకుతూహలం. అడిగితే వాళ్ళయొక్క అజ్ఞానం బయలు

పడిపోతుందేమో ? అడక్కపోతే అది చెప్పనే చెప్పదు. దాని కదో పువ్వు అన్న గోప్యమేలేదు. పువ్వునుకూడా గడ్డితోనూ కాడతోనూ కలిపి కోసి పారేసిందాయిరి. మఱిదానికో పేరూ కీర్తీవుందని వెల్లడిపరుస్తుందా ?—అడిగితే ఏమో ?—అది గబ గబా నడస్తూవుంది. దానితో సరిసమానంగా వీళ్లు నడవలేకుండా ఉన్నారు.—ఆగుమని కేకేస్తే బాగోదు.

ఎదర ఎవడో వస్తూవున్నట్టయింది. మాలెత దాని నడక దూకుడు కొంచెం తగ్గిస్తూ కాంతారావుకూ ఏకాంతశర్మకూ దగ్గఱలో ఆగింది. ఏకాంతశర్మ "అమ్మీ ! ఆ పూలపేరేమిటి?" అన్నాడు. మాలెత........................

"ఇఱికల పువ్వంటే తమ రెరుగర బాబయ్య ! "— అంది వెనక్కి తిరిగిచూస్తూ. ఆ యెదరనుంచి వచ్చేవాడు ఒక్క హుడాయిన ఎగిరి కఱ్ఱతో తన చేతిలోని.—

"ఇఱికల పువ్వంటేనా ? "

"సిరిసిరి మువ్వకు సెల్లాయి తెలిసిందా పిల్లా "— అంటూ మాలెతయొక్క నెత్తిమీది మోపు మెటకరించి నేలమీద పడేటట్టు చేశాడు.

"చూశారా. ఈడి దురంతం బాబయ్యలూ. చూశారా. ఈడి దురంతం. నోటికాడ కూడు ఏలా పడగొట్టేస్తూ ఉన్నాడో చూడండి బాబయ్యలూ." అంది మాలెత. కాంతారావు ఏకాంత శర్మ ఆవల వానికేసి చూచారు. "నీకేం పొయ్యేకాలం వచ్చిందిరా. ఆలా క్రిందికి తోసేశావు దాని నెత్తిమీది మోపును" అని అడిగాడుకూడాను కాంతారావు కుసింత ఉగ్రుడై. ఆవలి వానికి భయమా ? "నాది ఈ పొలం. నాదీ ఆనేల, అక్కడ

నన్ను కాపెట్టినారు మా ఖామందులు చూస్తాయుండుమని—గేదెల కోసంగాను. నిలబెట్టుకుంటూన్న కాడ, పూలుపూసింది లగాయతు, ఒకటే తెగ్గోసుకుపోవడం, తెలీకుండా దిగబడి తెగ్గోసుకుపోవడం, "నాను తిన్నాను." అని మాఖామందులు నన్నుకొట్టడం. ఈయేల దొరికింది—తమరెనకెంపు ఉండబట్టి దొరికింది లేక పోతే పరుగు లంకించుకుంది అంటే నెత్తిని మోపు "నిమిట్"కు మైలెగరేసుకుపోతుంది—దాని కాళ్ళకున్న పొడుగు కొంగకన్నా ఉండబోదు అయ్యలూ." అన్నాడు. కాంతారావు ఏకాంతశర్మ దాని కాళ్ళవంక చూచారు. నిజంగా ఆ కాళ్లు అల్లాంటివే—" ఆవలివాడు "వేళ్ళతో కొడవలుచ్చుకు కోసిందా అంటే బాబయ్యలూ! అవి వ్రేళ్లో మరకీళ్లో అన్న వడి కాపరుస్తాయి. ఎప్పుడన్నా చూచారో లేదో"—కాంతారావు ఏకాంతశర్మ "చూచాం ఇప్పుడే అక్కడ చూచాం అన్నట్టు తలలుతిప్పి కళ్లు విప్పారు. మాలెత "బాబులు సాక్షులు! నానుకోసింది రోడ్డువార గులకరాల మధ్యదికాని మీ దొరగారి పంపులోది కాదురా. ఈ పొద్దట్టుకు పోనీయి. ఎందుకు నన్నిబ్బంది పెడతావు." అంది. కాంతారావు ఏకాంతశర్మకూడా అమ్మితే ఏమొస్తుందే ఈ మోపుకి" అని అడిగారు దాని బుద్ధి దొంగబుద్ధీ అనకుండా దొరబుద్ధీ అనకుండా. "అమ్మితే పావులా అండి. అమ్మకపోతే ఆంబోతుకేనండీ" అంది. ఆవలవాడు "ఊఁ—ఆఁబోతుకి? రోజూ నీ మోపుతినే పట్నంలోని పెదాంబోతు బలిసిపోతూవుంది ఆలా—నీ మోపుతినే?" అంటూ దాన్ని ఆ మోపు పట్టుకుని వెళ్ళనిచ్చాడుకాడు. ఆ మాలెత అల్లా ఆ మోపుమీద చతికిలబడి, వాడు ఆ మోపును కదలిద్దామన్నప్పుడల్లా, "కుయ్యో మొయ్యో" మనసాగింది.

కాంతారావు ఏకాంతశర్మ ఇద్దఱూ ఏదో కూడబలుక్కుని ఒక పావలాకాసు అక్కడపెట్టి మీ యిద్దరిలో ఎవరో ఒకరు ఆ పావలా తీసికొని రెండోవారు ఆ మోపు పట్టుకుపోండి అని సూచించారు. మాలెత "పావలాకోసం మోపుకోసం మీరు సరిది చెప్పారా, ఈపైని కొడవలి వాడిదంటాడు" కాంతారావు "ఏదీ కొడవ లెక్కడుంది?" అన్నాడు. ఆవలవాడు "ఆ మోపులోనే గ్రుచ్చి గ్రుచ్చి ఉంచి ఉంటుంది." ఏకాంతశర్మ "పువ్వుల్లో కొడవలి? కొడవలి? కోయడమే కాకుండా ఇంకా ఆ కోయబడ్డ పువ్వుల్లోనే కొడవలి ఉంచడం?" 'ఎంత ఘోరం. ఎంత ఘోరం.' అన్నాడు. కాంతారావు "లే. మోపులో కొడవలుంటే, మోపు మీద చతికిలబడి తైతక్క లాడుతున్నావు. గ్రుచ్చుకోదుటే" అన్నాడు. ఏకాంతశర్మ పువ్వుల్ని చూస్తూ కరిగిపోయేడు. కాంతారావు మాలెతను చూస్తూ కరుణగొన్నాడు.

మాలెత "ఏదిరా? కొడవలేదిరా? నాదీలేదు. ఆడిదీ లేదండీ బాబులు కొడవలేలేదు. నే కోసింది గటికమ్మతోనండి" అంది. ఆవలివాడు బాబులూ! మీరు మీమానాన్ని వెళ్ళండి. మా తిప్పలు మేం పడతాం. కొడవలీ యివల పడుతుంది. గొడ వేదో అదీ బయలుపడుతుంది" అన్నాడు.

వాడు దాన్ని అక్కడ హత్యగావిస్తాడో ఏమో అన్నంత అనుకంప, కంపరం, పొందుతూ కాంతారావు ఏకాంతశర్మ, ఆ తగువులాడుతూవున్న వాళ్ళ యిద్దఱి చేతుల్లోనూ చెరో అర్ధా పెట్టి—"ఫోండి. ఎవరిళ్లకు వాళ్లు పోండి" అని పంపేశారు. పంపేస్తూ ఆ గడ్డిమోపును పరీక్షింప సాగారు.

మాలెత అర్ధరూపాయ చేతపట్టుకునే వూరికే వెనుచూపులు రోడ్డుమీద గడ్డిమోపుకేసి చూస్తూపోయింది. పాలేరువాడు అర్ధ రూపాయ చేతిలోపట్టుకునే వూరికే ప్రక్కచూపులు పొలంకేసి చూసుకుంటూ పోయాడు.

కాంతారావు ఏకాంతశర్మ ఆ గడ్డిమోపును పట్నంలోకి మోసుకుపోతే ఏ ఆంబోతైనా తింటుందని ఆలా ఒకళ్ళ తరువాత ఒకళ్లు నెత్తినెట్టుకుంటూ.

" ఇటికల పువ్వంటే తమ రెరుగర బాబయ్యా. "

" సిరిసిరి మువ్వకు సెల్లాయి తెలిసెన ఓ పిల్లా " అని పదం ఆడుకుంటూ సాగిపోయారు.

కనబడ్డ మాలెతలల్లా తమ కెందుకండి ఆ బారం అని అడగడమే—కలుసుకున్న పాలేరువాడల్లా " మీరు కోసిందేనా ఇదంతా ? " ప్రశ్నించడమే. ఆంబోతు మేతగ్గాను ఆ మోపు వారిచే గొంపోబడుతూ వుందని గుర్తించిన పౌరుడొక్కడులేడు, పాంథు డొక్కడులేడు.

# వైస్రాయ్ స్పెషల్

అంతకు మూడునాలుగు రోజుల్నుంచి జరుగుతున్నాయి. వైస్రాయిగారి బండి కలకత్తానుంచి మదరాసుమీదుగా మైసూరు సురక్షితంగా పోయే టందుకుగాను ఏర్పాట్లు. పెట్రోమాక్సు లైట్లు, వేసేచోట్ల పెట్రో మాక్సు లైట్లు కాగడాలు వెలిగించవలసిన చోట్ల కాగడాలు వెలి గించి, నమ్మకమైన పోలీసుల్ని దారి పొడుగుతా నిలబెట్టి బహా బందోబస్తు గావించారు. ఇన్ని గంటలకు బయలుదేరుతుంది ఈ స్టేషన్‌కు ఇన్ని గంటలకు వస్తుంది వైస్రాయి స్పెషల్ అని బి. ఎన్. ఆర్; ఎమ్. ఎస్. ఎమ్. ఆర్. లైనంతా చెప్పుకోవడమే.

నేనేమిటో దాన్ని గురించి అంత విడ్డూరంగా ఆలోచించ లేదు. ఇంతకూ వార్తా పత్రికల్లో డిపార్చర్ ప్రైవేట్ అని ఉండడంబట్టి ఏదో ఏదో త్రోవను తాను ఎవ్వరికిన్నీ ఎటువంటి ఇబ్బందీ కలగజేయకుండా రెండోకంటి వానికి కనబడకుండా వెళ్ళిపోతాడు కమోసు మనకేంపని వానితోనని అసలు ఆవూసే మఱచిపోయి యదాలాపంగా మామూలుగా రైలుకు వచ్చినట్లు వాల్తేరు ప్యాసెంజరు నెం. 10 బండీమీద రాజమండ్రి పోదామని వచ్చాను స్టేషన్కు. నా బండీ బయలుదేరే రైల్టైము 18-45. మహారాణీపేట ఆ ప్రాంతాన్ని నేను బయలుదేఱేసరికే 18-15 అయింది. బండి దొరుకుతుందో దొరకదో అన్నట్టు గుండెలు కవుక్కుంటూ వచ్చి గబ గబా మామూలుగా టిక్కెట్టు కొను క్కోవడానికి తత్తరపడ్డట్టు పడుతూ లేస్తూ వెళ్ళబోయాను స్టేషన్ ఆవరణలోకి. అక్కడ ఆపాళంగా ఓ ఎఱ్ఱటోపీవాలా

వుండి "స్వామీ! చిత్తగించి తమరు కాస్సేపు అలా ఆ ప్యాసెంజర్లు అందరూ నిల్చున్న తావున నిలబడండి: వైస్రాయిగారి స్పెషల్ వస్తూవుంది" అన్నాడు. "ఎంతసేపట్లో వస్తుంది ఏమిటి?" అన్నాను. "రెండుగంటల టైము ఇంకా పడుతుంది" అన్నాడు. "అయితే ప్యాసెంజర్ ఎక్కిపోవాలే నేను?" అన్నాను. "ప్యాసెంజర్ గీసెంజర్ జాంతానై. దూరంగావెళ్ళి అక్కడ నిలుచోమని చెప్పవోయి" అన్నాడు ఘట్టిగా పోలీసు సర్కిల్ రౌను తిరుగుతూ. కాన్స్టబిల్‌చేత ఆ ముక్క అనిపించుకోకుండానే నేను చలిలో వణుక్కుంటూ తక్కిన ప్యాసెంజర్లు అందఱూ నిలబడియున్న షెడ్డు దగ్గఱకు వెళ్ళి ఆరుబయట ఆగిపోయినాను.

"అయితే ప్రయాణీకులు డబ్బు ఇవ్వలేదూ? వారిలా కష్టపడవలసిందేనా ఈ రెండుగంటలూ ఈ చలిలో!" అని ఆరు బయట ఓ మూలుగు. "అయ్యో! మెతుకులు ఊళ్లో తినకుండా ప్లాట్‌ఫారమ్ మీద తిని గూడూరు పోవాలని వచ్చాను. మెతుకులు తినడానిక్కూడా అలా పోకూడదట" అని ఓదీనాలాపం, "భళిరా! మూడు రోజుల్నుంచి వార్తాపత్రికల్లో పడుతూ వుందికదా వైస్రాయిగారి ప్రయాణపు ప్రోగ్రాం; దాన్ని పుచ్చుకుని నేడీ ప్యాసెంజరు రెండుగంటలు ఆలస్యంగా బయలుదేఱుతుంది అని ఎందుకు రైల్వేవారు ప్రచురించి యుండకూడదు! మనల్ని చంపడాని క్కాకపోతేను" అని ఒక నిరాశ వాక్కు; ఇలాగ్గా ఆ జనంలోంచి వెలువడుతున్నాయి.

ఏలా గడచిపోయిందో వో గంట గడచిపోయింది. అంతలో బి. ఎన్. ఆర్.. ఈల వినబడింది. ప్లాటుఫారమ్‌మీద నుంచి ఒకళ్లిద్దరు సార్జంట్లు తెల్లవాళ్లు టకటక మంటూ యీవల

ఆవరణలోకి వచ్చి నేటివ్ కాన్స్టబిల్సును, సబుఇన్స్పెక్టర్లను, సర్కిల్ఇన్స్పెక్టర్లను ఒకింత మిలిటరీని, "పైలట్‌గాడీ వస్తూవుంది" అన్ని హెచ్చరించి చుట్టూచూచేరు. దూరంగాయున్న ప్రయాణీకుల గుంపులోకూడా కలకలం బయలుదేఱుతూయుంటే "మీ రెవరున్నూ దరికిరారాదు" అన్నట్టు బెత్తాలు త్రిప్పేరు.

సరిగ్గా అదే వేళకు కొందఱు దొరలు కొందఱు దొరసానులు ఎక్కణ్ణుంచి వస్తూయున్నారో వెన్నెట్లో కనబడీ కనబడని నడకతో వచ్చి తిన్నగా స్టేషన్‌లోకి వెళ్లిపోయినారు. వైస్‌రాయిగారి స్పెషల్ తెల్లగా వచ్చి తెల్లగా వెళ్ళిపోయింది మరో ముప్పావుగంటకు.

స్టేషన్‌లోకి నిరాటంకంగా వెళ్ళిపోయిన దొరల్ని దొరసానుల్ని గురించి, అంతకంటె నిరాటంకంగా వచ్చిపోయిన వైస్‌రాయిగారి స్పెషల్‌ను గురించి, విస్తుపోయి ఆలోచిస్తూ వో ప్రయాణీకుడు "తెల్ల దొరతనమునకు ఇదంతా వో మాయ ఎడ్వర్టైజుమెంటు" అని విమర్శించేడు. "మనం" అన్నాను నేను లాయం కంపులా నా చుట్టూ ఉన్న స్థలం దుర్వాసన కొడుతూవుంటే. "మనం ఈ షెడ్డులో బానిసభావానికి ఎడ్వర్టైజుమెంటు" అన్నాడు. షెడ్‌కేసి చూచాను. దానిమీద యిలా వ్రాసివుంది : "Third class waiting shed. Stand for lorries and taxis" అని ఉన్నది.

"మనం టాక్సీలమా లారీలమా" అని అనుకుంటూ Most inconvenient journey చేశాను నాటిరాత్రి టిక్కెట్టుకు రు. 2-8-0 చెల్లించాను. 18-45 కు బయలుదేరవలసిన బండి 20-45 కు బయలుదేరింది. ఇంటికి రాత్రి 11 చేరవలసిన వాణ్ణి కాకులు కూసేవేళకి చేరుకున్నాను.

# దేవుని మేళం

—• పాట •—

“ పువ్వు విడిచియుంటె నవ్వొస్తదే
పువ్వు వాడి రాలితే ఏడ్పొస్తదే—( అమ్మ )
గవ్వ గలగలమంటె నవ్వొస్తదే
గవ్వ సితికిపోతే ఏడ్పొస్తదే—( అమ్మ )
తువ్వ గంతులేస్తె నవ్వొస్తదే
తువ్వ కుమ్ములాడ్తె ఏడ్పొస్తదే—( అమ్మ )
రంగుసీరా కడితె నవ్వొస్తదే
రంగు వెలిసీ మాస్తె ఏడ్పొస్తదే—( అమ్మ )
బావ రమ్మంటూంటె నవ్వొస్తదే
బావ పొమ్మంటూంటె ఏడ్పొస్తదే ”—( అమ్మ )

నాడు రథోత్సవములో రథంముందు నిలిచి ఆడుతూ బోగంవాళ్ళందఱూ పైపాట ప్రత్యేకంగా వొకానొక 12, 13, ఏళ్లున్న చిన్నబాలిక చేత అభినయం పట్టిస్తూ యున్నారు. మేళంయొక్క అందచందాలు పసికూన అడ్డం పొడ్డం త్రిప్పుకోవడం, కంటూ అలాగే నిలిచి పోయినారు నేటివ్ సాహేబులు, ఫరంగీ సాహేబులు, జిల్లా కలక్టరుగారు, వారిభార్య,—సబు కలక్టరుగారు, పోలీస్ సూప రింటెండెంటు, తహశీల్దార్, అందఱూ మొత్తం పది పంద్రెండుమంది.

వారందఱిమెడల్లోను, తెల్లగన్నేరు దండలు కొందఱి మెళ్ళల్లో, ఎఱ్ఱగన్నేరు దండలు కొందఱి మెళ్లల్లో, పచ్చగన్నేరు దండలు కొందఱి మెళ్ళల్లో, అర్చకు లంతక్రితమే వేసి, బోగం

వాళ్ళ యొక్కయు ఇతర ప్రేక్షకుల యొక్కయు, మన్ననకు, దేవునికంటె యెక్కువగా సర్కారు ఉద్యోగస్థులే పాత్రులన్నట్లు తోపింపచేసినారు. ఆ కారణంచేత పై పెద్దమనుష్యులు, పిల్లవేసే గంతు చూస్తూ నిర్ఘాంత పోతూవుంటే ఎక్కడిజనం అక్కణ్ణే ఆగిపోయినారు.

రథం నిల్చిపోయింది. రథం లాగేవాళ్లు త్రాళ్లు వదలివేసినారు. రథంమీది గంటలు గాలికైనా ధ్వనించడంలేదు. బుట్టబొమ్మల్లో వాళ్ళుకూడా తమ బొమ్మలు దించి యీవలకు వచ్చి బోగంమేళాన్ని చుట్టేసి చూస్తూయున్నారు.

చివరి మూడు చరణాలకు మటి యిద్దఱు యువతులు కూడా గజ్జెకట్టి ముందుకు వచ్చినవారై పిల్లతో కలిసి పిల్లను మధ్యపెట్టుకు ఆడుతూ పాడుతూ చలాకీ చూపెడుతూ వున్నారు.

(పాటతరువాయి)

చివరి మూడుచరణాలు

"వంక పీడాడ్తుంటె నవ్వొస్తదే
బొంకు లాడీ అంటె ఏడ్పొస్తదే—(అమ్మ)
సంకు తొడుగూతుంటె నవ్వొస్తదే
సంకు కడుగూతుంటె ఏడ్పొస్తదే—(అమ్మ)
'డాక్' దొరకాసంటె నవ్వొస్తదే
'డాక్' దొర 'క్రా' సంటె ఏడ్పొస్తదే"—(అమ్మ)

చెంగు చెంగు ముక్తాయింపున కొచ్చి వాళ్లూకళ్లూ మెఱయించేలో, పిల్లమెళ్లో ఏదో తళుక్కు మినుక్కు మన్నట్టయింది. ఆ తేటు అదివఱకున్ను వున్నదే అక్కడ కాని ఆ దాకా ఎవరున్ను గమనించలేదు. "డాక్‌దొర క్రాసంటె" అని

పాడేతలికి, పెద్ద కలక్టరువారి భార్య సీమ దొరసానమ్మగారు అన్నారు "ఆ పిల్ల మెళ్లోది క్రీస్తుక్రాస్‌మల్లే వుందే!" అని. భర్త "క్రాస్?" ఆంగ్లో ఇండ్యన్ సబు కలక్టరు "క్రాస్?" నేటివ్ క్రిస్టియన్ తహశీల్దార్ రెవిన్యూ ఇన్స్పెక్టరుతో "వాట్! క్రాస్! పోయి చూచి రా!" అన్నాడు. రెవిన్యూ ఇన్స్పెక్టరు మునసబు కరణాల్తో "సిలువట దాని మెళ్లోది! తీసేసి ఆడ మనండోయి వెఱ్ఱిపుల్లాయిల్లారా! మీయుద్యోగా లూడిపోగలవు!" అన్నాడు. పోలీస్ సూపరింటెండెంటు యూరేషియన్ గ్రుడ్లెఱ్ఱ చేశేడు.

పిల్ల అడ్డం కట్టిపెట్టేసింది. ఆ పిల్లకు వెనకహాంగు, పక్కహాంగుగా వున్న పెద్ద బోగంసాను లందఱూ హడలిపోయి చూస్తూయున్నారు. "ముక్కుపచ్చ లాఱని పసిబిడ్డచేత గజ్జె కట్టించాం. అభినయనంలో తప్పేం వచ్చిందో! అయినా బాగానే పడుతూవుందే!" అని వొకత్తె అంది. "అయినా ఆసరాగా దాంతో పెద్ద తలకాయలూ ఆడుతున్నాయి కాదుటర్రా! లోటేం చేశాం?" అని మఱొకత్తె అందుకుంది. మూడోదింకొకత్తె "మెరమెర తెరబండి కంటె మేలైన పాటేకదే!" అని సర్దింది. వాళ్ళందర్నీ సద్దణచి మేళ నాయకురా లేదో అనబోతూవుంది. అంతలో మనసబుకరణా లిద్దఱూ వేశ్యల వెనక్కు వెళ్ళి వాళ్ళ చెవుల్లో వూదారు.

"అబ్బే! మాకు తెల్దండీ! మీ రెంత వట్టు పెడితే అంత వట్టు. ఆ వస్తువు సిలువ అనీ, అది యేసుక్రీస్తువారి చిహ్నమనీ మాకు తెల్దండీ! రామ! రామ!" అని మేళం మేళం అంతా నోళ్లు నొక్కుకున్నారు. వెనక్కు గభీమని పిల్లను లాగేసినారు.

"నిన్నెందుకు తీసికొచ్చినామే యీ వేళ ప్రొద్దున. కొఱవిపెట్టి తల గోక్కున్నట్టయిందీ." అనుకొన్నారు. "వచ్చి అడకుండానే యిస్తారాయేంటి? దాని అమ్మభాగం? అమ్మాపోయి మాన్యం పోయి ఏం అడుక్కు తినమంటారా మీరు దాన్ని?" అని తిట్టూ దేవాడు ఆ పిల్లను తన పక్కకు బుజ్జగింపుగా తీసికొన్నాడు.

"ఎక్కడ నేర్చుకున్నావమ్మా ఈ పాట నీవు మాకొంప తీయడానికి?" అన్నాడు మద్దెలగాడు. "మా అమ్మదగ్గఱ" అంది. పిల్ల మెళ్లో క్రాస్ చూచుకుంటూ, "వాళ్ళ అమ్మ వుందా?" అని అడిగారు అంతరిక్షంకేసి చూస్తూ పెద్ద కలక్టరు, వారిపేరు మోరిసన్‌దొరగారు. "లేదండి! నిరుటి వేసంగిలో చచ్చిపోయింది" అని రివెన్యూ ఇన్స్పెక్టరుద్వారా కరణంగారు మనవిచేసుకున్నారు.

"పిల్లమెళ్లోకి క్రాస్ ఎలావచ్చిందో ఈరేత్రి దర్యాప్తుచేసి ఉదయాన్నే నాకు రిపోర్టు పంపించు" అని తహశీల్దారు మునసబును హెచ్చరించాడు. "నా అనుమానం ఎవళ్లైనా మతం పుచ్చుకున్న పేద కులస్థులు వాళ్ళకు తినతిండిలేక యీ క్రాస్‌తో కూడా యీ పిల్లను అమ్మివుంటారు" అన్నాడు సబుకలక్టరు సూచనగా తహశీల్దారుతో. "అయినా ఎవరిచ్చారో లేక ఎవరు పెట్టారో ఆ వస్తువ. ఆ సంగతి ఇప్పుడే అడక్కూడదూ ఆ పిల్లను?" అని ఒక పోలీసుజవానుచేత సూపరింటెండెంటు దొరగా రాపిల్లను తన దగ్గఱకు పిలిపించుకున్నాడు. "ఏమమ్మా! నీ కెవరిచేత యియ్యబడ్డది ఆ క్రాస్!" అని హెడ్డుచేత అడిగించాడు. పిల్ల "మా అమ్మ!" "మీ అమ్మ నీకింకా ఏమైనా ఇచ్చిందా?" "ఆ! బైబిల్ పుస్తకం"—"మీ అమ్మ

అంటే" అన్నాడు కరణం. "బోగం వినాయకమ్మ. మాం బోగ వాళ్లం" అంది పిల్ల ఎంతో ముద్దుగా యావన్మందికీ వినబడేటట్టు.

"డాక్దొర ఎవడ్రా!" అని అదివఱకు ఆ పాట సాంతంగా వినని సానులు తెలిసినట్టు నటించే సానుల్ని అడుగుతూ తమలో తాము గుసగుస లాడుకోసాగేరు.

రథంమీది అర్చకులు జయగంట మోగిస్తున్నారు "లాగండి! లాగండి! వేళ మించిపోతూవుం" దన్నట్టు. ధర్మ కర్త కుక్కిన పేనులా కిక్కురు మనకుండా నక్కి నక్కి నివా రింపుగా చేయి వూపేడు "జయగంట; వాయించొ"ద్దని. "ఉత్సవం ఆగిపోయిందన్న మాటేగా" అని అడిగారు బాజా భజంత్రీగాళ్లు ముందున్నవాళ్లు వెనక్కొచ్చి ధర్మకర్తగార్ని చుట్టేసి. "ఆగిపోక! మన సానిగుంటల తెలివితేటలిలా ఏడి శాయి!" అన్నాడు ధర్మకర్త. "ఆజానుబాహుల్లాంటి అన్య మతస్థుల్ని రథాని కడ్డుగా నిలబెట్టి వాళ్ల వక్షస్థలాలమీద, దండలూ గిండలూ వేసి దేవునికంటె ఎక్కువగా వాళ్ళను మీరు గౌరవిస్తూ వుంటే, వాళ్ళను గుఱించిన పాటలు బోగంవాళ్లు ఏలా పాడకుండా వుంటారు? ఆ దొరల్లో వొక్కడైనా శ్రీ జగన్నాధు డికి మ్రొక్కాడా? అయ్యవార్లంగారి మ్రోల సాగిలబడ్డాడా? మళ్ళీ వొక్కొక్కడు మెడనుంచి తొడదాకా పూలు వ్రేలాడ వేసికొని వుత్సవంలో బోగంమేళమ్ముందు నిలబడ్డాడే!" అన్నాడు పేరయ్య అనే వో పౌరసత్తముడు.

జగన్నాథస్వామి రథోత్సవం ఏ యేడూ అంత అకటా వికటంగా జరిగియుండలేదు. చూడవచ్చిన భక్తులందఱూ "రథోత్సవం పూర్తికాలేదు. పూర్తికాలేదు, అయ్యో!" అని అనుకుంటూనే తమతమ యిళ్లకు మళ్ళిపోయినారు.

"మోరిసన్" సతీమణికిమాత్రం రథోత్సవం పూర్తి కాలేదనే విచారంకన్న బోగం పిల్లను గురించిన భోగట్టా పూర్తిగా దొరకలేదనే విచారం హెచ్చైంది. విచారంతోపాటు పిల్లను గురించి వితర్కింపున్నూ హెచ్చైంది. తుదకు నిర్ధారణగా తెలుసుకుంది కర్ణాకర్ణిగా ఆపిల్ల కిరస్తానీ పిల్ల అని, కిరస్తానీ పిల్ల కాకపోయినా క్రిష్టియన్ టెండెన్సీ బాగా వున్న పిల్ల అని.

తిన్నగా బోర్డింగ్ హోమ్ మేనేజర్ అయిన సిస్టర్ హారిసన్‌వద్దకు వెళ్ళి మెస్సెస్ మోరిసన్ ఇలా చెప్పింది: "పిల్లకు క్రిష్టియన్ టెండెన్సీ ఉపద్రవంగా కద్దు. ఆ పిల్లను ఏలాగైనా మీ బోర్డింగ్ హోమ్‌లో చేర్చుకుని క్రమశిక్షణ యివ్వాలి" సోదరి హారిసన్ అంటుంది. "ఈ వసతిగృహంలో చేర్చుకోబడేవాళ్లు అందఱూ సరియైన తండ్రులకూ సరియైన తల్లులకూ పుట్టినవాళ్ళయి యుండాలి. పడుపుటిళ్ళ పడుచులు పనికిరారు" అని. "ఇప్పుడా పిల్ల తండ్రిగాని తల్లిగాని సరియైన మనుష్యులు కారని ఎలా చెప్పగలం?" అంది లేడీ మోరిసన్. "అయితే తెలుసుకురండి!" అంది సోదరి హారిసన్.

మిసెస్ మోరిసన్ తిన్నగా తన భర్తదగ్గఱకు వెళ్ళి ఆ సంగతి చెప్పింది. భర్త మోరిసన్ అంటాడు "బోగంవాళ్ళకు సరియైన తండ్రు లెలావుంటారు? వాళ్ళపుట్టుక కనబడే రిజిష్టరుల్లో తండ్రులపేర్లు వుండనే వుండవు. పెళ్ళిళ్ళు లేవు వాళ్లకు" అని. మోరిసన్ దొరసాని మళ్ళీ బోర్డింగ్ హోమ్‌కు వెళ్ళి ఆ వింత అంతా మిస్ హారిసన్‌కు విప్పిచెప్పింది. అందుమీద మిస్ హారిసన్ పర్యాలోచించి "ఆ పిల్లకు పదమూడేళ్ళ కంటె ఎక్కువ వుండవు కమోసు—మైనారిటీ తీఱని పిల్ల

అయివుంటుంది. మైనారిటీ తీఅని అన్యమతస్థుల్ని వాళ్ళ పెద్ద వాళ్ల యిష్టం వుంటే తప్ప మేం ఈ వసతిగృహంలో చేర్చు కోవడానికి వీల్లేదు. ఆ పిల్లకు సోదరు డుండవచ్చు. తెలిసికొని రండి " అని సలహా యిచ్చింది.

మిసెస్సు మోరిసన్ విసుగుచెందక, ఏలాగైనా ఆ పిల్లను పడుపు జాడ్యంకు గుఱికాకుండా రక్షిద్దామనే విచింతనంకొద్దీ. కీర్తిశేషురాలైన వినాయకమ్మ యింటికి కార్ వేసుకువెళ్ళి "నీకు సోదరుడు, నీకంటె పెద్దవాడు, ఉన్నాడా ? " అని అడిగింది పిల్లను. " లేకేం ! " అంటూ ఆ పిల్ల వోచేత్తో బైబిలు పొత్తమూ, వోచేత్తో క్రీస్తుపటమూ తెచ్చి " ఇతడే నా అన్న ! " అంది. " ఇతడు ? " అని అడిగింది మోరిసన్ సతి. " అతడే ! అతడొక్కడే నా సోదరుడు " అంది పిల్ల. Tremendous catholic fervour in her.

అని తన భాషను లోపలనుకొని " ఎట్లా అమ్మా ఇతడు నీకు సోదరుడు ? " అని పటం చూస్తూ దొరసాని అడిగింది. " అతనికి తండ్రి దేవుడే. నాకూ తండ్రి దేవుడే " అంది బిడ్డ. ముక్కుమీద అలా వేలువేసుకుంది లేడీ మోరిసన్ ; పిల్ల దిక్కు లేని పిల్ల అని తెలుసుకుంది. తక్షణం ఆ పిల్లను అలాగ్గా పటంతో, మెళ్లోక్రాసుతో, చేతిలోని బైబిలుతో, తన కారులో కూర్చుండబెట్టుకుని బోర్డింగు హోమ్‌కు తీసికొనివెళ్ళి " ప్రియ మైన హారిసన్ సోదరీ ! ఈ పిల్ల " బ్రాతల్‌బ్రీడ్ " కాదు. She is more Christian in spirit than any of us. తక్షణం బోర్డింగు హోమ్‌లోనికి ఎడ్మిట్ చేసుకుని తగిన విద్యాబుద్ధులు కఱపు. దయచేసి కఱపు. " అని యొప్పజెప్పి తాను పిల్లనుండి, సిస్టర్ హారిసిన్‌నుండి సెలవు పుచ్చుకుంది.

ఊళ్లోవాళ్ళంతా "దొరలు తలచుకున్నాక ఎంతపని అయినా జరిగి తీరుతుంది" అని కొందఱు. ఇంతకూ చచ్చే ముందు కిరస్తానీపిల్లను కొనుక్కొని మఱీ చచ్చింది కమోసు వినాయకమ్మ! ఆ పాపం పుణ్యం భగవంతునికి తెలియాలి!" అని కొందరు. ఇలా వాడావాడా ఇట్టే చెప్పుకోసాగారు. చెప్పుకోవడం ఎంత త్వరగా చెప్పుకున్నారో మఱచి పోవడంకూడా అంత త్వరగాను మఱచిపోయినారు. దిక్కున్న పిల్ల అయితే అంత త్వరగా మఱచిపోగలరా? దిక్కులేని పిల్ల కనకనే మఱచిపోగలిగారు. మఱిన్నీ వినాయకమ్మ పోయిన యీ దరిమిలాను ఆమె వారసుగా నమోదుకాబడ్డ యీ పిల్లపేరు—మనోమోహిని—అనే పేరు మునసబు కరణాలు తమ లెక్కల్లోంచి తగ్గించివేసినారు. దేవాలయపు ధర్మకర్తలున్ను తమ చిర్తా ఆవర్జాల్లో లేకుండా చేసినారు.

జిల్లా కలెక్టరుగారి భార్యాగారు నొక్కి చెప్పడం వల్లను సంతృప్తిపడి సోదరి మిస్ హారిసన్ యప్పట్లో మిస్ మనోమోహినిని వసతిగృహంలో చేర్చుకున్నాదేకాని తన మనస్సు కుదుటపడికాదు. వసతిగృహంలోని యేర్పాట్లూ రూల్సూ యన్నీ అసిధారావ్రతంగా జరగవలసినవే. అందులోనూ మిస్ హారిసన్ హెచ్చుతగ్గులు ఏమాత్రం రానిచ్చే మనిషికాదు. బహూ నిక్కచ్చి ఆమెతో వ్యాపారం. లేడీ మోరిసన్ వెళ్ళిన వెనకాతలే మిస్ హారిసన్ కొత్త ఎడ్మిట్‌కు తాత్కాలికంగా ఒక గదీ అదీ యిచ్చి యందులో వుండమని తానీవలకు వచ్చి "ఆమె ఆత్మ పరిశుద్ధమైన ఆత్మకావచ్చు. కాని శరీరం? అది పడుపు వృత్తిని జనించిన పాపపు పంకిల పరిపాక లబ్ధమేమో కదా! నాభయం!

నా యనుమానం! ఆ పిల్ల "వైల్డుఓట్" మొలక! ఏలా తెలిసి కోవడం? ఎవరిని యడగడం? అయినా యీ సాబుజాలమీది బరువు "ఫాస్టర్ ఎఫ్" బుజాలమీదికి మారుస్తా! ఈ విషయం ఈ మిషన్ డివిజన్ మతగురువుకు వ్రాసి ఆయన యనుజ్ఞ తీసి కొంటా" అని ఒకానొక నిశ్చయానికి వచ్చింది. వచ్చి ఆ ప్రకారం ఆ పిల్లను గురించి తనకు వున్న ఆందోళన యావత్తు "ఫాస్టర్ ఎఫ్" దొరగారికి వ్రాత మూలకంగా ఎఱుక పఱిచింది.

"ఎఫ్" దొరగారు, "ఇంకా వెలుగుగొల్పే సంజాయిషీ యవసరం. ఆ పిల్ల కులం, వూరు, తల్లిదండ్రులను గుఱించిన విశేషాలు యవసరం! యని తిరిగి మిస్ హారిసన్‌కు రిఫెర్ చేసినారు. మిస్ హారిసన్ తనకు తెలిసినంతలో యిలా వ్రాసి కాగితం ఫాస్టర్ ఎఫ్‌కు మళ్ళీ పంపించింది. ఆమె కులం డి. జి. కులం. ఆమె తల్లి పేరు మిస్ వినాయకమ్మ. ఆమెకు తండ్రి లేదంటుంది. ఎప్పుడూ లేనే లేడంటుంది. కాని పిల్లను విశేషంగా లేడీ మోరిసన్ పొగడి. ఎక్కువగా రికెమెండు చేసింది. పిల్లను చూస్తేకూడా చాలా నికార్సు పిల్లలాగ కనిపిస్తుంది. హెచ్చు నిజమైన క్రిస్టియన్ ఫీలింగ్సు వున్న పిల్లలా తోస్తుంది."

ఫాదర్ ఎఫ్ పై వృత్తాంతం సాంతంగా చదువుకొని వెంటనే యిలా ఎండార్సుమెంటు ఇచ్చాడు. "నాకు మిస్ వినాయకమ్మ తెలుసు. నేను ఆమెను స్వయంగా మదిరేశ్వర గ్రామము బయట వున్న డాక్ బంగాళాలో చూస్తూవుండేవాణ్ణి. ఆమె నా దగ్గఱకు వస్తూవుండేది. ఆమెకు నేను, మన లార్డు యేసును గుఱించీ, శిలువను గుఱించీ, బోధచేసినప్పుడల్లా ఆమె

కళ్ళనీళ్లు పెట్టుకునేది. ఆమెకు నేను ఒక బైబిల్‌ప్రతి, ఒక క్రీస్తుప్రతిమ, ఒక శిలువ చిహ్నము ఇచ్చియున్నాను. ఆమె డి. జి. కాదు. జి. డి ! గాడ్స్ డాన్సర్ ! దేవుని నర్తకి ! ఆమె నాతో స్పష్టంగా చెప్పింది తాను దేవుని మేళానికి చెందినదాన్ని అని. కాని ఆమె మనస్సు ఎంత కరిగించినవాణ్ణి యయినప్పటి కిన్ని నేను ఆమెను క్రీస్తుమతంలోనికి మార్చలేకపోయినాను. ఇప్పుడు నీవు ఆమె కొమార్తెను స్వాధీనపఱచుకొని ఆ పిల్ల యొక్క ఆత్మను రక్షింప గల్గుతున్నావూ అంటే యది చాలా గొప్పమాట. నిన్ను నేను మిక్కిలి అభినందిస్తుయున్నాను. నీవు యవలంబించిన చర్య సరియైన చర్యయే. మనము చేయు కార్యములు వానివాని ఫలితములనుబట్టియే యంగీకరింపబడు చున్నవి. నీ వొనరించిన కార్యఫలితము యమూల్యము. "—

పైపెద్దజాబు ఫాదర్ ఎఫ్ వ్రాసినది చూచి మిస్, హారిసన్ యపరిమితంగా ఉప్పొంగి పోయింది. 'వెంటనే విపరీతమైన కీచుగొంతుతో డియర్ మిస్ మనోమోహినీ' యని పిల్చి మిస్ హారిసన్ ఆ పిల్లను కావులించుకొని 'మనోమోహినీ! మీ అమ్మ ఫాదర్ ఎఫ్‌గారివల్ల మీ వూరి డాక్ బంగాళాలో క్రాస్ అందుకుని యేసు కథ విని చాలా దుఃఖించేదట. ఆమె కంటె ఎక్కువ దానివి కావాలి నీవు' అని బోధచేసింది. పిల్ల మనోమోహిని 'క్రాస్ ఆ? కాసా? మా అమ్మ మెళ్లో క్రాసూ వుండేది పెద్ద మొహిరీకాసూ వుండేది. అవును జాపకం వచ్చింది. మా అమ్మ పాటపాడేదికూడాను.

"డాక్ దొర కాసంటె నవ్వొస్తదే
డాక్ దొర క్రాసంటె ఏడ్పొస్తదే—అమ్మ"

అని విచిత్రంగా పాడింది.

మిస్ హారిసన్ "కాసు" అని వినడంతోనే స్థబ్ధఅయింది పిల్లను మెల్లగా "చూడమ్మా! నీవు మీ అమ్మలాగు కాసుల పేరు వేసికోకూడదు. పట్టుచీరలు కట్టుకోరాదు. పువ్వులు ముణుచుకో వల్లపడదు. నీవు మంచి క్రిస్టియన్ పిల్లవు కావాలి: కొలదికాలంలోనే యేసుయొక్క సిసలైన సేవకురాలివి కాగలవు!" అని అవలకు పంపివైచినది. తాను తన గదిలో పరుండి రేత్రి వేళ ఫాదర్ ఎఫ్ కొండక్టును గుఱించి మిక్కిలిగా శంకింప దొడగింది మిస్ హారిసన్.

ఆమె గదిలోనిదీపం, నిదరవేళ ఆరిపోయేమాత్రపు చమురు గలది, తనంతనే తగ్గింది.

# కార్ క్లీనరా ? హార్ట్ క్లీనరా

"కార్ క్లీనరుకు బోగందా ?"

అని గద్దిస్తూ, రంగణ్ణి బస్ ప్రొప్రయిటర్ వెంకటస్వామి తన కాలిచడావ్ తీసి కొట్టబోయినాడు. వారి కిద్దరికీ మధ్యను డ్రైవరు లక్ష్మయ్యా కండక్టరు సుబ్బారాయుడూ అడ్డపడి ఆ దెబ్బ రంగడికి తగలకుండా ఆపినారు.

రంగడు మిక్కిలిగా ముఖం చిన్నబుచ్చుకున్నాడు. తాను వెంకటస్వామికింద నవుకరీకి వుండబట్టికదా వెంకటస్వామి ఆలా చడావ్ తీసి కొట్టబోయినాడు అని తలపోశాడు. కళ్ళ నీళ్ళెట్టుకున్నాడు. కాని హృదయంలోని వేడి ఆలాగేవుంది. వెంకటస్వామిని అవమానించాలని మనస్సులో పంతం పూనాడు. పైకి పెగ్గపోతే ప్రయోజనం లేదనుకున్నాడు. పైసాతోగాని బోగంది చేజిక్కదు అని చింతించాడు.

జేబు తడుముకు జేబులో డబ్బు లెన్ని వున్నాయో లెక్కపెట్టుకోవడమన్నా ఎఱగని వ్యక్తి రంగడు. వాడెప్పుడున్నూ జేబుల్లేని మొండి బనియనే తొడిగేవాడు. ఓ చినిగిన పంచె రెండు మడతలుగా సవరించుకుని ఆ పంచెను సీల మండల మీదకు, ఆ పైన పిక్కలమీదకు, క్రమంగా మోకాళ్లమీదకు 'దో' 'చార్' 'ఆట్' అంశము లేవనెత్తి వర్తించేవాడు.

మిస్ బలభద్రాన్ని గుంటూరునుంచి తీసికొనివచ్చి, దానికోచిన్న డాబాయిల్లు బెజవాడా నూజివీడు రోడ్డు పక్కన కట్టించి, ఆరేళ్ళయి ప్రొప్రైటర్ వెంకటస్వామి దాన్ని అందులో

కాపుర్రం పెట్టాడు. ఆ యింటికీ ఆ భోగందానికీ కూడా కొజ్జావాణ్ణి
వాకణ్ణి కాపలా వేశాడు. ఆ సంగతి లోకానికంతకూ తెలుసును.
మరిన్ని తన బస్సు ఆ రోడ్డే పోతూవుంటే ఒక్కొక్కప్పుడు
తానే నడుపుతూ డ్రైవరు కూర్చునే చోటునుంచి ఓరచూపులు
తన భోగందాని బంగాళాకేసి చూస్తూ, రోజూ అనుభవించే స్వీయ
బలభద్రాన్ని అదో నవ్య మేనకలా తలపోసికుంటూ వెంకట
స్వామి తాజా మోజుపడేవాడు. డ్రైవరూ కండక్టరూ తను
ప్రొప్రయిటరు చేష్టకు లోలో నవ్వుకునేవారు. క్లీనరు ఓ విధ
మైన స్వతస్సిద్ధపు టీర్ష్యచేతనా అన్నట్టు 'డస్టర్' ధూళి ఆకాశం
లోకి విరజిమ్మేవాడు.

దేవునియందు అందరూ సమానులే అన్నట్టు శ్రీరామ
నవమి ఉత్సవాల రోజుల్లో ఆయా పందిళ్ళల్లో జనం మిక్కి
టంగా గుమికూడి కలుసుకుపోయి ఇతగాడు క్లీనర్, ఇతగాడు
ప్రొప్రయిటర్ అనే వివక్షత వుండకుండా వుంటుంది చూడండి :-

అటువంటి ఉత్సవాల రోజుల్లో పెద్ద పందిరివేయించి
వెంకటస్వామి గొప్ప ఉత్సవం చేస్తూ మిస్ బలభద్రంచేత
బెజవాడలో గజ్జె కట్టించటం పరిపాటి. ఆ అయిదురోజులే దాని
దర్శనమూ అన్నట్టు ప్రజలు విరగబడి చూస్తారు.

వెంకటస్వామికి బెజవాడలో సొంతభవనం విశాలమైంది
వుంది. పూర్వులు కట్టించింది. ఆ యింటి ముంగిటే పై పందిరీ
పై యుత్సవమూ ఏటేటా జరగటం. అంచేత భోగందాన్ని తన
యింటి కా రాత్రులందు తన సొంత బస్సుమీద రప్పించుకు ఆట
ఆడించేవాడు. విలాస పురుషులకు అదో తప్పుగా తోచదు. అందు
లోనూ తన మిత్రులు 'వెంకటస్వామిగారూ ! మీ భోగంది

బాగా అభినయిస్తోందండోయి!' అని తేటతెల్లంగా గాకుండా 'ఆ పిల్ల మంచి నేర్పుగా పట్టిందిసుమండీ మువ్వగోపాల పదం' అని రెచ్చబెడుతూ వుంటే 'ఇంకా నేతపిల్ల! ఇంకా నేతపిల్ల!' అని దానికేసి చూస్తూ యజమాని తన చొక్కా సవరించుకునేవాడు.

ఆ రోజుల్లోని ఆ రాత్రులందలి ఆకుచింత అవకాశమే మిస్ బలభద్రాన్ని డ్రైవరూ, కండక్టరూ, క్లీనరూ, ముగ్గురూ చూడ్డానికీ, పలకరించడానికిన్నీ.—

డ్రైవరు 'అమ్మగారూ! మీరు ముందుసీటులో కూర్చోండి' అని అంటూవున్నా ఆమె వో రాత్రి వెనకసీటులోనే కూర్చుంది. ముందుసీటులో కండక్టర్ కూర్చుని 'నీ తెగులు చప్పగా కుదిర్చింది' అన్నాడు డ్రైవరుతో. డ్రైవరు 'ఈవేళ కాకపోతే రేపు కూర్చుంటుంది' అని గుసగుసగా కండక్టరు చెవిలో వూదాడు. క్లీనరు బస్సుకు స్టార్టిచ్చి ఎవరితోనూ మాట్లాడకుండా ఎప్పట్లాగ కూర్చున్నట్టు ఆమెను చూడకుండా కూర్చున్నట్లు మిస్ బలభద్రం కాళ్ళదగ్గఅ కూర్చున్నాడు.

క్లీనరు అంతవాడని డ్రైవరుగాని కండక్టరుగాని ఎప్పుడూ అనుకోలేదు. పాటకచ్చేరీగ్గాను బస్సు వడివడిగా పోతూవుంది.

క్లీనరు బస్సువేగాని కెంతమాత్రమున్నూ తడబడకుండా మెల్లగా మిస్ బలభద్రంయొక్క అరికాళ్లు తన డస్టరుతో తుడిచి, ఆ అరికాళ్లు అట్టే చీకటిచాటుగా ముద్దుపెట్టుకున్నాడు. 'ఎవరవు నీవు?' అంది మిస్ బలభద్రం. 'నేను క్లీనరు రంగణ్ణి' అన్నాడు. 'రేపు సాయంకాలం కనిపించు' అంది మిస్ బలభద్రం.

మర్నాడు సాయంకాలం క్లీనర్ రంగడు క్లీనరువేషంతోనే తిన్నగా వెళ్ళిపోయినాడు మిస్ బలభద్రం వున్న బంగాళా ముంగిటకు. అది లోపట్నుంచి కిటికీగుండా చూస్తూవుంది. కొజ్జా నవుకర్ను 'ఎవరో కనుక్కోనిరా!' అంది. కొజ్జా రంగడిని దరిసి రంగణ్ణి చూస్తూ 'ఏంబాబా! ఇలా దయచేసినారు. అమ్మ గారిమీద తమరూ కన్నేసి నారా?' అన్నాడు. క్లీనరు పాపం! ఆమాత్రం సంభాషణ చాకచక్య మప్పటికి యబ్బినవాడు కాడు. 'ఏమిటి నీ బొంద!' అన్నాడు. 'రోజు కేమివ్వగలవో అమ్మగారు కనుక్కోని రమ్మన్నారు' అన్నాడు కొజ్జా. 'రోజు క్కాదు ఇలాంటి విమ్మంటే నిమిట్టుకొకటి ఇవ్వగలను' అని రంగడు ఆ కొజ్జా కణతమీద ఒక్కగుద్దు గుద్దినాడు. కొజ్జా దిమ్మతిరిగి పడిపోయినాడు.

మిస్ బలభద్రం వెంటనే చెంబుడు చల్లటి నీళ్ళు తీసికొని వచ్చి తన నవుకరు యయిన కొజ్జా మనిషి ముఖమ్మీద చల్లి వాణ్ణి లేవనెత్తి సంగతి తెలుసుకుంది. కొజ్జాతో 'అందరూ డబ్బిచ్చేవాళ్ళే వుంటారా?' అని మందలించి పంపివేసింది. క్లీనర్ను తన గదిలోకి వచ్చి కూర్చోమంది.

కాని క్లీనరు వెళ్ళి మిస్ బలభద్రం గదిలో ఆసీనుడు గాకముందే వెంకటస్వామి తన మనోనాయకికై వచ్చిన కారణం చేత క్లీనరుకు కోర్కె తీరలేదు సరికదా చడాన్ దెబ్బ!

క్లీనరు అప్పు డనుకున్నాడు 'ఈ పిరికితనమంతా యీ పేలికల బనియనుమూలంగా గదా! ఇది తీసి పారేసి షోగ్గా ముస్తాబై వెళ్ళివుంటే జేబులో పెద్ద నోటు యుండివుంటే, కొజ్జాకో పదిరూపాయలు పారవేసివుంటే ఆ ఆలస్యం ఆనాడు

జరక్కపోయివుండేదికదా, ఆ యవమానం కలక్కపోయివుండేది కదా !' యని వితర్కించుకున్నాడు. చడావ్ దెబ్బతిన్న మఱు క్షణం వెంకటస్వామి వద్ద పని మానివేసి వెళ్ళిపోయినాడు.

రంగణ్ణి మళ్ళా మనం చూచేది యెక్కడా అంటే పోయి పోయి అతడు తెనాలిలో వో కాఫీహోటల్లో టేబిల్సు తుడిచే క్లీనరుగా కుదిరాడు. అంతకంటె హెచ్చు వూహ మనస్సులో కెక్కి హెచ్చు తరహా క్లీనరు కావడానికి అతని కప్పటికి సాంఘిక మట్టంగాని చదువు చట్రంగాని చాలదు. పోనీ యను భవముందా అంటే అదీ లేదు. కాని క్లీనింగు ప్రోసెస్సులో ఓ మెట్టు పై కెక్కినట్టుగా సంతోషించాడు రంగడు తనకు మరో కొత్తపని కల్పన కావడంతోనే.

కాఫీహోటల్ ప్రొప్రయిటర్ ఇచ్చేజీతం బస్సు ప్రొప్ర యిటర్ ఇచ్చిన జీతంకంటె ఎక్కువ లేకపోయినా, ఇక్కడా వాడు కట్టుకొనే గుడ్డలుగుండారూ మొండిబనియనే అయినా, బస్సుగుడ్డలకంటె పరిశుభ్రంగా వుండేవి. అంతచేటు చినిగి పోయినవిగా వుండేవికావు. దాన్నిబట్టో దేన్నిబట్టో రంగ డోమెట్టు పైకెక్కినట్టుగా సంతోషించాడు అని మనం యనుకో వలసివుంటుంది. ఎంత సంతోషిస్తూ కాలం గడుపుతూవున్నా అప్పుడుకూడా వాడు మిగుల్చుకో గలిగింది లేదు. మఱి తనకు మిస్ బలభద్రం ఏలా చిక్కుతుంది ?

మిస్ బలభద్రాన్ని గుఱించి రంగడు రోజు రోజూ, ఆలోచిస్తూ వుండేవాడు. ఓ ఏడాది అలాగ్గా గడచి పోయిన యీ దరిమిలాను రంగడు వున్న కాఫీహోటల్ ప్రొప్రయిటర్ తెనాలి ప్లాట్ఫారమ్మీద టిఫిన్ కంట్రాక్టర్ పదవి వహించాడు.

అప్పుడురంగడికి ఆ ప్లాట్‌ఫారంమీద తినుబండారాలు పాసెంజర్లకు అందజేసే హోదా కలిగింది. రంగడికిన్నీ అన్ని రకాల ప్రయాణీకుల్తోటీ మాట్లాడుతూ వుండడంవల్ల కుచ్‌కుచ్ ఇంగ్లీషు, ఆ ఇంగ్లీషుకి సంబంధించిన ఇంగిత జ్ఞానము, ఫాషన్, పోజు, అన్నీ పట్టుబడ్డాయి.

వోరోజున మిస్ బలభద్రం మెయిలెక్కి మదరాసు వెడుతూవుంది. ఆమె కూర్చున్న గాడీ టాప్‌మీద తిరగళ్ళలా నల్లటి దిమ్మలు తిరుగుతూ వుండడాన్నిబట్టి దేవతలుకూడా గుర్తింపగలిగేరో అది ఫస్టుక్లాస్ కంపార్టుమెంటు అని, దేవతా దృష్టి దానిమీద ప్రసన్నమౌతూ వుంది! కనకనే రంగడు వో ట్రేలో తీపి సరుకు 'దిల్ కుష్' కారపు సరుకు 'ఘటియా' గరమ్ గరమ్ చావో కప్పు పెట్టుకుని వెళ్లి వెళ్లి 'అందిపుచ్చుకో' అని అనలేక మిస్ బలభద్రం వున్న బండి కిటికీదగ్గఱ నిలబడ్డాడు ట్రేతో! మిస్ బలభద్రం రంగణ్ణి చూస్తూ సరుకు చవి చూస్తూ 'ఎవరు నువ్వు?' అంది. 'నేను హోండు క్లీనరు రంగణ్ణి;' అన్నాడు. మిస్ బలభద్రం బోధపఱచుకున్న దానికి మల్లే తన జిడ్డుచేయి చాచింది. రంగడు తన వేడినిట్టూర్పుతో ఆమె చేయి తుడిచి మిస్ బలభద్రం ముఖం చూచినాడు. ఆమె 'బిల్లు ఎంత?' అంది. కాని రంగడు బిల్లు ఇవ్వకుండానే మిస్ బలభద్రం రొక్కం ఇవ్వకుండానే మెయిలు 'ఝుంఝుం' అంటూ నడచిపోయింది.

ఇక్కడ్నే వున్నాది చిత్రమంతా! మర్నాడు వార్తాపత్రికల్లో పెద్ద 'స్నాప్' పడ్డాది. రంగడు 'ట్రే' మెయిలు గాడీ విండోమీద అంచి మిస్ బలభద్రం అరచెయ్యి తుడుస్తూ

వున్నట్టుంది ఆ బొమ్మ. "Sweet Service" అని పెద్ద పెద్ద అక్షరాల్తో కిందను టైటిల్.

మర్నాడు హోటల్ ప్రొప్రయిటర్ రంగణ్ణి పిల్చాడు. 'టేబిల్ క్లీనరుకు బోగందా?' అని ఊచి పుచ్చుకు రంగని దవడ వాచేటట్టు ఒక్క చెంపకాయ కొట్టాడు. రంగడు ఈమరిదఫా తాపడ్డ అవమానం రెండో మనిషితో చెప్పుకోకుండా కాఫీ హోటల్ వెలువడి ఆ పోవడం పోవడం గుంటూరు పోయాడు. వార్తాపత్రికల్లో పడ్డ బొమ్మను చూచి వెంకటస్వామి పడ్డ బాధ అంతాఇంతాకాదు. 'కార్ క్లీనరుకు బోగందా?' అని మళ్లో తడవ పళ్లు పటపట కొరుక్కున్నాడు. అయినా వెంకటస్వామియొక్క బాధ మనకీ కథతో నిమిత్తం లేదు.

రంగడు కుమిలి కుమిలి గుంటూరులో తిరుగుతూ ఒక ఫోటోగ్రాఫర్ వద్ద నెగెటివ్ ప్లేట్లు కడగడం పనిలో కుదిరాడు. ఆ ఫోటోగ్రాఫర్‌కు వో రోజున వుత్తరం వచ్చింది ఏమనీ?

"నా మిస్ మిస్సయి ఎక్కడికో లేచి పోయింది దాని ఫోటోకూడా నావద్ద లేదు. మీవద్ద అది చిన్నప్పుడు తీయించు కొన్న ఫోటోబాపతు నెగెటివ్ వుంటే దాన్నిబట్టి వెంటనే ఓకాపీ తయారుచేయించి పంపించవలసినది. ఎడ్వాన్సుగా పది రూపాయిలు ఎమ్. ఒ. చేసినాను.

యువర్సు ట్రూలీ,
వెంకటస్వామి, బెజవాడ.

ఫోటోగ్రాఫర్ వెంటనే తన దగ్గఱ వున్న నెగెటివ్ ప్లేట్సు అన్నీ వెతకి మిస్ బలభద్రాంది చిన్నప్పటి నెగెటివ్ వొకటి వుంటే ఆ ప్లేటు రంగడి కందిచ్చాడు. రంగడు ఆనెగెటివ్

ఆలా వెల్తురుకు పెట్టి చూస్తూ 'నా బలభద్రం! నా బలభద్రం!' అంటూ నేల జారవిడిచాడు.

వెంటనే ఫోటోగ్రాఫర్ 'వెధవా! నీకు బోగందేందిరా ?' అని రంగడి జుత్తు పుచ్చుకు గుంజి గుమ్మం ఆవలకు గెంటి వేసినాడు.

ఇక రంగడు వీధిని బడి పోతూ పడ్డ సిగ్గు అపరిమితం. ఆ సిగ్గుకు ప్రతిక్రియ తాను హాలీవుడ్ స్టార్ కావడమే—అని తలపోశాడు. .... .... .... ....

అనతికాలంలో ఊరూరా ఓ ఫిల్ము వెలిసింది. చూడండి తమాషా : "Heart Cleaner Rangadu" అని.

.... .... .... ....

ఫిల్ముకథ ఎంతోలేదు కాని రంగని కీర్తి చతుస్సాగర పర్యంతమునూ. .... .... .... ....

సదరు కథలోని గొప్ప గొప్ప భాగాలు.

"రంగడు మిస్ బలభద్రం కాళ్ళదుమ్ము తుడిచి అరి కాళ్లు ముద్దు పెట్టుకోవడం—ఎక్కడ ? బస్సులో—కూడా పాట.

"నీ నృత్య నియతిచే
నేలమీదా ధూళి
నీమంగ లేచేను - హా ! ప్రేయసీ !"

రంగడు ఆమె అరచేయి తుడవడం ఎప్పుడు ? మెయిలు నడచిపోతూవుంటే ఇక్కడ మాటే రాదు. అంతా మూగ ప్రసక్తియే.

రంగడు—ఆమె నెగెటివ్‌ను చూస్తూ 'నా బలభద్రం ! నా బలభద్రం !' అని అఱవడం ఇక్కడ నోటిలోని అఱపు

వాని గుండెల్లో ప్రతిధ్వనించడం రెట్టింపు రొదగా ప్రేక్షకులకు వినవస్తుంది.

ఇక నాల్గవభాగం క్రొత్తది మనకు తెలియనిది. మిస్ బలభద్రం తన రోత రొమ్ములు ఆడియన్సుకు చూపిస్తూ (అప్పటికి ఆడియన్సుకూడా ఫిల్ము కథలో కలిసిపోయేటంత తన్మయులై యుంటారు) తన్ను దుర్విటులు ఏలా తుక్కుచేసి పారేశారో అని గోలపెడుతుంది. రంగడు ఆమెయొక్క చ్యుతికి విచారిస్తూ తన కళ్ళంట కన్నీళ్లు ఆడియన్సులో కూర్చుండియే, పిచికారీలగుండా చిమ్మినట్టు ఆమె వక్షస్థలం మీదకు చిమ్ముతాడు. ఆ జాలి నీళ్ళకు మిస్ బలభద్రం తిరిగి నవయౌవన శోభనాంగియై నిక్కుచనుంగవతో చూపట్టుతుంది. రంగని యెడంద పెద్దమెఱపులా మెఱసి మెడకు నాగుపాములా చుట్టుకు పోయి అతని పెదవులమీద గరళానికి బదులు అమృతం చిలికిస్తుంది. ఎవరి బోగంది అది ఇప్పుడు ?

# మ ధు ర ప ర శు

"ఇన్నాళ్ళకు నీ గొడ్డలి తియ్యబారింది తాతా !" అంది బుచ్చి గంగమ్మ ముసలి యర్రయ్యతో. తాత యర్రయ్య "ఎట్లా తెలుసు నీకు ?" అన్నాడు. బుచ్చి గంగమ్మ "ఎట్లా తెలుసునేంటి—కూర్చుని తీరుబడిగా చెరుకుముక్క చీరుతున్నావు గొడ్డలితో !" తాత "ఓసి ! గంగీ ! గొడ్డలి తియ్యబారడమే కనిపెట్టావు కాని తాత పని చప్పబడి పోయిందీ అన్న సంగతెంచకనే పోయినావు గదా ? మఱి తాత బతకడు ! మఱి తాత బతకడు !" అంటూ యర్రయ్య బుచ్చిగంగమ్మ గుడిసెముంగిటి ముదిపాదు పందిరి యొక్క పంగటి గుంజకు జేర్లబడిపోయాడు. బుచ్చి గంగమ్మ వెంటనే "ఉండు తాతా ! ముక్కాలిపీట తెస్తా. దానిమీద కూర్చుందుగాని, కూర్చోలేకపోతే మడత మంచం వేస్తా దాని మీద పడుక్కుందు గాని ప్రాణం తెప్పిరిల్లేదాకా ! ముండాకాలం! ఇట్టే ముంచుకొస్తుంది ; ఎంతటి ఉద్దండులకైనా !" అంటూ బుచ్చి గంగమ్మ ఓ మడతమంచం పట్టుకువచ్చి ఆరుబయట పందిరిక్రిందనే వేసి తాత నల్లా ముక్కాలిపీట మీదుగా మంచం మీదకు వాల్చి పండుకోబెట్టింది. పండుకోబెట్టి "దాహం తేనా ?" అంది. "అక్కర్లేదు బుల్లీ ! నన్నిల్లా కాసింతసేపు వెల్లకితలా పడుకోనీ ! పలకరించకు" అన్నాడు వృద్ధు. "అయ్యో ! తెచ్చుకున్న చెరుకు తినకుండానే జీవమిడుస్తాడా యేంటి మా తాత !" అంటూ బుచ్చి గంగమ్మ నకమొకాలూ "మాతాత" అంటూ వీరావారా అన్నట్టు, పరకాయించి పరకాయించి, అంత

మేరలో కాపడుతూవున్న కామయ్యను కూకేసింది, "కామ య్యన్నా! నా బాబా! బేగి ఇలారా" అంటూ. చేతుల్ని రంగు రంగుల గాజులున్నాయి బుచ్చిగంగమ్మకు! ఆమె పిలుపులో అన్న వుంచేం "బాబు" వుంచేం! కామయ్య ఆమెయొక్క గాజుల మోజు మాత్రమే తిలకించాడు. చెంగున, తాను కూర్చున్న వేపచెట్టు వేలుపూవున పైకి లేచి, బుచ్చి గంగమ్మ పందిరికిందకు చేరుకున్నాడు. "యర్రయ్యతాత నిప్పుడేం చేయడానికి నాకేం తోచకుండా వుంది" అంది బుచ్చిగంగమ్మ కామయ్యకేసి, అదో మోస్తరుగా, దిగాలుగా చూస్తూ. కామయ్య "ఇందుకా? పిల్చావు? నన్ను?" అన్నాడు. తాతవంక ఏ మాత్రం తన చూపు లొంచకుండా అంత చూపూ—తేరిపారి—బుచ్చిగంగమ్మ కేసే పంచి సంకోచించకుండా!

కామయ్యకడుపు నిండిన ఖామందు. పుల్లలఅడితీ వొకటి అట్టహాసంగా నడుపుతూ అటు పడవవాళ్ళను ఇటు బళ్ళవాళ్ళను హడలేస్తూ పెద్దగొడవగా ఉంటాడు సర్వసాధారణం ఏపొద్దూ-కాని ఆ ఘడియప్పు డెంచేతో ఏవూహాలేకుండా కూర్చున్నట్టు కూర్చునియున్నాడు బుచ్చిగంగమ్మ నివాసానికి సాహసంగా వున్న ఒకా నొక వేపచెట్టు నీడపట్టు.

వేపచెట్టు అంటే అది వెఱ్ఱివేపచెట్టుకాదు. కుఱ్ఱవేపచెట్టూ కాదు. విశేషవిజ్ఞానం వున్న వివృద్ధ వృక్షం. దానికాబుద్ధి ఏదైనా అశ్వద్ధవృక్షాన్ని బట్టి వచ్చిందా అంటే దాని కొమ్మలగుండా కించిత్తు రావిపిలకైనా తొంగిచూచే జాడలేదు. కాని చూస్తే గొప్ప ఇంగితజ్ఞానం వున్న జీవకళతో విరాజిల్లుతూ వున్నట్టు గోచరిస్తుంది. వాడుక ఏమిటీ అంటే-ఆ చెట్టుకుయ్యాలా వేసికొని

అట్లాతద్దినాడూగిందా, ఆ ముష్టుగుమ్మ కడుపుని బ్రహ్మాండ నాయకుడు తప్పకుండా పుడతాడని.

లోకం బహు చమత్కారమైంది. యర్రయ్యతల్లి ఆలా వూగే యర్రయ్యను కన్నాదంట! యర్రయ్య మాత్రం అవూసు వినీ విన్నట్టు "వూగితే పిల్లలు పుడతారా?" అని అనేసి తన నిర్భాగ్యజీవనంతో పెనేసుకుపోయిన ఆ చెట్టును తిలకించి "ఉయ్యాలకొమ్మ కాదిది! ఉరికొమ్మ! దీన్ని నరికి పారేస్తే మెఱుగు" అని అనుకొనేవాడు అనేకసార్లు. అనుకొనేవాడేగాని దాన్ని నాటికీ నేటికీ నరికేసినివాడు కాలేకపోయాడు. పై పెచ్చు ఆ కొమ్మ నీడనే ఎన్నోపుట్లు చింతకర్ర, సిరిమానుకర్ర, కాడి కర్ర, కాటికర్ర, అడవినుండి దిగుమతీ అయిన నానాజాతి వనాన్ని తెగ్గొట్టి చీఱి చిద్రుపలు చేసి, అలసినప్పుడల్లా ఆ యుయ్యాలా కొమ్మంక చూడక మానీవాడుకాడు. చూచి నప్పుడల్లా "ఉయ్యాలా కొమ్మ కాదిది, ఉరికొమ్మ! దీన్ని నరికి పారేశెయ్యాలి రేపోమాపో" అని అనుకొని తీరీవాడు.

విన్నారా?—ఎన్నరాని కొమ్మ అది. ఎం చక్కటి కొమ్మ అది. ఏడాది పచ్చంకు ఇస కోసుకొన్నట్టు పూసివుండేది. తొలేకాసికి దానికింద నడుస్తూంటే టపటపా చితికీవి దానిగింజలు గొడ్లగిట్టకిందా గుఱ్ఱాల గొరిజలకిందాపడి. మఱి చిగురు చూస్తే దాని చిగురే చిగురు. దాని చేదేచేదు! అయినా చేదెవడు రుచి చూచాడు? మనిషైనవాడల్లా దానిగాలే పీల్చాడు గాని! దాని మీద గాలి సమస్త జాడ్యాపహారి. సంతతసంచారి.

యర్రయ్యయొక్క తల్లి బ్రదికివున్నవాళ్లా ఆ చెట్టు బలే వినోదకారి! అయితే ఆ వినోదం అంతైనా మానె కొంతైనా

ఎఱుగడు యఱ్ఱయ్య. యఱ్ఱయ్య అలా పుట్టాడు. యఱ్ఱయ్య తల్లి పైకొమ్మకు అలా వురోసుకొని చనిపోయింది. కొందఱు చనిపోయిందంటారు, కొందఱు రంటాలై యుందంటారు. ఏమంటేం ఆమె చావుతో ఆ చెట్టు క-పారమార్థికదృష్టి అలవడి పోయింది. దాన్ని చూచేవాళ్లు అప్పట్నుంచి దాన్నో చెట్టుక్రింద భావించక అదేదో దేవత అనే ఊహిస్తూ రాసాగారు. యఱ్ఱయ్యను "యథార్థపు యఱ్ఱ"య్యని అంటూ వచ్చేవారు. అంతే మరేం లేదు; సంతానం కలిగించడంలో చెట్టు యఱ్ఱయ్య ద్వారా తన దాఖలా కాపరించింది అని అనే వాళ్ళవూహ! అంతకు మించి లోకం యఱ్ఱయ్యలో యథార్థం కనిపెట్టిందీ లేదు. యఱ్ఱయ్య చెప్పిందీలేదు.

అసలు యఱ్ఱయ్యకు లోకం యథార్థం చెబితేగా యఱ్ఱయ్య లోకానికి యదార్థం ఏమైన ఋజువు చేయడానికి. యఱ్ఱయ్య చిన్నతనమంతా దూడలతోనూ గాడిదెలతోనూ, పందుల్తోనూ, పైలాళ్ళతోనూ, ఆడుకోవడంగానూ ఊళ్లో ఇళ్ళన్నీ అడుక్కోవడంగానూ గడిచిపోయింది. ఎవరైనా వేలెట్టి "వీడి తల్లే అదిగో ఆ చెట్టుకొమ్మను వురోసుకు చచ్చింది" అని అంటే అట్టే వెన్నుతట్టి పిల్చినట్టయి దృష్టిమఱల్చి, మఱేమన్నా చెబుతారేమో అని అడిగేవాడుగాని, ఆ యూసంతటితో ఆఖరై, అన్నవాళ్లకూడా ఆనవాలుకు అనీవారు కారు! పాపం! ఆ కుఱ్ఱ డికి. అయితే—పది పద్దెనిమిదేళ్లు వచ్చేసరికి వెన్నుముదిరి వన్నె కుదిరి తనంతవాడు మఱీలోకంలో లేడనేటంతటి యిదికి చువ్వలా యెదిగిపోయాడు యఱ్ఱయ్య!

పోలీసువాళ్లొకవంక వాడవదినెలొకవంక ఆ యువకుడి పేరు గుర్తింప సాగారు. కులమెఱుగని యఱ్ఱయ్యని గోత్ర

మెఱుగని యఱ్ఱయ్యని జామీను తెచ్చుకోమని పోలీసు లొక పెద నిర్బంధం పెడుతూవుంటే తమర్ని పెళ్ళాడితేనేగాని సంసారం నేత చెల్లబోతంటూ ఆతగులుకత్తెలు మఱో పెద నిర్బంధం పెడుతూవుండేవారు. ఈ విపరీత పరిస్థితిలో యఱ్ఱయ్య ఏదో వృత్తి అవలంబించి ఏదో కూటం ఏర్పాటు చేసుకొని, లోకంతో పాటు నాటకం ఆడుతూవుంటే తప్ప తన్నో రిజాలావానిగానో గుంపులాడుగానో కట్టేస్తారని భయంపుట్టింది యఱ్ఱయ్యకు.

ఇరవై యొకటవయేట ఒకనాడలా పైని వివరించిన వేప చెట్టు క్రింద యఱ్ఱయ్య పవళించి ఆలోచిస్తూవున్నాడు. యఱ్ఱయ్యతో సమాన వయస్కుడైన యొకానొక పెంకివెధవ యెవడో చటక్కున యఱ్ఱయ్యను చూచి 'చెట్టుకింద పుట్టినోడు చవటమ్మ' అన్నాడు. యఱ్ఱయ్య 'చెట్టక్కలేనివాడు చవటమ్మ' అన్నాడు. లాతివాడు గబగబా 'వేపచెట్టెవరెక్క లేరు?' అని పైకెక్కి పైనుంచి అమాంతంగా నెత్తురు కక్కుకు కిందపడి హతుడయ్యాడు.

నాటినుంచీ యఱ్ఱయ్యను ఎవ్వరూ అల్లరి చిల్లరిమనిషిగా ఎంచడం మానేసేశారు. ఎదో మహత్తున్నవానిగా తలపోయ సాగారు. యఱ్ఱయ్యయొక్క తల్లి పురిపోసికొందీ అంటే ఆమె మహాయిల్లాలు కాబట్టి పోసికుంది అని యఱ్ఱయ్య వినేలా అంటూ యఱ్ఱయ్యలో అదివఱకు చూడని తేజస్సు తాము చూస్తూ యఱ్ఱయ్యకు పెద్ద ఆత్మబలం తెచ్చిపెట్టారు.

యఱ్ఱయ్యకా ఆత్మబలంతోపాటు దేహబలంకూడా పెచ్చుపెరిగింది. 'నేను పుట్టి తల్లిని చంపాను కాబట్టి నాకాయుధం పరశురాములవారి గొడ్డలి' అని వోమంచిరోజున

ఓ అర్ధమణుగెత్తు గొడ్డలి ధరించి పుల్లలు కొట్టే జగద్విదితమైన వృత్తిని చేకొన్నాడు. ' ఆలోచనలేకుండా అదే పనిగా అడవి అంతా చెలిపివెయ్యమన్నా చెలిపెయ్యగలడు యర్రయ్య ' అన్న పేరు మోశాడు పెద్ద అడితిలోనూ చిన్న అడితిలోనూకూడా.

రోజుకో రూపాయన్నర సంపాదించి అర్ధరూపాయ కల్లు తాగేవాడు. పావలామాంసం తినేవాడు. మఠో అర్ధ మామోలు ఖర్చులకు వినియోగించుకునేవాడు. తక్కిన పావులాపెట్టి మసాళా పకోడీల పొట్లం వొకటి కొని చేతపట్టుకు రోజూ సాయంకాలం ఎక్కడికో పోతూ తిరిగి తెల్లాటి కాపడేవాడు. ఇలా ఇరవై అయిదోయేడు గడచిపొయ్యేదాకా మేకల్లో చింబోతులా పదిమందిలోనూ వెలసిపోతూవుండేతలికి యర్రయ్యను ఓ పొద్దు తెల్లతెల్లవాఱుతూవున్న వెల్లడినే ఓ ముసిలమ్మి పలకరించింది. నెరసిన తలకట్టూ అదీ, ముదికోనంగిలా వంగి వంగి ఎదురొచ్చి ' యర్రాయి ! యెక్కణ్ణుంచి వస్తున్నావు ! మీఅమ్మ వృత్తి సత్తికాలపు మనిషి—ఏలా కావులించుకు పడుకున్నావు నీవూ నీ మొగుడూ అని కోర్టువారు అడిగితే ఉత్తర సాక్ష్యంగా తాను చూపించలేక సిగ్గుపడి పూరుకుంది. దానితో దక్షిణ సాక్ష్యం ముల్లు చూపింది. నీ బాబు పురిశిక్షకు సెలవైంది. నీబాబు! నీలంగా వుండేవాడు. గోళికాయల్లా కనుపాపలూ వాడూ ! గిరజాలుండేవి. గోవిందనామం తీర్చుకుని గుడిసె యీవలకు వస్తూవుంటే గుళ్లో దేవుడుప్రయాణమైనట్టే యుండేది. అయితేనేం సర్కారుహాయాం ఇది ! సమస్తం లా రూల్సు ! నీ పిండమలా నీ అమ్మకడుపున బడ్డం ఏమిటి, నీ తండ్రినిలా రిమాండులో యుంచడమేమిటి ? రెండూ ఏకకాలమందే జరిగినాయి—' అనీ పెద్దనిట్టూర్పు ఆని

ముత్తెంలేని మోమునిండా కమ్మించుకుంటూ పలికింది. యర్రయ్య ' అయితే మా బాబుమీది ఖూనీకేసు తొమ్మిదినెలలు విచారణ జరిగింది—అన్నమాట. ' ముసిలిది ' నీవూ విన్నావూ? తొమ్మిదినెల్ల పదిహేనురోజులు జరిగింది. మఱి తీర్పు చెప్పిన పదిరోజులు కురితీశారు. ఉరి తీసినట్టుగా నీవు భూలోకంలో యవతరించావు. నీ తల్లి ఉరోసుకు చచ్చింది. మహాసతి మచ్చ లేని మగనితో చితెక్కినవాళ్ళనుగురించి విన్నాం గాని, శిక్షపడ్డ మగనివురితో వురోసుకున్న ఉత్తమరాల్ని చూసిందిలేదు. నీతల్లి కళ్లు చేరెడు చేరెడు కళ్లు. కాటుకెట్టుకుని, కనుబొమలు దిద్దుకుని కొప్పు గుద్దుకుని, గిద్దలో కుంకుంముఖాన్ని అద్దుకుంటూ ఉంటే నా కిద్దరే గాపకం వచ్చేవారు, ఆ శ్రీమహావిష్ణువు ఇల్లాలు మా లచ్చుమమ్మ, ఆశ్వరభశరభ శివుడు చేసుకున్న చిన్న గవిరమ్మ—ఈళ్లిద్దఱే తలపుకు తగిలేవారు. తక్కిన దేవతలూ తక్కిన నరమానవులూ మీ అమ్మకు లొక్కే. నీ కెలా ఎఱుక పఱచేది మీ అమ్మను ? ' అని కన్నీరు కార్చింది, వేన్నీళ్ళవాన గురియించినట్టుగా. యర్రయ్యకు దరీ అంచూ లేని వేంద్రం ఎత్తింది, ' ఇలా కావులించుకున్నాం ' అని చెప్పలేకపోయింది మా అమ్మ ఆ నాడు ' అని ఆ ముసిలి అవ్వను అట్టె కావులించుకుని బావురుమన్నాడు. ముసిల్ది యర్రయ్యను మఱంత బాబా కరంతో కావులించుకుని, ఇలా చూపించివుంటే బ్రతికిపోయీ వాడేమీబాబు. అయితే ఆ యిల్లాలు కోరట్లో ఎవర్నని కావులించుకుంటుంది. ఒకరా, యిద్దఱా ? వెయ్యినొక్క మంద్రై జడిజీతో సభ తీర్చి విచారించేరు. మీ బాబు, మీ అమ్మకు శానా లెక్కలో ఒక్కడూ బోనులో పులిలా పోలీసు కాపలాలో

నిలబడివున్నాడు. మీ అమ్మకు అనరాని సిగ్గు పుట్టింది. సచ్చు ప్రశ్న లీలాంటి వేస్తారేంటి ? ఇది సభా ?' అని ఈసడించు కుంది. విసుక్కుంటూ ఇవలకొచ్చేసింది.' యని జరిగినదంతా పూసగ్రుచ్చినట్టు ముసిల్ది తేటపఱిచింది. పాతికేళ్ళ యఱ్ఱయ్యా ముప్పాతికేళ్ళ ముసిల్ది ఒండొరులు కవుగిళ్ళడియుంటే, దారంట పోయినవాళ్లు ఆ యుదయం వాళ్ళిద్దర్నీ ఎవరో తల్లీకొడుకులు అని భావించక తప్పింది కాదు. కాని మూడోమనిషి దగ్గరకు వచ్చేసరికి ముసిల్ది యంతర్ధానమైపోతూయుండేది. యఱ్ఱయ్యా 'నేనే ! నా నొక్కడినే !' యనేవాడు.

ఈ సందర్భం వ్యాప్తం కాగానే యఱ్ఱయ్యా మహిమ హిమాలయం యెత్తుకెగసిపోయింది. నతని చూపులో చొక్క శోధనా విస్తరింపు గన్నాయి. తనతల్లి నెరుగుదుం అన్న ప్రతీ ముసీలివాళ్ళను ఏదో వొకటి అడిగి తెలుసుకునేవాడు. తల్లి వైనంతోపాటు అంతో ఇంతో తండ్రిని గురించికూడా పరీక్షగా ప్రశ్నించేవాడు. ఇంత తెలిసిన యఱ్ఱయ్యా ఇలా మనల్ని అడుగుతాదేమిటి అని ఎదరవాళ్లు యనుకొనేదాకాకూడా వొక్కొక్కప్పుడు నతగాని నడిగే వెఱ్ఱికి అంతుయుండేదికాదు.

'అందమైన కాపుదాన్ని తొల్త జేరతీసి ఆ పైని లేవదీసి తుదకేలాగో దానికులంవోళ్ళను బోల్తాకొట్టించి వివాహమై యఱ్ఱయ్యా కాపు అన్న కీర్తిగడించాడు కాని ఆ కీర్తి నిఖార్సు కీర్తి కాదనేవాడు. ఆలిమంత్రం ఆదిమంత్రం కాదన్నాడు. ఓ సాయంత్రం దాంతో ఆ కాపది యఱ్ఱయ్యాను పెళ్ళిచేసుకున్నాదే పెళ్లీలేదు పేరంటంలేదు తమకిద్దరకూనని యఱ్ఱయ్యాను వదిలేసింది. యఱ్ఱయ్యాయొక్క జీవితఖండంలో గుడ్డిలో మెల్ల

పిల్లలు లేకపోవడం. ఎంతలేదన్నా పెళ్ళాంగా ఆ కాపది యఱ్రయ్యతో పదిహేనేళ్ళయినా కాపరం చేసింది. తన అందం ఆనందం యఱ్రయ్యకు ఇచ్చి యఱ్రయ్య అందం ఆనందం తానుచ్చుకుని పదేపదే వొయ్యారాలు వైపులు మార్చుకుంటూ అడుగడుక్కీ రెచ్చిపోయారువాళ్ళిద్దరూ ఆ పదిహేనేళ్లూను. తాను పగలేసే పేడు చింతపేడో చీమచింతపేడో కూడా నేరనట్టుండేవాడు ఆ పదిహేనేళ్ళూ యఱ్రయ్య. ఆ కాపదికూడా తానరగ దీసేది బొచ్చు పరిగో బొమ్మిడాయోకూడా నేరనట్టు యుండేది.

అయితే భార్యాభర్తలు కలుసుకోవడం ఏలాంటిదో ఎడబాయడం అలాంటిదే. అందులోనూ పాటకపుజాతికి ప్రధానమైంది సంతానం. "ఆడివల్ల చేపడద్దీ అనుకొన్నది సిగ్గుచేటూ అవలే!" అని ఆ కాపది ఆడాళ్ల మాటగా వాళ్ళతో వీళ్లతో అంటూవచ్చి లోలోననుకొంటూ వచ్చి తుదకెలాగో వాని తంటా వదుల్చుకుంది. యఱ్రయ్య కూడా స్వేచ్ఛగోరుతూయున్న గడియలవి. గట్టుమీద లెక్కెట్టినా, పుట్టమీద లెక్కెట్టినా అరవై యేళ్లు వచ్చేశాయి యఱ్రయ్యకు.

మీసం అంతా ఏక టాకీగా నెరిసిపోయినట్టుంటేనే మెఱుగని నల్లవెంద్రుకలూళ్ళాగించుకునే షోకు నేర్చుకున్నాడు. ఊళ్లో పిన్నలూ పెద్దలూ "యఱ్రయ్యతాత! మా యఱ్రయ్య తాత" అని ఉబలాటంగా గొంతెత్తి సంబోధిస్తూయుంటే అతడే మాత్రం ఉడుక్కునీవాడుకాడు. డెబ్బైయోయేడు చొఱబడేలో మట్టి దుంగెత్తి దించలేక, గొడ్డలితో కొట్టలేక, విడ్డూరపు కబుర్లతో కాలక్షేపం చేస్తూ కథాద్యవసరానికి ఒక్క పాతయేగాణి

విలవచేసే చిన్న చెరుకుతుండు కొనుక్కొని బుచ్చిగంగమ్మ పంచకుజేరి గొడ్డలితో చీలుస్తున్నాడు. బుచ్చిగంగమ్మ చూస్తూ అంది 'ఇన్నాళ్లకు నీ గొడ్డలి తియ్యబాఱింది తాతా!' అని.

బుచ్చిగంగమ్మ తన రెండుకళ్ళూ చెమరించుకుంటూ "కామయ్యా! నా అన్నా! నా బాబూ! కుసింత ఎర్రయ తాతకేసి సూడు" అంది. కామయ్య బుచ్చిగంగమ్మ కళ్ళగంగ మీదుగా కనికారమంతుడై మడతమంచంమీది ఎర్రయ్య తాతను తిలకించాడు.

ఎర్రయ్యలో చలనం లేదు. కామయ్య కంగారుగా బుచ్చిగంగమ్మతో "మంచంమీదినుంచి కిందకు దింపి నీ తాత ముండాకొడుకు నలా ఆ చెట్టు కిందకు ఆ వేపచెట్టు కిందకు సాయంపట్టు" అన్నాడు.

బుచ్చిగంగమ్మ కామయ్యకు సాయపడింది. కామయ్య బుచ్చిగంగమ్మతో 'నీవు ఇవలకు వచ్చేసెయ్యి. వాడికి వాడే చస్తాడు. అది దయ్యాలకొమ్మ" అని భయపెట్టాడు. బుచ్చిగంగమ్మ ఇవలకు వస్తూ 'అది దయ్యాల కొమ్మేంటి కామయ్యబావా! ఉయ్యాలా కొమ్మంట కాదూ. దాన్ని అట్లతద్దినా డుయ్యాలావూగితే పిల్లలుడతారంటగా!" అంది అదో వెఱ్ఱి వాలకంగా.

కామయ్య "మగాణ్ణి నాకేం తెలుస్తుంది పిల్లలుట్టడం, తల్లులపడం. నాకల్లా తెలిసింది ఎర్రయ్య తండ్రి నా సెల్లెల్ని ఖూనీచేశాడని ఈ సెట్టేదానికి సాక్ష్యం. మఱి సూడు ఎర్రయ్య కొఱ్ఱగంజైనా తాగలేడు!" అని కామయ్య చేటభారతంలా చదివాడు.

ఆ చదువులో బుచ్చిగంగమ్మ కెదో అశనిపాత స్ఫురణల్లె గుండె కాశింది. చకితఅయింది. ఆమె గాజుల సందునుంచి రెండు బంగారు గాజులు ధ్వనిలేనివి కనిపించాయి కామయ్యకు. కామయ్య "నీవు బంగారు గాజు లెప్పుడు చేయించుకున్నావు ?" అన్నాడు. బుచ్చి గంగమ్మ "నావికావు. ఏనాడో సచ్చి స్వర్గాన్న వున్న మా అమ్మవో అమ్మమ్మవో కూడాను." అంది. కామయ్య గంగమ్మని దగ్గరుకు రమ్మని ఆ బంగారు గాజులింకా పరీక్షించి పరీక్షించి వాటిమీద తన తండ్రి పేరు ఇంటి పేరు నగిషీ గుండా చెక్కియుండడం చూసి "ఇవి మా సెల్లాయి గ్గాజులు !" అన్నాడు. బుచ్చి గంగమ్మ "అయితే మీ సెల్లాయి గాజులు మా అమ్మోనేనో ఖూనీ చేసి సంపాదించుకున్నాం అంటావా కామయ్యా మాంవా ? ఇది కలహాని క్కాలంకాదు. దెయ్యాలూ వ్రాస్తాయి అనేది అచ్చరాలు మా అమ్మ ! మతేమో ఎద్దుచ్చచ్చ రాలు తెలుసూ నీకు ? ఎర్రయ్య యొక్క తండ్రి నురి తీశా రంట కాదూ మీ సెల్లిని చంపినందుకు ?" అంది. కామయ్య బుచ్చి గంగమ్మ కనుపాపల్లోనికి నిదానించి చూస్తూ "అవునులే. ఉరితీశారులే ! మీ అమ్మ చనిపోయిందిలే. మా తండ్రీ కైలాస వాసి అయ్యాడులే. ఆ పోలీసులు ఆ జడిజీలువాళ్ళూ అందరూ అప్పుడే పోయారులే. ఎర్రయ్య కూడా ఆ కోవలోవాడేలే. డింకా కొట్టబోతున్నాడులే !" అని గర్రున త్రేన్చాడు. "భోజన మిప్పుడే చేసినట్టున్నావు కామయ్య బావా !" అంది బుచ్చి గంగమ్మ.—"అందుకే వేపవేరు వూతం కావలసి వచ్చింది లేచిరావడానికి ఇందాకాను." అని చిరునవ్వు నవ్వింది కూడాను.

కామయ్య వేపచెట్టుక్రిందకు చూచాడు. కడసారిగా కొమ్మకేసి కన్నుతెరచి కన్ను మూశాడు. ఎర్రయ్య కామయ్య కొమ్మంక చూశాడు. దిగువను ఎర్రయ్య భౌతిక శరీరం లేదు.

సశరీర స్వర్గంచూరకొన్న వానికి శరీరంపైకి పోయి ఆత్మ భూమి మీద యుంటుంది అని అనుకోడానికి వీల్లేని విషయం !

ఎర్రయ్య ఆ సరికి సగం చీరిన ఇక్షుఖండం బుచ్చిగంగమ్మ చేతబట్టి "దీనికి రెండెంపులా కణుపులే ! ఏం నవులడుతుందని ? కొనుక్కున్నాడో !" అని అంది. ఎర్రయ్య గొడ్డల్ని కామయ్య పైకెత్తి "దీనికప్పుడే చెప్పన్న సింవలు !" అన్నాడు.

# ఈ గండం గడవనివ్వండి

సుబేదార్ సుబ్రహ్మణ్యం చక్క లాగ తిరిగి వచ్చాడు నాలుగేండ్లు మిలిటరీలో ఫీల్డు సెర్వీస్‌చేసి—చెక్కు చెదరలేదు మనిషి ముఖాన్ని బొప్పికూడా ఎన్నడూ కట్టలేదట. మళ్ళీ పాశ్చాత్యఖండంలోని విజయం ప్రాచీన ఖండమందలి విజయం రెండూకూడా అతని వల్లనే సమకూడినాయంట—యుద్ధానంతరం తిరిగి వచ్చేటప్పుడు అతను దారిపొడుగుతా కోసిన కోతలు సుమండీ యివన్నీ!

ఏమన్నా, ఇల్లు చేరుకోవడంలో అతను పక్కా సివిలియన్ అయిపోయాడు—ఊపిరి లేనివానిలాగు కక్ష్యాంతరాలు దాటాడు. కొత్త మగమల్లే తనాబీలకేసి దూలాలకేసి చూడ సాగాడు. అతని పెండ్లాం లోగుమ్మంలోంచే అతణ్ణి పోల్చి పోల్చకో—"పోలీ! పోలీ!" అని కేకేసింది. పోలి ఆ యింటి వంటమనిషి వానిమనిషి కూడాను. చుట్టపు చూపంతా పోలిదే—ఇల్లాలు పట్టపురాణి.

పోలి వెంటనే వంట యింట్లోనుంచి వస్తూ—"యజమానిగారి రాక కెదురుచూచేం యీదాకా: రైలే రాలేదో విమానమే పోలేదో అని యోజించాం—బాబులకు కుశలమా?" అంటూ కాళ్ల కడుక్కునేందుకు నీళ్లు, ముఖం రుద్దుకునేందుకు సబ్బు—తువాలు—తుండుగుడ్డ అన్నీ తెచ్చి మండువాలో పెట్టింది.

సుబేదార్ సుబ్రహ్మణ్యం, మిగిలివున్న మిలిటరీ హోదాతో పోలినిచూస్తూ, ప్రక్కగదిలోకి వెళ్ళి, దిరీసు అదీ

తీసివేసి—ఆ గది యంతా నిర్మానుష్యంగా యున్న దానికి వగచి—"పోలీ!" యని కేకేశాడు—"వస్తున్నాను బాబూ! అమ్మగారు మేడెక్కారు, ఇప్పుడిప్పుడే—ఈ మధ్యను పడగ్గది వదలకుండా యున్నారు. ముప్పొద్దులూ మీ రేపొద్దు వస్తారో యని–తమరు ఫోంచేసి క్రింది గదిలో నిమ్మళించి నేపెట్టే ఫలాహారాలు స్వీకరించి–మాపటికి పైకెక్కుదురుగాని! తత్తర పడకూడదండీ సామీ! మీరు వెళ్ళినప్పటినుండి రోజూ రోజూ పట్టిన బూజులు దులపాల; గోడలకు వెల్లెయ్యాల–గులోబులు ప్లేట్లు సరదాల–ఎన్నిహంగులు ఏర్పాటు కావాల? ఇంత కాలాని కొచ్చారు! ఎంతో రాజ్యం జయించారు! ఏం పట్టు కొచ్చారు? నాకేం తెచ్చారు? మీ రాణీగారి కేం తెచ్చారు?–సుబేదార్‌గారూ!" అని అంది చిరునవ్వు నవ్వుతూ పూర్వ పరిచయం నెమరుకు తెచ్చుకున్నదై.

వంటింట్లో పులావులు, మసాళాలు, కోడిగ్రుడ్లు, వాడిగా వాసన కొడుతున్నాయి సుబ్రహ్మణ్యంకు.

స్నానమాడి తిన్నగా వంటిల్లు జొరబడి పోలి వడ్డించిన పదార్థాలన్నీ స్వేష్టకృతుగ భుజించి, పోలి సలహా ననుసరించి, పొద్దు కూకేదాకా వొద్దిక సందెలదేదాకా సందె వెలుగులు సమసి శయ్యా సంబరాలవేళ అయ్యేదాకా–కిందనే కాలక్షేపం గావించాడు. పోలితో మాటిమాటికీ "పోలీ" యంటూ, పోలికూడా తనకు సుబ్రహ్మణ్యం తెచ్చిపెట్టిన కొత్త వోణీ కొత్త కబ్బా ధరించు కొన్నదై సుబ్రహ్మణ్యంకు పగలంతా కావలసినంత సరదా తీర్చింది.

"పోలే ఇలాగుంటే—ఇంతగా తనను ఎత్తేస్తూవుంటే ఆలి యెలాగుండెనో అని ఊరికే సుబ్రహ్మణ్యం ఉవ్విళ్ళూరి పోసాగాడు." ఎప్పుడు ఎప్పుడు ఇల్లాలి దర్శన మన్నట్టు.

ఎట్టకేలకు పోలి "మేడమీదకు దారి తమ రెరుగున్న దేగా! ఇలా యెక్కండి!" అంది సరిగా రాత్రి గోడగడియారం పది కొడుతూవుంటే— సుబ్రహ్మణ్యం మెట్లకమ్మి సట్టుకు మేడెక్కుతూ వెనుదిరిగి "పోలీ! మీ అమ్మగారు చిక్కి వున్నారా యేమి? నెలనెలా నే పంపిన రెండువందలు అందేవా ఆమెకు?" అన్నాడు. "తినబోతూ రుచులడుగుతారు తమరు! మీరంపిన వందలూ అందేవి, ఆమె పుట్టింటా రంపే వేలూ చేరేవి—నన్ను చూస్తూయున్నారా? నాలో తీతాకోతా వుందా? అలాగ్గానే అమ్మగారూ ఈ మూడు ఏండ్లనుంచి ఆనందంగానే కాలంపుచ్చేరు. అయితే తమరు లేనిలోటు ఆమెకూ నాకూకూడా అంగుట్లో మెతుకు దిగనిచ్చేది కాదు. మమ్మల్ని మేడెక్కనిచ్చేది కాదు. తమరు వస్తారంటే ఈ పొద్దే ఆ తల్లి మేడెక్కింది నేను మేడ దులిపింది. మఱి ఆలోచించకండి! ఆలసించకండి! అమ్మగారు కులాసాగా నున్నారు. విలాసం కొపరుస్తారు. ఏటొచ్చీ మూడేండ్ల విరహం ఒక్కమాటుగా తట్టుకోలేక ఒక్కొక్క మెట్టే మీ రెక్కుతూవుంటే, వింటూ విడగొట్టుకోవాలని ఆమె కోరిక—తమరు పదండి పైకి—నాకు సెలవు" అంది పోలి.

సుబేదార్ సుబ్రహ్మణ్యం, పోలి చెప్పినదంతా నిజమే ననుకున్నాడు—నమ్మాడు పూర్తిగా ఆ ముండను ఆ వెట్టిముండా వాడు—మెట్లెక్కి పడగ్గదిలో తాను ప్రవేశించే అంతలో ఆలి ఎదురొచ్చి తనను గాఢాలింగనం గావించుకుని ఏకండీపూసెజ్జ

మీద పండపెట్టుకు పొరలిస్తుం దనుకున్నాడు. మెట్లన్నీ ఎక్కాడు టకటక—పడకగది తలుపు గొళ్లెమేసి లేదు కాని మూసివుంది. సన్నగా తోశాడు. విడింది—బార్లాచేశాడు—గది అంతా కనబడింది.

డబుల్ కాట్‌యొక్క రెండు మంచాలూ దూరదూరంగా వున్నాయి. వీపే చూపిస్తూ ఆమె " మీరు ఆ మంచంమీద పరుండండి. చటుక్కున నా మీద పడేరు గనక " అంది. " మోమన్నా చూపవదేమే చెలియా ! " అనే జావళీ ఓకొత్త దెత్తుకోవాలనుకొన్నాడు గాని సుబ్రహ్మణ్యం జంకి గొంకి వూరుకున్నాడు. ఆమె చూపించిన మంచంమీదనే వొరిగాడు. వొరుగుతూ " ఏం ! ఎల్లాగుందేం ? " అన్నాడు సుబ్రహ్మణ్యం. ఆమె, ఆ యింతి అటు తిరిగే అంది " బాగానేవుంది. కాని రాగలిగారా పోలిని విడిచి పైకి ? " అని అడిగింది.

అప్పుడు సుబ్రహ్మణ్యం ఇదంతా పోలి పన్నిన కృత్రిమ పన్నాగమని తన ఆలి నిర్దోషి అని తలపోసికొంటూ నిరుత్తరంగా ఇలా అన్నాడు : " తాన మాడకుండా బోనంకాకుండా సందెలడకుండా మేడెక్కడమెలా అనుకున్నావు క్షమించు ! " అన్నాడు. " క్షమించడానికేం లేండి ! ఈ మూడేండ్లనుంచి ఎంత మంది పొలతుల్ని పోలిలాంటి వాళ్ళని ఆలిలాంటి వాళ్ళని చూచి వున్నారో ! " " వొట్టు ! వొక్కళ్ళను చూడలేదు పిల్లా ! ఇల్లా తిరుగు——ఇటుచూడు ! ఒక్కళ్ళను కోరలేదు. " " మీకు ఈ మూడేళ్ళనుంచి ఆడదానిమీదకు మనసే పోలేదంటారా ? " అని గద్దించింది చూడకుండా అద్దంలో కనబడేలా.

సుబేదార్ సుబ్రహ్మణ్యం ఆ వంకకు మీసం మెలిద్రిప్పుతూ " యుద్ధభూమిలో మగవాని కసలు ఆడదానిమీదకు

బుద్ధిపోవడమే ? పోయిందో రంభే వానిముందు ! చచ్చి వీర స్వర్గ మందుకుంటూ రంభనే కౌగిలించు కుంటాడు. ఈ తుచ్ఛ మర్త్యకామినులే కావాలా వానికి ! లెగు—ఇదా నీ విరసానికి హేతువు " అన్నాడు. ఆమె " లెగడానికేం ! లెగుస్తాను—ఆడది యుద్ధభూమిలో చస్తే ఎవరిని స్వర్గలోకంలో కావులించు కొంటుందో ? " ఇంకా ఆమె ముఖం గోడెంపుకే వుంది. సుబ్రహ్మణ్యానికి రిమ్మెత్తి " ఆడది యుద్ధంలో చచ్చినా ఏమీ లేదు. వంటిట్లో చచ్చినా ఏమీలేదు. అలాంటి ఆశ యెదో పెట్టుకు ఏ నూతిలోనో గోతిలోనో దిగేవు గనక, మఱేదన్నా ఓఘాయిత్యం చేసేవు గనక—" అన్నాడు వారిగినవాడు వాక్కింత తలెత్తి.

భార్య " ఈ గండం గడవనివ్వండి ! ఆ ఓఘాయిత్యం మాట ఆలోచిద్దాం ! " అని వెల్లకితలా తిరిగి పడుకుంది. నల్లని చనుమొనల దిగు చాయనే ఆమెకు నెలలు నిండిన కడుపు !

సుబ్రహ్మణ్యం " ఎన్నోమాసం ? " అని అడిగితే మూడు తొమ్మిదిలు మోసేనంది. నాలుగేండ్లల్లో ఒక్కమూడు తొమ్మిదులేనా ? అని మగడడిగితే, పెళ్ళాం "పోలిని కనుక్కో" మంది.

పోలెక్కడుంది ? క్రిందలేదు. సందులోనూ లేదు. అక్కడికక్కడే. ఎవరికేకకు అది మళ్ళీ అందింది లేదు.

# ఫాన్సీ షాప్

"ఫాన్సీషాప్" అదో తన మనస్సో
అన్నట్టు యనిపించింది. మెట్లెక్కి
కొట్లోకి వెళ్ళడంతోనే గభీరన్నకు. ఒకానొక తెల్లటి ఏంగ్లో
ఇండియన్ పిల్లని ఒకానొక నల్లటి అరవ పిల్లని కనుగొన్నాడు.
ఇద్దఱికీ వయస్సు వొక్కటే, వాలకం వొక్కటే, వొయ్యారం
వొక్కటే—కానైతే ఒకామె గౌను తొడిగింది. మఱోఆమె చీర
కట్టింది. ఆ తేడా తప్పిస్తే, జుత్తుయొక్క షాంపూనింగునుంచి,
చేతులయొక్క గుత్తుల సొంపుదాకా, గుత్తుల సొంపునుంచి ఎత్తు
మడమల జోళ్ళదాకా ఒకటే ఫాషన్. ఇద్దఱూ కవలలా అని
అనిపించక మానదు, ఆ వెన్నుపట్టీలు చూచినా, ఆ నాదారు
నడుములుమీద ఆధారపడియున్న వొడుదుడుకులు చూచినా.

"గుడుగుడుకుంచం. గుండారామం, పాములపట్టం పడగా
రామం, కత్తెయ్యనా బద్దెయ్యనా ?" అని అన బుద్ధేస్తుంది
ఏలాంటి వానికైనా. అయినా ఏ మాట తిన్నంగా అడగరుగా
ఆడవాళ్ళను ? అందులోనూ అది ఫాన్సీషాపు ! ముందుగానే
వాళ్ళని పలకరించాలనే నిసబు అక్కఱలేదు. నీవు ఆ కొట్టులో
యున్న ఒక బొమ్మను చూస్తూవున్నట్టు, ఒకహైయో రిబ్బనో
నాణెం కడుతూవున్నట్టు. ఒక చైర్లో కూర్చుంటూ వున్నట్టు
ఎన్నైనా పోకిళ్లు పోవచ్చు. ఎంతకాలమైనా గడపవచ్చు.
ఏ వస్తువూ కొనకుండా ఏమీ అనకుండా నేరుగా నీ దగ్గరకువచ్చి,
అతి పొలైట్‌గా షాహుకారు వచ్చి, "ఏం కావాలండీ తమకు ?
చాలా సేపట్నుంచి వెతుకుతూ వున్నట్టున్నారు. మా కొట్లో

లేని సరుకు ఈ ప్రపంచంలో లేదు" అని అనే పర్యంతం అక్కడే డేరా మేకులా వుండవచ్చు.

అయితే ఆ లేడీస్ అక్కడ వున్నంతసేపు కొట్టు అతడు తన్ను చూచే స్థితిలో వుండబోడు అని గ్రహించాడు కాస్సేపట్లోనే గభీరన్న. "అబ్బ!" అన్నాడు. కొట్లోవాళ్ళందఱు గభీరన్నకేసి దృష్టిసారించారు. గభీరన్న వోబుష్‌కోటూ ఇతడూ కతక్ మనిపించాడు అంతమందినీని.

"హల్లో గభీర్! గుడ్‌మార్నింగ్" అన్నారు ఇద్దరు లేడీస్‌కూడా! "గుడ్ మార్నింగ్, షాపింగ్ అయిందా?" అని అడిగాడు వాళ్ళను గభీరన్న ఏ విధమైన ఇరుకూ తన హృదయంలో లేనివానికిమల్లే. "కొన్ని గంటలముందే అయిపోయింది" అన్నాది అరవ పిల్ల నవ్వుతూ. నల్లటి ముఖము మీద ఎఱ్ఱటి "కోరల్" "లిప్సు" అదీ. లిప్‌స్టిక్ సొంపు లేండి అదంతా. "తెల్లాటి ఒక్కగంటే అయింది" అన్నాడు గభీరన్న రిస్ట్‌వాచ్ చూచుకొంటూ. "కొట్టిప్పు డెనిమిది గంటలయితేనేగాని తెరవనేరాదు మేము" అన్నాడు కొట్టన్న. "అట్లా అయితే ఒక అరగంట మన మిక్కడ వృథాపుచ్చాం అన్నమాట" అని రిచ్చపోయినట్టు తన గడియారం చూచుకొంది. "నే నిక్కడ 8-15 నుంచి వున్నాను" అన్నాడు గభీరన్న. "నీవూ మేమూ ఒకతూరి ఈ షాపులోకి దూరి వుండవచ్చును" అంది ఏంగ్లో ఇండియన్ లేడీ.

యుద్ధం ముగిసిపోయినా ఈ తగులాటం తనకు తప్ప లేదురా బాబూ! అని ఒకింత తలపోశాడు గభీరన్న. "ఏమిటి ఆలోచిస్తూ వున్నావు?" అంది అరవపిల్ల. "ఏమీలేదు—ఏది వారి బిల్లు షాహుకార్!" అని షాహుకారునుండి బిల్లు తీసి

కొంటూ పదిరూపాయల నోటు తన జేబులోంచి తీసి ఇచ్చేశాడు. " ఇద్దఱు ముద్దియలు థాంక్సు చెబుతూ తిరిగి కలుసుకుంటాం గభీర్ " అంటూ వెళ్ళిపోయినారు. ఆ ఆడవాళ్ళిద్దఱూ వెళ్ళి పోయినారు.

" ఆ ఆడవాళ్ళిద్దఱూ మీ కేమవుతారు ! " అని అడిగాడు కొట్టన్న. " ఆ ప్రశ్న వేసేకన్న మీ కేం కావాలి ? అని అడిగితే నా కాలం నీ కాలం మఱి వృథా కాదు " అన్నాడు కొంచెం ముఖం కుచించుకుని గొంతు చించుకొని గభీరన్న. " సారీ ! తమకు ఏం కావాలో సెలవియ్యండి. సారీ ! నిలబడిపోయారు. ఈ నుంచీని " అన్నాడు అతి భయభక్తులతో.

" నాకు బూట్‌లేస్ కావాలి " అని బూట్ చూపిస్తూ. " అదివఱకిట్టిది యీ మెట్లెక్కుతూ వుంటేనే ఫట్ మని తెగి పోయింది " అన్నాడు కూడాను. షాహుకారు " థాంక్సు ! వెరీ గ్లాడ్ ! మా కొట్టు మెట్లు చాలా అదృష్టం చేసుకున్నాయి. పట్టు లేసులేనా తమరడుగుతూన్నది ? " అన్నాడు సరుకు తీస్తూ. గభీరన్న " అవే " అని అంది పుచ్చుకు వంగి అమర్చుకుంటూ నేలబారు చూపు ఆ వెళ్ళిపోయిన స్త్రీరత్నాలకేసి తారాజువ్వలా వదిలాడు.

" నిండా బాగున్నాదండీ మీ బూట్సు కాలేస్ " అని షాహుకార్ లేపేదాకా మేలుకోనేలేదు అతగాడు.

" మీ కొట్టుమెట్లు దిగడంలో తెగిపోకుండా వుండాలి " అంటూ టకటకా దిగేడు. ఆ స్త్రీ రత్నాలు ఆ ధ్వని కతనికేసి తుపాకి రవ్వల్లాంటి చూపులు వదిలేరు.

దాంతో గభీరన్న బూట్‌లేస్ అప్పుడు కొన్నదైనా ఫట్ ఫట్ ! కొట్టుమెట్లు పూర్తిగా దిగకుండానే గాన్‌ఫట్ !

## రెండు గుండెల ఫిల్మ్ స్టార్

దగ్గర్లో అందమైన స్థలం.

ఆ స్థలంలో నిలబడివుండి తొలి చేష్టగా ఆమె తెలినవ్వు నవ్వింది. సిగ్గు తెరచాటు లేదు. అరచిటికె వ్యవధిలేదు. ఆమె తొలిచూపే కలువుగోలు పూతూపు అయి వెల్లి విరిసింది. ఆమె ఎవరా అని ఆలోచిస్తూ ఆగిపోయాడు పురుషోత్తమరావు.

పురుషోత్తమరావు గొప్ప ఎల్లోపాథిక్ డాక్టర్. వెంటనే ఆమె నవ్విన నవ్వులో ఆమె చూచిన చూపులో "ఏదో జాడ్యం యనుమానించాడు. జాడ్యం యనుమానించాక యడిగితెలుసుకు తగిన చికిత్స చేయడం తన విధ్యుక్త ధర్మం అని తలపోసే హృదయంగల భిషగ్వరేణ్యుల కోవలో వాడు కావడంచేత మన డాక్టర్ వెంటనే "ఏమిటండి: అలా నవ్వుతారు? అకారణంగా?" అని అడిగాడు ఆమెను. ఆమె మంచి మనసు మనిషిలాగే తెప్పలార్చి " ఏమీలేదు. మీ దగ్గఱ స్కోప్ వున్నట్టుందే!" "మీటర్ కూడా వుందా?" అని అడిగింది. డాక్టర్ తనకోటు ప్రక్కజేబులోంచి తొంగిచూస్తూ వున్న పనిముట్టుమీద చేయివేసి 'You mean stetho? Yes! You mean thermo? Yes!" అని రెండోపనిముట్టు కోటుపై జేబులోంచి పైకి తీసి చూపాడు.

ఆమె "డాక్టర్ సాబ్! ఒక పర్యాయం ఇలా వచ్చి నన్ను ఆమూలాగ్రంగా పరీక్షించండి! మీ వద్ద వున్న ఆ గుండె రొద కొలగొట్టంతోటి ఆ వేడి కొలగాజు పుల్లతోటి!" అంది. డాక్టర్ "స్టెథస్కోప్! థెర్మో మీటర్" అంటాం మేం ఈ రెండింటినీ వరుసగా యంటూ సమీపించాడు. ఆమె "మేమూ అలాగే పిలుస్తాం పూర్తిగా పిలిచేటప్పుడు. ఒక్కొక్కప్పుడు

తెనుగున చెప్తాం. అయితే తెనుగులో "రాద" యన్నా "పుల్ల" యన్నా బాగుండదు చూడండీ; యందుకని తెనుగులో ఎప్పుడూ పూర్తిపేర్లే చెప్తాం" అంది. డాక్టర్ గాజుపుల్ల దులుపుతూ పాద రసం యవరోహణం పరికించి "ఈ పుల్ల నాలిక్కిందపెట్టి వుంచండీ రెండు నిమిషాలు." యని అందిచ్చాడు థెర్మోమీటర్ అందిచ్చి,—ఆమె నాలిక్కింద దాన్ని ఆలా వుంచుకుంటూంటే,— "మీరు ఆంధ్రుల్లా మాట్లాడుతున్నారే!" అన్నాడు డాక్టర్ ఆమె—పెట్టుకున్న పుల్ల ఇంకా వేడి గ్రహించకుండానే—డాక్టర్ అన్న మాటకు ఉబ్బిపోయినట్టు పుల్ల ఈవలకు తీసి "ఆంధ్రు ల్లాగేమిటి? నేను ఆంధ్రస్త్రీని" అంది. డాక్టర్ "తీసెయ్యా కండి పుల్ల. ఆలాగే ఉంచుకోండి మఱి రెండునిమిషాలు" అన్నాడు. ఆమె కూర్చొని నిదానంగా థెర్మోమీటర్ నాలిక్కింద పెట్టుకుని ఆలోచనలో నిమగ్నురాలైనట్లు రెండు నిమిషాలు నిమీలిత నేత్ర అయింది. డాక్టర్ ఆ రెండు నిమిషాల్లో పరిసర స్థల సౌందర్యం విలోకింప సాగేడు.

ఆమె థెర్మోమీటర్ నోట్లోనుంచి వెలికి తీసుకున్నదై తనకుదా చూస్తూవుంది. డాక్టర్ "ఇలా ఇవ్వండి. నేచూచి చెప్తాగా! ఈ ప్రాంతం బహు సుందరంగా, ప్రకృతి లలితంగా వుందే? పూలతీగలు! పండ్లచెట్లు! మీదేనా ఇది?" అన్నాడు. ఆమెచేతను వున్న గాజుపుల్ల తానందుకుంటూ. ఆమె "ఈ వర్త మాన ఘటికయందు నాదే యీ స్థలం. ఇక్కడనుంచి నన్నెవ్వరూ కదపలేరు. మెదపలేరు. మీరుకూడా కూర్చొంటే కూర్చోవచ్చును. వద్దనదు ఎవర్నీ యీ చోటు!" డాక్టర్ "వద్దనడానికి స్థలానికి నోరుంటుందా? ఏమిటి? ఆ హక్కుమీది" అంటూనే గాజుపుల్ల నెక్కిన వేణ్ణి పరిశీలించేడు. "నార్మల్! పూరా నార్మల్; సర్వ సాధారణంగా మానవస్త్రీకి ఎంతవేడిమి వుండాలో అంతే చక్కని వేడిమి చూపిస్తూవుంది యీపుల్ల" అన్నాడు. ఆమె వెల్లకితలా

పండుకుంటూ "గుండె?" అంది. డాక్టర్ స్టెథస్కోప్ మెలివిడదీసి యధావిధిగా ఆమె గుండెకాయ పరీక్షించాడు. మరిన్నీ వెన్ను చూపించమని ఆ వంకకూడా పరీక్షించాడు. డాక్టరుకు ఆమెలో ఏమిన్నీ రుగ్మత కనిపించలేదు. "ఒ. కె." అన్నాడు, ఒ. కె. అన్నా ఏదో అనుమానం తట్టి "అయితే" అన్నాడు వెంటనే. ఆమెకు తన చేయి ఆసరాయిస్తూ ఆలా లేవనెత్తి కూర్చునేటట్టు చేశాడు. ఆమె లేచి కూర్చుని చిరునవ్వు నవ్వుతూ "కూర్చోండి! ఇలా విశ్రయించండి! 'ఒ. కె.' అంటూ 'అయితే' అన్నారే? I have the word pregnancy ! మీ డయగ్నాసిస్ ఎలా వున్నా ప్రెగ్నెన్సీ అన్న పేరు మాత్రం దానికి పెట్టకండి. అదంటే నాకు పరమాసహ్యాం" అంది. డాక్టర్ 'ఆమె ప్రక్కన కూర్చుంటూ ఆమె అందిచ్చిన సూచన అవలోదనం గావించుకు 'తమవంటి వారిని ప్రెగ్నెంటు అనడం ఎట్లా?—అయితే—అన్నా నని మీరలా జడిశారేమోగాని ఆలాంటిదేమీ లేదు. నా వ్యాధి శోదే వేఱు. మీది ఇప్పుడు ఒక గుండెకాదు. రెండుగుండెలు! అదీ నా పరిశోధన పర్యవసానం' అన్నాడు. ఆమె 'అల్లా నామ కరణం చేయవలసినదిగా మా ప్రొప్రయిటరుకు సలహా చెప్పండి. "Film star Pregnant" అని ఆయనా ఆ పేరు పనికిరాదని నేనూ ఇంతవఱకూ వివాదపడి యిటు వచ్చాను.

పురుషోత్తమరావు 'నేను డాక్టర్ని! కావలిస్తే అలా మెడికల్ సర్టిఫికెట్ వ్రాసివ్వగలను గాని ఫిల్మ్ పేరు పెట్టడంలో మీయజమానికి సలహా యివ్వడం అనేది నాస్వధర్మ నిర్వహణం కాదు.' అన్నాడు. ఆమె 'అట్లానే కానివ్వండి. మీకు తోచినట్టు సర్టిఫికేట్ రాసియివ్వండి' అంది. డాక్టర్ 'సలహాఫీజూ, సర్టిఫికెట్ ఫీజూ నేను ఛార్జి చేసేది మీకు తెలుసునా?' ఆమె 'అది అప్పుడే చేత్తో పట్టుకునే వున్నాను. పాతికరూపాయల కంటె ఎక్కువ వుంటుందా?' పురుషోత్తమరావు రెండుకళ్లూ విభవ

విస్ఫారితాలయినాయి. ఎప్పుడు తీసిందో పైకి ఎక్కణ్ణించి తీసిందో అయిదు అయిదు రూపాయలనోట్లూను అని ఓ ప్రక్క అప్రబం అతణ్ణి పరిభ్రాంతుణ్ణి గావిస్తూవుంటే ప్రక్క ఊటకలం తెల్లనికాగితంమీద చఅచటా నడచిపోతూవుంది.

ఒకక్షరం ఏదో వ్రాసి ఆమె ముఖం వంక ఆమె పేరు కోసమో లేక క్రొత్త ఇన్స్పిరేషన్‌కోసమో ఎందుకో ఆలా చూచేడు ఆమె ఏదో అస్యుల అలికిడి విన్నట్టు పెడమొగమై మళ్లీ డాక్టర్ వంకకు తిరిగి 'మీరు సర్టిఫికేటు వ్రాయసక్కఅ లేదు. మీ కలం 'రొంబ నైసుగా వుందే' అని ఆ కలం అతడను కోని తమాషాగా తనచేతిలోనికి తీసికొంటూ 'మాప్రొప్రయిటర్ యిలా వస్తూవున్నారు నా కోసమని ఆయన్తో నా విషయమై మీకు తోచిన నిజం చెప్పివేసి వేయండి. మా ప్రొప్రయిటర్ యొక్క అభీష్టం మరేమీలేదు. స్టార్‌యొక్క దైవిక మానసిక నిజాను భవాన్ని బట్టి ఫిల్ముకు పేరు వుంచితే ఆ ఫిల్ము ఆమె బాగా స్వానుభవశుద్ధిగా నటిస్తుందనీ! అందువల్ల ప్రేక్షకబృందానికి ఉత్తమోత్తమ వీక్షణీయంగా వుంటుందనీ!'—అంది. డాక్టర్ 'అంటే? నాయకి టి. బి. పేషంటు అయితే ఫిల్ముకు టి. బి. పేరుపెట్టి తీరుతారు అన్నమాట?' అన్నాడు. ఆమె 'అదే మనం ఇప్పుడు చూడాలి! అయినా ఆ తుది గొడవ అంతా మీ కెందుకు? ఇదిగో మీ పాతికరూపాయల ఫీజున్నూ. మీరు నా బొందిని తెలుసుకున్న ఆమయనామం ఆయనకు సరిగ్గా వివేచించండి. అర్థమయ్యేటట్టు—అంతే నాక్కావలసింది' అంది.

ఈ సంభాషణాదులు ముగిసేసరికి ఫిల్ము ప్రొప్రయిటర్ 'పిళ్ళారి సెట్టి'—అరవ—వారి సరసకు చేరుకుంటూ 'నేను నీకోసం గాను ఇంత సేపట్నుంచీ వెమకుతున్నాను! ఇంగ ఇర్కి?' అన్నాడు, ఆమెను అవలోకిస్తూ ఆమెయొక్క రెండోప్రక్కకు అనగా డాక్టర్ వున్న ప్రక్కకు కాకుండా రెండోప్రక్కకు దరిసి

కమలాలపాళ్ళ మెటిసిపోతూ, ఆమె ' మీరేద్తో సమస్యలో పడి వుంటే నాకేం తోచక ఇలా వచ్చాను విశ్రాంతికోసం.' ప్రొప్రయిటర్ మంచిపనిచేశారు. 'ఇప్పటికైనా తేలిందా మీరుజ?' డాక్టర్ 'తేలడానికేముంది? ఆమెకు ఏ జబ్బూ లేదు. రెండుగుండెలజబ్బు తప్ప ' అన్నాడు అప్రయత్నంగా. ప్రొప్రయిటర్ ' మేము సస్పెక్టు చేసిందీ అదే! పిల్లగుండె! తల్లిగుండె! పేరు ప్రెగ్నెన్సీ అన్నాం మేము. మీరేమన్నా రెండుగుండెల జబ్బు అన్నారు. ' డాక్టర్ ' రెండుగుండెలంటే అది కాదు నా తాత్పర్యం. హార్టు! స్వీట్ హార్టు ' అన్నాడు. ప్రొప్రయిటర్ ' మీ తెనుగు ఎప్పుడు విన్నా ఇంగ్లీషుకు తర్జుమాచేసుకు తెలుసుకుంటెనేగాని మా బోంట్లకు అర్థం కాదండీ! ఎవరా స్వీట్ హార్టు? ' అని ఏదో ఊహించేడు.

ఆమె తిన్నని తేజంతో. మత్తెక్కించే మధురిమతో, మాటలకందని మమైక్యంతో పురుషోత్తమరావుకేసి అతడే తన స్వీట్ హార్టు అన్నట్టు దృష్టి సారించింది.

ప్రొప్రయిటర్ ' అట్లా అయితే రేపట్నుంచే షూటింగు ప్రారంభం!

అయ్యా! తమ పేరెవరో? క్షమించండి! మిమ్మల్ని నాయకపాత్ర ధరించవలసినదిగా కోరుతున్నాం. ఇది లోక బ్రహ్మానందంగాను, విశ్వమోహన సంకల్పంగాను భావించి, మీరు మమ్మల్ని అనుగ్రహించవలసినది. '—

'అనుగ్రహించవలసినది' అని పిళ్ళారిసెట్టి ఆఖరుమాటకు వచ్చేలో తదనుగుణ్యంగా, ఆమె తన్నాయనికి, తాను కూడా ' అనుగ్రహించవలసినది ' యని బ్రతిమాలుకొంటూ వున్నంత ఇదిలో ఏదో రహస్యప్రబోధ గావించింది. కంటితోనో, పెదవితోనో, వివరంగా చెప్పడానికి వల్లగానంత అద్వైతంగా!

పురుషోత్తమరావు కాదనలేకపోయాడు. ప్రతిఫలం తో త్తి అడగబోతూనే నిదానించి అన్నీ ఆమె యనుగ్రహంలోనే

యున్నట్టు ఎంచుకొని ఉద్రిక్తుడై 'ఫిల్ము పేరు ? యన్నాడు. ప్రొప్రయిటర్ 'మటీ ప్రెగ్నెంటు అనం ! రెండుగుండెల ఫిల్ము స్టార్ !' యని పేరు పెడుతున్నాం మీదయాగ్నోసిస్ ననుసరించి గుడ్‌నైట్ టుయు బోత్' యన్నాడు నిష్క్రమించేడు.

ఆమె 'అమ్మయ్యా ! మీవల్ల బ్రదికిపోయాను' యని లేస్తూ 'గుడ్‌నైట్ మై నాయక్ !' యంది, పురుషోత్తమరావును సాగనంపే చనువు అనువు యంతా 'నాయక్' యన్న పదోచ్చారణలో శంఖంవూదులా పూరిస్తూ, పురుషోత్తమరావు 'గుడ్‌నైట్ మైలావ్ ! రేపు కలుసుకుంటాంగా మళ్లీని ?' అన్నాడు.

ఆమె 'ఈ మాదిరి సమాగమం కాదు మన రేపటి సమాగమం ఈ వైపుగా ఈ వెనకటి మార్గంగా రాకూడదు తమరు రేపు. ఇది ఫిల్ములాండుయొక్క పెరటినేల లేక బాక్‌గ్రౌండు' సింహద్వారం యసలు దర్వాజా మెయిన్‌రోడ్డుమీదకు వుంది. అలా దయచేయాలి తమరు, అటూ ఫ్రంట్. ఇది బాక్‌డోర్' అంటూ ఆమె దగ్గర్లోని స్థలసౌందర్యం పురుషోత్తమరావుకు ఎరుకపరుస్తూ 'ఫిల్ములాండు ఫ్రంట్ యంతా దుమ్మూ ధూళీ, గడ్డి మొలకైనా కనిపించదు. వెనుతట్టే అంత బ్యూటీ అంత ఎంజాయ్‌మెంటు-ఎట్లా వున్నాయో చూడండీ పండ్లచెట్లు ! పచ్చిక పట్లూ !' యన్నిటికంటె మనం ప్రథమతః కలుసుకున్న చల్లని తావు. ఆ ఎన్జోయ్‌మెంటు ఆ రంజు మళ్లీ మనకు లభిస్తుంది యని యనుకోను. good night my hero !' యంది పూర్వం కంటె 'హీరో' పదోచ్చారణలో స్థాయి ఇనుమడిల్లేలా.

వారివారి నడుము కడసారి వీడుకోలునాటి యనురసంధ్యే చెప్పిందో ? యర్ధనేత్రో చెప్పిందో ? యప్పట్లో ప్రణయవాహినికి కాలవాహిని ఉపశాఖై యంతరించి వూరుకుంది !

సమాప్తం

# ఇందులో కధలు